# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 7 సంచిక : 4 హైదరాబాద్ 93 ఏప్రిల్ 2009 పేజీలు : 60 రు. 10

- ఫోకస్ : ఎన్నికల వేళ సామాన్యుల అభిప్రాయాలు
- ప్రజాస్వామ్యమంటే ఎన్నికలేనా?
- సైన్యం పడగనీడన ఈశాన్య రాష్ట్రాలు
- షికాగో కార్మికుల వినూత్న ప్రయోగం
- తమిళనాడులో ఏం జరుగుతోంది?
- మాదిగ సాహిత్యం విశ్లేషణ

## వీక్షణానికి మీ చేయూతనందించండి !

ఆరు సంవత్సరాలుగా ప్రతినెలా మీతో సంభాషిస్తూ, సమకాలీన రాజకీయార్థిక, సామాజిక పరిణామాలపై కొత్త ఆలోచనలను, వైవిధ్యపూరితమైన చర్చను ప్రోత్సహిస్తూ, మీ ఆదరణ చూరగొంటూ వస్తున్న వీక్షణం తన ఆర్థికస్థితిని కూడ మీతో పంచుకోదలచుకుంటున్నది.

వీక్షణం ఇప్పుడు నడుస్తున్న పద్ధతిలో, పెరుగుతున్న న్యూస్ ప్రింట్ ధరలు, ప్రింటింగ్ ఖర్చులు, కార్యాలయ నిర్వహణ, పోస్టింగ్ వంటి ఖర్చులన్నీ కలుపుకుంటే ఒక్కొక్క ప్రతికి ఉత్పత్తివ్యయం రు. 14 గా ఉంటున్నది. కాగా ప్రతి సంచికకూ చందాదారులు చెల్లించేది రు. 10. అందులో పోస్టేజి ఖర్చులు మినహాయిస్తే వాస్తవంగా చెల్లిస్తున్నది రు. 9 కన్న తక్కువ. పత్రిక విడిప్రతిని దుకాణాలలో కొనుక్కునేవారు రు. 10 చెల్లించి కొనుక్కున్నపటికీ, ఏజెంట్ కమిషన్ పోగా వారి నుంచి పత్రికకు అందేది ఒక్కొక్క ప్రతికి రు. 6 మాత్రమే. అంటే పత్రిక ఒక్కొక్క ప్రతి చందాదారుల విషయంలో రు. 5 లోటుతో, విడిప్రతి కొనుగోలుదారుల విషయంలో రు. 8 లోటుతో నడుస్తున్నదన్నమాట. పత్రిక ఎన్ని ప్రతులు ఎక్కువ అమ్ముకమైతే అంత ఎక్కువగా లోటు పెరుగుతుందన్నమాట. ప్రస్తుతానికి ప్రతినెలా రు. 25,000 లోటుతో పత్రిక నడుస్తున్నది. ఏ పత్రిక అయినా తన ఉత్పత్తి వ్యయాన్నంతా పాఠకులనుంచే రాబట్టడం జరగదు. ఉత్పత్తివ్యయంలో కొంతభాగాన్ని ధరగా నిర్ణయించి మిగిలిన భాగాన్ని వ్యాపార ప్రకటనల రూపంలో సేకరించడం ఆనవాయితీ. ఎన్ని ఖర్చులు పెరిగినా గత నాలుగు సంవత్సరాలుగా ధరనుగాని, వార్షిక చందాను గాని పెంచలేదని, వీక్షణంకు ఇప్పటివరకూ ప్రభుత్వ ప్రకటన తప్ప ఇతర ప్రకటనలు కూడా ఎక్కువగా రావడం లేదని మీకు తెలుసు. వీక్షణం ను నిర్వహిస్తున్న సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ సంస్థ సర్వేలు చేయడం ద్వారా సంపాదించిన నిధులను వీక్షణం కొరకు ఖర్చుపెడుతున్నది. ఆ పరిస్థితి ఇంకా ఎక్కువ కాలం కొనసాగే అవకాశం లేదు.

ఈ పరిస్థితిలో వీక్షణంను ఆదుకొని, ఆర్థికవనరులను కల్పించి, మనుగడను సుస్థిరం చేయవలసింది మీరే. ఇది మీ పత్రిక, దీన్ని కాపాడుకోవడం, పది కాలాలపాటు నిలిచేలా చూడడం మీ బాధ్యత.

అందుకోసం

- పాఠకులందరూ చందాలు కట్టవచ్చు.
- ప్రతి చందాదారూ మరొకరిని చందాదారుగా చేర్పించవచ్చు, లేదా మిత్రులొకరికి వీక్షణం సంవత్సర చందా కానుకగా ఇవ్వవచ్చు.
- మీ గ్రామంలో, పట్టణంలో మీకు తెలిసిన దుకాణదారు వీక్షణం తెప్పించేలా, సక్రమంగా బకాయిలు చెల్లించేలా చూడవచ్చు.
- మీకు తెలిసిన వారెవరయినా వ్యాపార ప్రకటనలు ఇవ్వగలిగిన స్తోమత, అధికారం కలిగి ఉంటే వారిద్వారా వీక్షణంకు ప్రకటనలు ఇప్పించవచ్చు.

**వీక్షణంను ఆదుకోండి**

**తెలుగునాట ఇటువంటి పత్రిక ఇది ఒక్కటే, దీని మనుగడకు, విస్తరణకు మీ చేయూతనందించండి**

### చందా వివరాలు

| | | | |
|---|---|---|---|
| సంవత్సర చందా | రు. 120 | మూడు సంవత్సరాల చందా | రు. 350 |
| ఐదు సంవత్సరాల చందా | రు. 550 | పది సంవత్సరాల చందా | రు. 1000 |

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.

ఫాక్స్, ఫోన్ : 040-66843495, ఇమెయిల్ : veekshanam2003@gmail.com, reachcdrc@yahoo.com

సర్క్యులేషన్ మేనేజర్ : 9949391028

# వీక్షణం 93

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

ఏప్రిల్ 2009
సంపుటి : 7
సంచిక : 4

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ



గౌరవ సంపాదకులు :
**వి. హనుమంతరావు**

సంపాదకులు :
**ఎన్. వేణుగోపాల్**

సహాయ సంపాదకులు :
**డి.వి.రామకృష్ణారావు**

కరస్పాండెంట్ /
సర్క్యులేషన్ మేనేజర్ :
**వై. రామచంద్రం**
**9949391028**

కరస్పాండెంట్/సబ్ఎడిటర్ :
**సి. రాజశేఖర్**

సబ్ఎడిటర్ :
**పి. గాయత్రీ ప్రసన్న**

ఆఫీస్ అసిస్టెంట్ :
**ఎస్. వెంకటేష్**

**వీక్షణం చందా వివరాలు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| 3 సంవత్సరాల చందా | రు. 350 |
| 5 సంవత్సరాల చందా | రు. 550 |
| 10 సంవత్సరాల చందా | రు. 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు,**
**డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
reachcdrc@yahoo.com

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్, హైదరాబాద్.**
ఫోన్ : 98484 28516
98482 49695

ప్రింటర్స్
**చరితా ఇంప్రెషన్స్,**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411


## సంపాదకీయం

# ఎన్నికలు ఏం సాధిస్తాయి?

ఈ సంపాదకీయం మీరు చదువుతున్న సమయానికి రాష్ట్రంలో శాసనసభకూ, లోక్‌సభకూ మొదటి విడత అభ్యర్థులు ఖరారయిపోయి, నామినేషన్ల ఘట్టం ముగిసిపోయి, ముమ్మరంగా ప్రచారం మొదలయి ఉంటుంది. రానున్న రెండు మూడు వారాలలో రెండు విడతల ఎన్నికలు కూడా ముగిసిపోయి, ఫలితాల కోసం నెలరోజుల నిరీక్షణ మొదలవుతుంది. ఈ మొత్తం క్రమంలో అటు చట్టసభల అభ్యర్థిత్వం ఆశించేవారు, అంతిమంగా పోటీ చేసేవారు, వారి అనుచరగణం, ప్రభుత్వ యంత్రాంగం, ప్రచార మాధ్యమాలు చేసే హడావిడే కనబడుతోంది, వినబడుతోంది. ఈ సంరంభంలో ప్రజల పాత్ర గాని, ప్రజలకు అవసరమయినది గాని, ప్రజలకు దక్కేది గాని ఏమయినా ఉన్నదా అని చూస్తే చేదు నిజాలు బయటపడుతున్నాయి. ప్రజల పేరు మీద, తమ ప్రతినిధులను ఎన్నుకునే ప్రజల హక్కు పేరు మీద, వేల కోట్ల రూపాయల ప్రజాధనం వ్యయం చేస్తూ జరుగుతున్న ఈ ఎన్నికల ప్రహసనంలో ప్రజల పాత్ర నామమాత్రమే. రెండు వారాలపాటు శ్రోతలు గానూ, ప్రేక్షకులుగానూ, ఎన్నికల రోజున కొన్ని గంటలు క్యూలో నిలబడి, రెండు నిమిషాలలో బాలట్ కాగితం మీద తమ ముద్ర కొట్టేవారిగానూ తప్ప అంతకన్న ఎక్కువ పాత్ర ప్రజలకు లేదు. ఎవరి పేరు మీద ఈ నాటకం నడుస్తున్నదో వారికి ఆ నాటకంలో ఇంత తక్కువ పాత్ర ఉండడం హాస్యాస్పదమైన, శోచనీయమైన విషయమని కూడ ఎవరికీ అనిపిస్తున్నట్టు లేదు. ప్రజల పాత్ర లేదంటే అర్థం ప్రజల ప్రస్తావన లేదని కాదు. నిజానికి జరిగే తంతంతా ప్రజలు, ప్రజలు, ప్రజలు అనే మంత్రం జపిస్తూనే జరుగుతున్నది. హైందవ బ్రాహ్మణ్య సంస్కృతిలో అర్థం తెలియకుండా, తెలియని భాషలో మంత్రాలు జపించి తంతులు జరపడమే ప్రధానమైనట్టు, ప్రజల గురించి మాట్లాడకుండా ఎన్నికల తంతు ఒక్కక్షణం కూడ ముందుకు జరగని మాట నిజమే. కాని ప్రజలంటే ఎవరు, వారి జీవితం ఎలా గడుస్తున్నది, ఆ జీవితాన్ని మెరుగుపరచడానికి ఏమి చేయవలసి ఉన్నది, తమ చేతికి అందబోతున్న విధాన నిర్ణయాధికారాన్ని, విధానాల అమలు అధికారాన్ని ఆ ప్రజాజీవితాన్ని మెరుగుపరచడానికి ఏ విధంగా ఉపయోగించబోతాము, తీవ్రమైన అంతరాలు ఉన్న సమాజంలో కనీస రాజ్యాంగ లక్ష్యాలనైనా నెరవేర్చడానికి ఎటువంటి చర్యలు చేపట్టబోతాము అనే మౌలిక ప్రశ్నలయినా ఈ ప్రజానామ జపంలో వినబడడం లేదు. అన్ని రాజకీయపక్షాలూ పేరుకు ఏవో కొన్ని వాగ్దానాలతో ఎన్నికల ప్రణాళికలు ప్రకటిస్తాయి. ఆ వాగ్దానాలను అమలు చేయనక్కరలేదనీ, చేయవలసిన బాధ్యత ఏమీ లేదనీ, కేవలం ప్రజలను ఆకర్షించేందుకే ఆ వాగ్దానాలు చేస్తున్నామనీ అన్ని రాజకీయ పక్షాలకూ చాల స్పష్టంగా తెలుసు. అందుకే ఆచరణ సాధ్యమా కాదా అనే ప్రశ్న లేకుండా, ఆ వాగ్దానాలను అమలు చేయడానికి తమ వ్యూహం ఏమిటో వివరించకుండా కేవలం ప్రజలను మభ్యపెట్టి ఓట్లు దండుకునే ఉద్దేశ్యంతోనే ఈ హామీల వెల్లువ సాగుతోంది. రాజకీయార్థిక, సామాజిక వ్యవస్థలో మౌలిక మార్పు జరగకుండా కేవలం ఒకరి చేతినుంచి మరొకరికి అధికారం మారినంత మాత్రాన ప్రజాజీవితాలలో ఎటువంటి మార్పూ రాదనే వాస్తవాన్ని ప్రజలు గ్రహించకుండా చూడడానికే ఈ ఎన్నికల తతంగం నడుస్తోంది. ఏదో మార్పు జరగబోతున్నదనో, జరిగే అవకాశం ఉన్నదనో ప్రజలను మోసపుచ్చేందుకే ఐదేళ్లకోసారి ఈ ఎన్నికల తతంగం నడుస్తోంది. వ్యవస్థ మౌలికంగా మారాలని కోరుకునే ప్రజలకు గాని, రాజకీయ పక్షాలకు గాని ఈ ఎన్నికల క్రీడలో పాల్గొనే అవకాశమే లేదు. ఒకవేళ ఉన్నచోట కూడ, నామ మాత్రంగానైనా, ప్రదర్శనవస్తువుగానైనా రాజ్యాంగం హామీ ఇచ్చిన ఆ సమాన భాగస్వామ్య అవకాశాన్ని వాడుకుని అధికారానికి వచ్చిన ప్రభుత్వాలు చేయగలిగిందేమీ లేదని చరిత్రలో అనేకసార్లు రుజువయింది. అటువంటి ప్రభుత్వాలు ఏర్పడి ప్రజల పట్ల నిబద్ధతతో, చిత్తశుద్ధితో ప్రవర్తించగలిగిన వ్యక్తులో, శక్తులో ఉన్నా వారిని ఎక్కువకాలం పనిచేయనివ్వనంత బలమయిన స్వార్థప్రయోజన శక్తులు, పాలకవర్గాలు ఉన్నాయి. అందువల్ల దీర్ఘకాలికంగా ఎన్నికలతో సాధించగలిగినది ఏమీలేదనే అవగాహనను కలిగి ఉంటూనే, స్వల్పకాలిక ప్రయోజనాల కొరకు ఎన్నికలు ప్రజలకు ఉపయోగపడతాయా ఆలోచించాలి. ఈ సందర్భంగానయినా ప్రజలు రాజకీయపక్షాలను, అభ్యర్థులను నిలదీయవచ్చు, ప్రశ్నించవచ్చు, వ్యవస్థ ఎవరి ప్రయోజనాల కొరకు పనిచేస్తున్నదో ఎండగట్టవచ్చు, ప్రజానామజపం బదులుగా, నిజంగా ప్రజల ప్రయోజనాల పరిరక్షణ కొరకు ఎవరు ఏమిచేస్తారో, ఎట్లా చేస్తారో అడగవచ్చు. తమ గత ప్రజావ్యతిరేక చరిత్రకు ఎలా పశ్చాత్తాపం ప్రకటిస్తారో నిలదీయవచ్చు. ప్రశ్నించడమే ప్రజలకు మిగిలి ఉన్న ఏకైక మార్గం. వీ

## అధికారులు ఎవరి సేవకులు?

**రా**ష్ట్రంలో ప్రభుత్వంలో అత్యున్నత అధికారులలో ఒకరయిన రాష్ట్ర డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్‌ను ఎన్నికల కోడ్ ఉల్లంఘన ఆరోపణపై తొలగించడం ఒక ఆహ్వానించదగిన పరిణామం. ఎన్నికల ప్రకటన వెలువడిన తర్వాత అప్పటిదాకా ఉన్న ఎన్నికయిన ప్రభుత్వమనేది లేనట్టే. అది కేవలం ఆపద్ధర్మంగా అధికారంలో ఉన్నట్టు మాత్రమే. అందువల్ల ప్రభుత్వాధికారులు అధికారంలో ఉన్న రాజకీయ పక్షపు సేవకులుగా కాక, ఎన్నికల యంత్రాంగపు సేవకులుగా, నిష్పక్షపాతంగా ఉండాలని ఎన్నికల కోడ్ నిర్దేశిస్తుంది. ఆ మేరకు ప్రస్తుతం రాష్ట్ర డిజిపి మీద జరిగిన చర్య, మరికొందరు అధికారులమీద ఉన్న ఆంక్షలు సరయినవే. నిజానికి ఎన్నికల ప్రక్రియ ప్రారంభమయినప్పటి నుంచీ ఎన్నో దశాబ్దాలుగా ఈ ఆంక్షలు, నిబంధనలు ఉన్నప్పటికీ, కేంద్ర ఎన్నికల కమిషనర్‌గా టిఎన్ శేషన్ పనిచేసిన 1990ల నుంచీ మాత్రమే కఠినంగా అమలులోకి రావడం మొదలయింది. దానికదిగా ఇది ప్రశంసనీయమేగాని, ఇక్కడ ఆలోచించవలసిన మరొక ముఖ్యమైన అంశం ఉంది. ప్రభుత్వాధికారులు కేవలం ఎన్నికల ప్రకటన వెలువడి ఎన్నికలు జరిగే ఏడెనిమిది వారాల పాటు మాత్రమే ఇటువంటి నిష్పాక్షిక, తటస్థ వైఖరి పాటించాలా, మిగిలిన నాలుగున్నర సంవత్సరాలకు పైగా వారు అధికారం పక్షానికి అడుగలకు మడుగులొత్తుతూ ఉండవచ్చా? పాలకపక్షపు బానిసలుగా, తాబేదార్లుగా, బంట్లుగా పనిచేయవచ్చా? అసలు ప్రభుత్వాధికారులంటే ఎవరు? తెలుగులో వారికి ప్రభుత్వాధికారులు అని పేరు పెట్టాం గాని ఇంగ్లిష్‌లో వారిని పబ్లిక్ సర్వెంట్స్ – ప్రజల సేవకులు – అని పిలుస్తారు. ఈ దేశంలో ప్రజాధనం జీతభత్యాలుగా పొందుతూ, ప్రజల అవసరాలను తీర్చవలసిన, ప్రజలకు సేవ చేయవలసిన అధికారగణం తామే యజమానులుగా భావిస్తూ, ప్రజలను బానిసలుగా, సేవకులుగా చిన్నచూపు చూడడం వలసవాదుల రోజుల నుంచే మొదలయింది. 1947 తర్వాత ఆ అధికార స్వభావం మరింత పెచ్చరిల్లి, అసలు ఏ జవాబుదారీతనం లేని విచ్చలవిడి ఆధిపత్యం, నిరంకుశత్వం, దుర్మార్గం, అవినీతి, అలసత్వం అధికార యంత్రాంగపు లక్షణాలుగా మారిపోయాయి. అన్ని రాజకీయ పక్షాలూ ఈ అధికారవర్గ నిరంకుశత్వాన్ని పెంచిపోషించాయి. తమ ప్రయోజనాలు నెరవేరుస్తూ, తమ ఆశ్రితులకు పనులు చేసి పెడుతూ ఉంటే చాలుననీ, ప్రజల మీద ఎన్ని దుర్మార్గాలు జరిపినా ఫరవాలేదనీ, అధికారులను అచ్చోసిన ఆంబోతుల్లా ప్రజల మీదికి వదిలాయి. ఇవాళ హఠాత్తుగా మేలుకొన్నట్టు నటిస్తూ అధికారులు పాలకపక్ష బంట్లుగా వ్యవహరించగూడదని అనడం కన్న ముఖ్యంగా ఎల్లప్పుడూ అధికారులు ప్రజలకు జవాబుదారీగా ఉండాలనీ, పాలకపక్ష సేవకులు కారనీ గుర్తించవలసి ఉంది.

## హిట్లర్ దారిలో...

**మూ**డు నెలల శిశువుగా ఉన్నప్పుడే విమాన ప్రమాదంలో తండ్రి సంజయ్‌గాంధీని పోగొట్టుకోవడం, తల్లి మేనకా గాంధీ ఈ దేశంలో అత్యంత శక్తిమంతులైన కుటుంబంలో కూడ కోడరికం అనుభవించి, నాయనమ్మ చేత బయటికి గెంటివేయబడడం, ఆమె ఆ తరువాత కొన్నిసార్లు పర్యావరణ అనుకూల వైఖరులు తీసుకోవడం వంటి కారణావల్ల వరుణ్‌గాంధీ పట్ల ఎంతో కొంత సానుభూతి, సదభిప్రాయం ఉండేవి. ఇప్పుడు భారతీయ జనతాపార్టీ కేంద్ర కార్యవర్గ సభ్యుడిగా ఉన్న వరుణ్‌గాంధీ తన తల్లి ఆరుసార్లు గెలిచిన ఉత్తరప్రదేశ్ లోని పిలిభిత్ నియోజకవర్గం నుంచి ఈసారి పోటీ చేయనున్నాడు. ఎన్నికల ప్రచారంలో భాగంగా దాల్‌చంద్‌లో జరిగిన ఒక సభలో మార్చ్ 6న ఆయన చేసిన ఉపన్యాసం చాల అభ్యంతరకరంగా, మతవిద్వేషాలను రెచ్చగొట్టేదిగా ఉంది: 'హిందువులు బలహీనులని, వారి వెనుక ఎవరూ లేరని అనుకుని వారి మీద ఎవరయినా చేయి ఎత్తితే, భగవద్గీత మీద ప్రమాణం చేసి చెపుతున్నాను, ఆ ఎత్తిన చేతిని నరికి పారేస్తాను. హిందువులందరూ ఇక్కడే ఉండండి ముస్లింలందరినీ పాకిస్తాన్‌కు తరిమేయండి. అలా వెళ్లకపోతే ఎన్నికలు కాగానే పద్మం గుర్తు వారి కుత్తుకలు కత్తిరిస్తుంది' అన్నాడు. ముస్లింల మీద మరెన్నో అవమానకర వ్యాఖ్యలు చేశాడు. స్వయంగా వరుణ్‌గాంధీ నుంచి అద్వానీ దాకా, సంఘపరివార నేతలందరూ ఆ వ్యాఖ్యలను నేరుగానో, పరోక్షంగానో సమర్థిస్తున్నారు. ఎన్నికలలో ప్రజల సమస్యలు ప్రస్తావించి, వాటిని పరిష్కరిస్తామని వాగ్దానం చేసి, అందువల్ల తమకు ఓట్లు వేయమని అభ్యర్థించవలసిన రాజకీయపక్షాలు మతవిద్వేషాలు రెచ్చగొట్టడం ద్వారా అధికారానికి రావడానికి ప్రయత్నిస్తున్నాయనడానికిది నిదర్శనం. ప్రజల సమస్యలు పెరుగుతున్నప్పుడు, పాలకపక్షాల దగ్గర వాటికి పరిష్కారాలు లేనప్పుడు ఇటువంటి తప్పుడు ధోరణులే రాజ్యమేలుతాయి. జర్మనీలో యుద్ధాల మధ్యకాలంలో ప్రజాసమస్యలు పెచ్చరిల్లినప్పుడు, వాటికి నిజమైన పరిష్కారాలు సూచించలేని స్థితిలో తలెత్తిన హిట్లర్ జాతీయ సోషలిజం పేరుతో సరిగ్గా ఇటువంటి విద్వేషాలనే రెచ్చగొట్టి అధికారానికి వచ్చాడు. యూదుల పట్ల, కమ్యూనిస్టుల పట్ల, ఆర్యేతర జాతులపట్ల, కార్మిక నాయకుల పట్ల ఇటువంటి విద్వేషాన్ని రెచ్చగొట్టి లక్షలాది మందిని హతమార్చిన మారణకాండకు బాధ్యుడయ్యాడు. మన సమాజంలో మళ్లీ ఒకసారి హిట్లర్లు తలెత్తకుండా జాగరూకత వహించవలసిన బాధ్యత మనదే.

## పాకిస్తాన్ ప్రజల విజయం

**ఎ**ంత నిరంకుశంగా ప్రవర్తించే ప్రభుత్వాన్నయినా ప్రజాశక్తి మెడలు వంచగలదని పాకిస్తాన్ ప్రజలు మరొకసారి రుజువు చేశారు. అప్పటి పాకిస్తాన్ అధ్యక్షుడు జనరల్ పర్వేజ్ ముషర్రఫ్ అప్పటి పాకిస్తాన్ ప్రధాన న్యాయమూర్తి ఇఫ్తికార్ ముహమ్మద్ చౌధరిని, మరెందరో న్యాయమూర్తులను పదవి నుంచి తొలగించగా వారిని పునర్నియమించాలనే ప్రజాందోళన చిట్టచివరికి చిన్నపాటి విజయాన్ని సాధించింది. అలా ప్రభుత్వ ఉత్తర్వులను వెనక్కి తీసుకోక తప్పని స్థితిని పాకిస్తాన్ అధ్యక్షుడు ఆసిఫ్ అలీ జర్దారీకి కలిగించినది పాకిస్తాన్ ప్రజల పట్టుదలే. తాను అధికారంలోకి వచ్చిన నెల రోజుల లోపల న్యాయమూర్తులందరినీ పునర్నియమిస్తానని వాగ్దానం చేసి అధికారంలోకి వచ్చిన జర్దారీ ఆ హామీని నెరవేర్చకపోవడంతో దేశవ్యాప్తంగా న్యాయవాదులు, వారికి మద్దతుగా నిలిచిన ప్రతిపక్షాలు ఆందోళన ప్రారంభించాయి. రాజధానీ నగరానికి లాంగ్‌మార్చ్ ప్రారంభించాయి. పాకిస్తాన్‌లో అనేక దశాబ్దాలుగా సాగుతున్న అస్తవ్యస్త పాలనా విధానాల పట్ల, ప్రజావ్యతిరేక విధానాల పట్ల అసంతృప్తితో ఉన్న ప్రజలు లక్షలాదిగా ఈ నిరసన ప్రదర్శనల్లో పాల్గొన్నారు. చిట్టచివరికి ప్రభుత్వం దిగి వచ్చి చౌధరితో సహా న్యాయమూర్తులందరినీ పునర్నియమిస్తానని ప్రకటించింది. మరెన్నో సమస్యలతో సతమతమవుతున్న పాకిస్తాన్ ప్రజలు పోరాడితే తమ ఆశయాలు సాధించుకోగలమని ఈ చిన్న విజయంతో తమకు తాము చాటుకున్నారు. ఇతరులకూ చాటారు. పాకిస్తాన్ ప్రజల లాంగ్‌మార్చ్ మరింత విస్తృతం కావాలి. భారత ఉపఖండంలో సమస్యల వలయంలో చిక్కుకుని పాలకవర్గాల దౌష్ట్యానికి బలి అవుతున్న ప్రజలందరికీ అది ఒక ఆశా సూచన కావాలి. వీ

# లోపలి పేజీల్లో...

## ఫోకస్ : ఎన్నికల వేళ కొన్ని విస్మృత విషయాలు

ఎన్నికల వేళ ప్రధాన పాత్రధారులు కావలసిన ప్రజలు విస్మరణకు గురవుతున్నారు. అన్ని రాజకీయ పక్షాల మధ్య ప్రధాన చర్చనీయాంశం కావలసిన ప్రజా సమస్యలూ, వాటి పరిష్కారాలూ మచ్చుకు కూడా కనబడడం లేదు. పరస్పరం ఆరోపణలూ, ప్రత్యారోపణలూ, ఆత్మస్తుతీ, పరనిందా, ఆచరణ సాధ్యం కాని వాగ్దానాలూ, పెదవి నుంచి వెలువడిన మరుక్షణం మరిచిపోయే హామీలూ చెలరేగుతున్న వాతావరణంలో నిజంగా ఎన్నికల గురించి సామాన్య ప్రజలు ఏమనుకుంటున్నారు? ఎన్నికల గురించీ, ప్రజాస్వామ్యం గురించీ ఇవాళ ఆలోచించవలసిన మౌలిక, ప్రధాన సమస్యలేమిటి?





### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028












- **కీర్తి శేషగిరి** – తుమ్మల శేషగిరిరావు మాష్టారి సంస్మరణ – సంకలనం : సమతా కోటేశ్వరరావు – 315 పేజీలు, 1/8 డెమీ, రు.60, ప్రతులకు : తుమ్మల జగదాంబ, డోర్ నెం. 41-8/3-1, కొట్టు సుబ్బారావు వీధి, హరనాథపురం, కృష్ణలంక, విజయవాడ – 520 013, సెల్ : 9948958618
- **ఇట్లు ఒక రైతు** – గొర్రెపాటి నరేంద్రనాథ్ – హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ – 138 పేజీలు, 1/8 డెమీ, రు. 50
- **ఆంధ్రప్రదేశ్‌లో నూరేండ్ల దళిత చరిత్ర** – అడప సత్యనారాయణ – హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ – 45 పేజీలు, 1/8 డెమీ, రు.30

  పై రెండు పుస్తకాల ప్రతులకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ప్లాట్ నెం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 500 067. ఫోన్ : 23521849, www.hyderabadbooktrust.blogspot.com
- **సామాజిక శాస్త్రాల వ్యాసాలు** – వాసిరెడ్డి భాస్కరరావు – ప్రజాహిత ప్రచురణలు – 104 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, అన్ని పుస్తక కేంద్రాలలో; బుక్‌బర్డ్, హనుమకొండ
- **మూయని దర్వాజ** – చైతన్య ప్రకాశ్ – ఈరజాల ప్రచురణలు – 135 పేజీలు, 1/8 క్రౌన్, రు. 60, ప్రతులకు : చినబాలు యెల్లవ్వ, పోస్ట్ పి.ఆర్. కొండాపూర్, వయా కిషన్‌దాస్‌పేట్, కరీంనగర్ జిల్లా – 505 303, సెల్ : 99486 15874; అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **విశద** – విద్య-సామాజిక విశ్లేషణ – సిఎస్‌ఆర్ ప్రసాద్ – వికాసం ప్రచురణ – 204 పేజీలు, 1/8 క్రౌన్, రు. 60, ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్‌హౌస్, నవోదయ బుక్‌హౌస్, దిశ పుస్తక కేంద్రం, తెలుగు బుక్‌హౌస్
- **నార్ల చిరంజీవి** – అగ్ని సరస్సున వికసించిన వజ్రం – సాహితీ మిత్రులు – విశ్వేశ్వరరావు ప్రచురణ – 76 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : నవోదయ పబ్లిషర్స్, కార్ల్‌మార్క్స్ రోడ్, విజయవాడ – 2. ఫోన్ : 0866-2573500
- **ఆంధ్రప్రదేశ్ చైతన్య మహిళా సమాఖ్య** – పాటలు – మహిళా మార్గం ప్రచురణలు – 193 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : బి. జ్యోతి, ఎడిటర్, మహిళా మార్గం, 3-6-779/6, వీధి నెం. 14, హిమాయత్‌నగర్, హైదరాబాద్ – 500 029; సహచర బుక్‌మార్క్, దిశ పుస్తక కేంద్రం, నవోదయ బుక్ హౌస్
- **నందిగ్రాంపై ఎగురుతున్న ప్లాస్టిక్ ఎర్రజెండా** – పి.ఎస్. అజయ్ కుమార్ – కా. పి.కె. శంకర్ మెమోరియల్ పబ్లికేషన్స్ – 36 పేజీలు, 1/8 డెమీ, రు. 10
- **భూమి సమస్య** – అజయ్ వ్యాసాలు – ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ వృత్తిదార్ల యూనియన్ ప్రచురణ – 129 పేజీలు, 1/8 డెమీ, రు. 50

  పై రెండు పుస్తకాల ప్రతులకు : పి.ఎస్. అజయ్‌కుమార్, అచ్చియ్యపేట (గ్రా), వేటజంగాలపాలెం (బిపిఒ), కశింకోట (ఎస్ఒ) – 531 031











'మార్చ్, ఆగస్ట్'లను మార్చి, ఆగస్టులు గా రాస్తే తెలుగు పదాలవుతాయి. ఆంగ్ల ఉచ్చారణకు భిన్నంగా లేవు గదా! ఇందులో ఇబ్బంది ఏమిటనవచ్చు. అయితే జనవరి, ఫిబ్రవరి ల ఉచ్చారణ ఆంగ్లంలో వీటికి భిన్నంగా ఉంది. బూర్జువా పత్రికలు శుభ్రంగా ఆంగ్ల మాసాల్ని తెలుక్కు అనుగుణంగా రాస్తున్నారు. ఈనాడు కాలండరు చూడండి తెలుస్తుంది. అలాగే 'చర్చ్‌లు, కమ్యూనిస్ట్ పార్టీ (కొన్నిసార్లు కమ్యూనిష్టు పార్టీ అని రాస్తున్నారు) అరెస్ట్, మావోయిస్ట్‌లను' వగైరా పదాలను తెలుగు చేయండి. అందంగా ఉంటుంది. కొన్ని పదాలకు అనవసరంగా 'మైన' తగిలిస్తున్నారు. ఇలా– విచిత్రమైన విషయం, రహస్యమైన పద్ధతి, క్రియాశీలమైన పాత్రను – చాల పదాలకు 'మైన' అదనపు బరువు. పదాల పొదుపు – పాఠకులకు సౌకర్యం. విద్యా సూత్రం అన్వేషణలో (సూత్రపు అన్వేషణలో అంటే బాగుంటుందేమో!) వ్యాసాంశం చాలా క్లిష్టమైంది. ఒక పట్టాన అర్థం కాదు. దానికి తోడు పరిచయవాక్యం – అర్థపర్థం లేకుండా అయోమయంగా ఉంది. పేజి 53, మొదటికాలం కింది నుంచీ 8వ పంక్తి నుండి మొదలైన వాక్యంలో గాని పరిచయ వాక్యముద్దేశమేమిటో అర్థం కాదు. వ్యాసానికి ముందు పరిచయ వాక్యంతో వ్యాసం అందం తగ్గడమే కాక, రచయిత లేదా రచయిత్రి పేరు కూడా మరుగున పడిపోతుంది. వ్యాసం పేరు – దాని కింద చివర్న రచయిత/రచయిత్రి పేరుండడం ఉత్తమం. పన్ను; సుంకము; స్టాక్ మార్కెట్లు; షేర్లు; ఇవి ఏమిటి? వీటి ఉత్థాన పతనాలతో – ఎవరికి నష్టం; ఎవరికి లాభం? క్రికెట్ – ఏమిదీని ప్రయోజనం? ఎందుకు ప్రభుత్వం అంతగా దీన్ని ప్రోత్సహిస్తోంది? విజేతలకు ఎందుకు ప్రజాధనాన్ని బహుమతులుగా అందజేస్తోంది? ఇది అమెరికా, రష్యా, చైనా లాంటి దేశాల్లో ఎందుకు లేదు? కేజీల కొద్దీ మాంసమూ, డజన్ల కొద్దీ గుడ్లూ, ఐదారు మంది తినే తిండి ఒకరే తింటూ – పనీ పాటా లేకుండా – ఉత్పత్తిలో పాల్గొనకుండా – బరువులెత్తి – పతకాలు సాధిస్తే – ఏమిటి ప్రజలకొరిగేది? ఇలాంటి ఆటతోనే దేశ గౌరవం ఇనుమడిస్తుందా? ఇటువంటి వాటిపై – ఒక్కోమాసం పత్రికలో ఒక్కోదానిపై మీరు వివరణ రాస్తే పాఠకుల పరిజ్ఞానం – పెరుగుతుంది. మీరు ఎలా ఊహిస్తున్నారో కాని – చాలామందికి ప్రాథమిక విషయాలు కూడా తెలియవు. 'బాక్సెట్' ఏమిటో నాకు తెలియదు. కొంతమందిని అడిగాను. ఫలితం లేదు. అలాగే – సుంకం; పన్నుల తేడా ఏమిటో కూడా నాకు తెలియదు. ఇక స్టాక్ మార్కెట్టు సంగతి సరేసరి.

**– వి. వెంకట రెడ్డి**
ఇంటేపల్లి, కడప

'వీక్షణం' ప్రస్తుతం మార్కెట్‌లో ఉన్న అన్ని పత్రికలలోకీ తప్పనిసరిగా చదవవలసిన పత్రికగా ఉంటోంది. చాలా విషయాల మీద ఆలోచించటానికి, చర్చించటానికి అవకాశం కల్పిస్తోంది. ఇంకా ఎక్కువ మందికి, ఎక్కువ పట్టణాలకు, గ్రామాలకు చేరేలా చూడండి.

**– ఆవునూరి సమ్మయ్య**
హుజూరాబాద్, కరీంనగర్

'వీక్షణం' చాలా బాగా వస్తోంది. చాలా ఆసక్తితో చదువుతున్నాం. మిగిలిన పత్రిక అంతా ఒక ఎత్తు, అసహజ మరణాల జాబితా ఇచ్చే చివరి పేజీ ఒక ఎత్తుగా ఉంటోంది. ఆ పేజీని ఇంకా అన్ని జిల్లాల సమాచారంతో విస్తరించడానికి ప్రయత్నాలు చేయండి. శిశుమరణాల గురించి కూడా సమాచారం ఇవ్వండి.

**– శ్రీను గోసుల**
ఆసిఫాబాద్, ఆదిలాబాద్

'వీక్షణం' పత్రిక ఓ గ్రంథాలయంలో చూసే భాగ్యం కలిగింది. పాఠకుల అభిరుచులకు అనుగుణంగా ఉండే పత్రికలే ఎల్లకాలం మనగలవు. వీక్షణానికి ఆ గుణాలు పుష్కలంగా ఉన్నాయి.

**– స్నేహజ్యోతి**
కాచిగూడ, హైదరాబాద్

## ఫిల్మ్ తెలంగాణ 2009
### లఘు చిత్రాల పోటీ

గత సంచికలలో ప్రకటించిన **'ఫిల్మ్ తెలంగాణ 2009'** డిజిటల్ లఘు చిత్రాల పోటీకి దరఖాస్తులు పంపడానికి ఆఖరు తేదీని మే 31, 2009 వరకు పొడిగించడం జరిగింది. మిగిలిన నిబంధనలు యథాతథంగా ఉంటాయి. పోటీకి తమ చిత్రాలను పంపించదలచిన వారు మే 31, 2009 లోపు రు. 500 ప్రవేశ రుసుము మనీ ఆర్డర్‌తో **కరీంనగర్ ఫిల్మ్ సొసైటీ, ఫిల్మ్ భవన్, కలెక్టరేట్ రోడ్, కరీంనగర్ – 505 001** కి దరఖాస్తులు పంపాలి.

వివరాలకు film.telangana@gmail.com ను గానీ, కరీంనగర్ ఫిల్మ్ సొసైటీ అధ్యక్షుడు **వారాల ఆనంద్ (94405 01281)** ను గానీ సంప్రదించాలి.

# వీక్షణం రచయితల సమావేశానికి స్వాగతం!

పాఠకుల ఆదరాభిమానాలను విశేషంగా చూరగొంటూ ఏడు సంవత్సరాలుగా నిరంతరాయంగా సాగుతున్న 'వీక్షణం' రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికకు బలం చేకూరుస్తున్నది వీక్షణం రచయితలే. ఇప్పటికి వెలువడిన తొంభై రెండు సంచికలలో వీక్షణం 1108 వ్యాసాలు, రచనలు, 153 సంపాదకీయాలు ప్రచురించింది. మొత్తం మీద కనీసం ఆరువందల మంది రచయితలు ఈ కృషిలో పాలుపంచుకుని ఉంటారు. అందులో కనీసం రెండు వందలమంది వీక్షణం ద్వారానే మొదటిసారిగా సామాజిక, రాజకీయార్థిక విశ్లేషణ ప్రారంభించిన రచయితలయి ఉంటారు. వీక్షణం రచయితల జాబితా ఎంత విస్తృతమయినదంటే, ఆ జాబితాలో లేని తెలుగు సామాజిక శాస్త్రవేత్తలు, మేధావులు, వ్యాఖ్యాతలు అతి తక్కువమంది.

అయినా వీక్షణం సాధించవలసింది ఇంకా ఎంతో ఉంది. మరెన్నో రంగాలమీద రచనలు, చర్చలు, విశ్లేషణలు జరగాల్సి ఉంది. తెలుగు సమాజం తెలుసుకోవలసిన విషయాలు, చర్చించవలసిన విషయాలు, తెలుగు సమాజం ప్రపంచానికి చెప్పవలసిన విషయాలు ఎన్నో ఉన్నాయి. వాటికి వేదిక కల్పించవలసిన బాధ్యత వీక్షణంకు కూడా ఉంది. ఆ అసంపూర్ణ కర్తవ్యాలు నెరవేర్చడానికి మరింతమంది రచయితలు, ఇతోధికమైన సలహాలు, సూచనల అవసరం ఉంది.

అందువల్ల వీక్షణం రచయితలతోనూ, వీక్షణంకు రచనలు చేయదలచుకున్న వారితోనూ నిరంతర సంభాషణ జరుపుతూ ఉండాలనీ, వీక్షణం రచయితల మధ్య ఒక సంభాషణకు వేదిక కల్పించాలనీ వీక్షణం సంపాదకవర్గం భావిస్తోంది.

ఆ దిశగా వీక్షణం రచయితల సమావేశాన్ని **ఏప్రిల్ 12, 2009 ఆదివారం ఉదయం 10 నుంచి సాయంత్రం 6** దాకా జరపదలిచాం. రచయితలూ, రచయితలు కాదలచుకున్న వారూ అందరూ ఆహ్వానితులే.

**రండి! మన ఆలోచనలు కలబోసుకుందాం!**
**తెలుగు సమాజానికి అవసరమయిన రాజకీయార్థిక**
**సామాజిక చర్చావేదికను పరిపుష్టం చేద్దాం!**

వివరాల కోసం సంప్రదించండి :

వీక్షణం కార్యాలయం, ఫోన్ – 040 66843495,
వై. రామచంద్రం (9949391028), వీక్షణం సర్క్యులేషన్ మేనేజర్

## గాంధీ భవన్ పై దండోరా దాడి

మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి కార్యకర్తలు ఫిబ్రవరి 28న గాంధీభవన్ పై దాడిచేసారు. పెట్రోలు, డీజిల్‌లతో తగులబెట్టే ప్రయత్నం చేశారు. ఈ సంఘటనలో ముగ్గురు ఎంఆర్‌పిఎస్ కార్యకర్తలు సురేందర్ మాదిగ, దామోదర్, మహేశ్ మాదిగ, స్పెషల్ సెక్యూరిటీ గార్డ్ సుబ్రమణ్యం రాజులు తీవ్రగాయాలతో చికిత్స పొందుతూ మృతి చెందారు. కాంగ్రెస్ ప్రభుత్వం వర్గీకరణ విషయంలో మాదిగలను మోసం చేసిందనీ, ఇందులో భాగంగానే ఫిబ్రవరిలో అసెంబ్లీపై, తరువాత గాంధీభవన్‌పై దాడి చేశామని ఎంఆర్‌పిఎస్ నేత మందకృష్ణ మాదిగ చెప్పారు.

## రోశయ్య అధ్యక్షతన కమిటీ

ప్రత్యేక తెలంగాణ అంశంపై కె. రోశయ్య అధ్యక్షతన కాంగ్రెస్, మజ్లిస్ పార్టీలకు చెందిన మొత్తం ఎనిమిది మంది సభ్యులతో ఒక సంయుక్త కమిటీ ఏర్పాటు చేసినట్లు రాష్ట్ర ప్రభుత్వం ఫిబ్రవరి 28న ప్రకటించింది. ఈ కమిటీలో రోశయ్యతో పాటు వాణిజ్య పన్నుల శాఖ మంత్రి కొణతాల రామకృష్ణ, భారీ పరిశ్రమల శాఖ మంత్రి గీతారెడ్డి, శాసనసభ్యులు శ్రీధర్ బాబు, ఉత్తమ్‌కుమార్ రెడ్డి, మండలి సభ్యులు పద్మరాజు, షేక్ హుసేన్, ఎం.ఐ.ఎం. తరపున శాసనసభ్యుడు అక్బరుద్దీన్ ఓవైసి సభ్యులుగా ఉన్నారు.

## రాష్ట్ర డిజిపి పై వేటు

రాష్ట్ర ప్రభుత్వం పై ప్రశంసలు కురిపించిన డిజిపి ఎస్ఎస్‌పి యాదవ్ వ్యవహారశైలిని ఎన్నికల సంఘం తీవ్రంగా పరిగణించింది. విపక్షాలు ఆయనపై ఎన్నికల సంఘానికి ఫిర్యాదు చేయడంతో ఎన్నికల సంఘం ఆయనను బదిలీ చేసింది. ఆయన స్థానంలో కొత్త డిజిపిగా ఎకె మహంతిని నియమించింది.

## రాష్ట్ర శాసనసభకు ఎన్నికలు

మార్చ్ 2న ఎన్నికల కమిషన్ రాష్ట్రంలోని 294 శాసనసభ, 42 లోక్‌సభ స్థానాలకు ఎన్నికల తేదీలు ప్రకటించింది. రాష్ట్రంలో రెండు విడతలుగా ఎన్నికలు జరగనున్నాయి. మొదటి విడతగా ఏప్రిల్ 16న 154 శాసనసభ స్థానాలకూ, 22 లోక్‌సభ స్థానాలకూ, రెండో విడతగా ఏప్రిల్ 23న 140 శాసనసభ స్థానాలకూ, 20 లోక్‌సభ స్థానాలకూ ఎన్నికలు జరుగుతాయి. ఓట్ల లెక్కింపు మే 16న జరుగుతుంది.

## బిసి ల వాటా ఎంత?

రాష్ట్ర రాజకీయాలు ఎన్నికల ప్రకటనలతో వేడెక్కుతుండగా బడుగు వర్గాల డిమాండ్‌లు, పెరిగిన చైతన్యం ప్రధాన పార్టీలకు గుబులు రేపుతున్నాయి. జనాభాలో యాభై రెండు శాతంగా ఉన్న బిసిలకు రాజకీయ పార్టీలు ఎన్ని సీట్లు కేటాయిస్తాయనే దానిపై చర్చ జోరుగా సాగుతోంది. కులాల వారీగా చూసినప్పుడు అగ్రకులాలలోని బ్రాహ్మణులు, వైశ్యులు, వెలమలు, కాపు/బలిజలు, కమ్మ, రెడ్డి కులస్తులు జనాభాలో 20 శాతం పైగా ఉన్నారు. వారికి దామాషా పద్ధతిన 68 సీట్లు రావాలి. కాని గత ఎన్నికల్లో 165 సీట్లు వారివే. ముఖ్యంగా కమ్మ, రెడ్డి కులాలకు దామాషా పద్ధతిన 36 సీట్లు చెందాల్సి ఉండగా, అనుభవిస్తున్నవి 129 సీట్లు.

## 'ప్రభుత్వం వంచించింది'

ఫిబ్రవరి 15న రాష్ట్ర ప్రభుత్వం ముందు లొంగిపోయిన మావోయిస్ట్ రాష్ట్ర కమిటి మాజీ కార్యదర్శి కోనపూరి ఐలయ్య (సాంబశివుడు) 'ప్రభుత్వం నన్ను మోసం చేసిందనీ, ఆలస్యంగా తెలుసుకుని బాధపడుతున్నా'ననీ చెప్పారు. మక్తల్ దివంగత ఎం.ఎల్.ఎ. చిట్టెంరెడ్డి నర్సిరెడ్డి హత్య కేసు విచారణ నిమిత్తం ఫిబ్రవరి 25న మహబూబ్‌నగర్ జిల్లా కొడంగల్ ప్రథమ శ్రేణి న్యాయస్థానంకు పోలీసులు తీసుకువచ్చినప్పుడు మీడియా ముందు వాపోయారు.

## 'తెలంగాణకు అభ్యంతరం లేదు'

హైదరాబాద్‌లోని పరేండ్ గ్రౌండ్స్‌లో ఫిబ్రవరి 28న కాంగ్రెస్ పార్టీ జరిపిన ఎన్నికల ప్రచార ప్రారంభ సభలో కాంగ్రెస్ అధ్యక్షురాలు, యుపిఎ చైర్‌పర్సన్ సోనియాగాంధీ తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు డిమాండ్ పట్ల కాంగ్రెస్ పార్టీకి ఎలాంటి అభ్యంతరం లేదన్నారు. సైద్ధాంతికంగా ఎదురవుతున్న సమస్యలను అధిగమించి ఆమోదయోగ్య నిర్ణయం తీసుకుంటామని ఆమె అన్నారు.

## ఓటరు కార్డులు లేవు

ఒకపక్క ఎన్నికలు తరుముకొస్తున్నా ఓటరు గుర్తింపు కార్డుల జారీ ప్రక్రియ ఇంకా పూర్తికాలేదు. ప్రస్తుతం అందుబాటులో ఉన్న లెక్కల ప్రకారం రాష్ట్రంలో మొత్తం 5,67,42,528 మంది ఓటర్లుగా నమోదయ్యారు. ఇందులో 5,01,24,306 మందికి ఫోటోలతో సహా కార్డులు జారీచేసారు. జారీచేసిన కార్డులలో అనేక తప్పులు చోటు చేసుకున్నాయి.

## 'జనం గొంతు' ఆవిష్కరణ

హైదరాబాద్‌లోని బషీర్‌బాగ్ ప్రెస్ క్లబ్‌లో మార్చ్ 7న ఇరవై మూడు మహిళా, పౌరహక్కుల, దళిత, బహుజన, ప్రజాసంఘాల ఆధ్వర్యంలో 'జనం గొంతు' ప్రజా ప్రణాళిక ఆవిష్కరణ జరిగింది. వైఎస్ రాజశేఖరరెడ్డి ప్రభుత్వం ప్రత్యేక తెలంగాణ, ఎస్.సి. వర్గీకరణ, ముస్లిం రిజర్వేషన్లు, నక్సలైట్ ఉద్యమాలకు తూట్లు పొడిచిందని పలువురు వక్తలు ఈ సందర్భంగా అభిప్రాయపడ్డారు. మంచినీరు, వైద్యం వంటి మౌలిక వసతులు కల్పించడంలో ఈ ప్రభుత్వం విఫలమైందనీ, ప్రజా ఉద్యమాలను అణచివేసిందనీ అన్నారు. వీ

# ఎన్నికల వేళ కొన్ని విస్మృత విషయాలు

ఎన్నికల వేళ ప్రధాన పాత్రధారులు కావలసిన ప్రజలు విస్మరణకు గురవుతున్నారు. అన్ని రాజకీయ పక్షాల మధ్య ప్రధాన చర్చనీయాంశం కావలసిన ప్రజా సమస్యలూ, వాటి పరిష్కారాలూ మచ్చుకు కూడా కనబడడం లేదు. పరస్పరం ఆరోపణలూ, ప్రత్యారోపణలూ, ఆత్మస్తుతీ, పరనిందా, ఆచరణ సాధ్యం కాని వాగ్దానాలూ, పెదవి నుంచి వెలువడిన మరుక్షణం మరిచిపోయే హామీలూ చెలరేగుతున్న వాతావరణంలో నిజంగా ఎన్నికల గురించి సామాన్య ప్రజలు ఏమనుకుంటున్నారు? ఎన్నికల గురించీ, ప్రజాస్వామ్యం గురించీ ఇవాళ ఆలోచించవలసిన మౌలిక, ప్రధాన సమస్యలేమిటి?

రాజకీయ నాయకులు సంపాదించుకోవడానికి ఎన్నికలు ఒకరూపం. వీరు ఇప్పుడు పెట్టుబడి పెట్టి అదనంగా తర్వాత సంపాదించుకుంటారు. వీరిచ్చే హామీలకు వాళ్ల జేబులో ధనం నుండి ఖర్చు చేయరు. ప్రజల డబ్బుతోనే చేస్తారు. అది కూడా వారి వారి జనానికే. గత హామీలే సరిగా అమలు కాలేదు. కనీసం నిత్యావసర వస్తువుల ధరలు కూడా తగ్గలేదు. ధరలు రోజు రోజుకు పెరుగుతున్నాయి. ఎవరు అధికారం చెపట్టినా ప్రజలకు బాధలు తప్పవు.

**కె. ఝాన్సీ**
గృహిణి, ఒంగోలు

ఎన్నికలు ప్రజలకు ఉపయోగపడేవిగా లేవు. రాజకీయ నాయకులకు ఇదొక వ్యాపారం. ఎవరు వచ్చినా ఇదే పరిస్థితి. హామీలు అమలు చాలా కష్టం. ప్రజలపై భారం పడుతుంది. సంక్షేమ కార్యక్రమాలు మంత్రులు దాచుకున్న దొంగ బ్యాంకు ఖాతాల డబ్బుతో చెయ్యొచ్చుకదా! అధికారం కోసం అమలు చేస్తున్న పథకాలే కానీ, బతుకులు మారడానికి లేదు. ఆంధ్రప్రదేశ్ అన్నింటిలో వెనుకబడిపోతోంది.

**డి. నాగరాజు**
వీడియోషాపు యజమాని, ఒంగోలు

(పై రెండు అభిప్రాయాలు సేకరించినవారు **మల్లికార్జున్,** ఒంగోలు, ప్రకాశం జిల్లా)

ఓట్లు ఏసుడు ఎన్నడో, ఎవ్వలేం అంటున్నరో, ఎవ్వలేం జేత్తమంటున్నరో మాకైతే ఇంక తెల్వదు. ఎప్పుడైనా మా కట్టం మాదే. మాకు ఎవలేం జేసింది లేదు. ఓట్లప్పుడే ఏదేదో అంటరు. ఆ తర్వాత ఎవరి పని వారిదే. ఇక్కడ బతుకుదెరువు లేక మా కొడుకులందరు బంద్ల మీద పోయింద్రు. మేం ఇక్కడ కూలినాలీ చేసుకుంటున్నం. టివిలు, పైసలు ఇచ్చుడు సంగతి మాకు తెల్వదు. మాకైతే ఎవ్వలు చెప్పలేదు. ఇప్పుడు ఇచ్చేటివే ఇత్తలేరు. ఎప్పుడో వొత్తె ఇత్తమన్నవి ఇచ్చేదెన్నడో? కాన్పు అయిన బాలింతలకు ఇచ్చే వెయ్యి రూపాయలు ఇచ్చేసరికి ఏండ్లు గడుత్తుంది. మా పక్కింటామెకు కాన్పు అయితే ఖర్చులకని రెండొందలు లంచం తీసుకొన్నారు. ఏడాది అయినంక ఇంకా ఇత్తలేరని ఓ సార్‌తోని అడిగిస్తే ఇచ్చింద్రు. మా కోడలు కాన్పు జరిగి ఏడు నెలలు కావొచ్చినా ఎన్నిసార్లు తిరిగినా ఇత్తలేరు. పేరు గొప్ప ఊరు దిబ్బ అన్నట్లు ఓట్ల కొరకు ఎన్నో జేత్తమంటరు. కాని చేసినంక ఇచ్చినంక లెక్క మంచోళ్లు గెలిస్తే మంచిదేగాని ఎవ్వలు మంచోళ్లో ఎవ్వలు చెడ్డోళ్లో తెలిసేటట్టులేదు.

***నర్సవ్వ (50)***
మహిళాకూలీ, నాగిరెడ్డిపల్లి

ప్రస్తుతం విద్యారంగంలో ఉన్న విద్యార్థులకు ఫీజుల రాయితీలు మంచిదే. అయితే ఉపాధి హామీలాగానే చదువుకున్న వాళ్లకు అర్హులకు ఉద్యోగాలు కల్పిస్తే మంచిది. పేద విద్యార్థులకు ఫీజుల రాయితీలు ఇచ్చినట్లుగానే అగ్రకులాల పేద విద్యార్థులకూ ఇవ్వాలి. మంచిపనులు చేస్తున్నా నిత్యావసర వస్తువుల ధరలు బాగా పెరగటం సామాన్యులకు ఇబ్బందికరమే. ఓట్ల కోసం ఏవేవో హామీలు ఇవ్వటం సరైంది కాదు. హామీల అమలు సాధ్యాసాధ్యాలు పరిశీలించాలి. ప్రజల క్షేమాన్ని చూడాలి. నేరమయ, స్వార్థ రాజకీయాలకు చోటివ్వకూడదు. విద్యావంతులైన వారు రాజకీయాల్లోకి వచ్చి మంచి పరిపాలన అందించగలగాలి.

***కె. సంతోషి***
విద్యార్థిని (నూతన ఓటరు)

ఓటు బ్యాంకు రాజకీయాలతో ప్రజల్ని మభ్యపెట్టి మోసం చేయొద్దు. లక్షలాది ఉద్యోగాలిస్తమన్నోళ్లు నాలుగేళ్లు ఏమివ్వలేదు. నాలుగేళ్లు సంపాయించుకొని ఎన్నికల ఏడాది వచ్చేసరికి ప్రభుత్వంలో ఉన్నోళ్లు, ప్రతిపక్షం వాళ్లు నోటికొచ్చినట్లు హామీల వర్షం కురిపిస్తున్నారు. ప్రజలు స్వయం శక్తితో జీవించే అవకాశాలు కల్పించాలి తప్ప ఎవరొచ్చి ఏమిస్తరోనన్న ఆశల్లో ముంచొద్దు. ఈ చెయ్యితోని ఇస్తుంద్రు అంటే ఆ చెయ్యితో తీసుకుంటున్నరు. బియ్యం ఇస్తుంద్రు మద్యంలో ముంచుతుంద్రు. ధరలు పెంచుతున్నారు. ప్రజాకర్షక పథకాలతో ప్రజల్ని గందరగోళానికి గురిచేస్తున్నారు. ప్రభుత్వ భూములన్నీ అమ్మి ప్రభుత్వం చేపట్టే పనుల్తో ప్రజలకు జరిగే మేలు ఎంతో ఆలోచించాలి. హామీల జిమ్మిక్కులతో అధికారంలోకి వచ్చిన తర్వాత ఎన్నికల్లో పెట్టిన ఖర్చులు సంపాదించడానికీ, ఆస్తులు కూడబెట్టుకోవడానికే చూస్తున్నారు. ఇప్పటికే ప్రజాకర్షక పథకాలతో దివాలా తీసిన ఆర్థిక రంగాన్ని రానున్న రోజుల్లో ఎవరైనా కొనసాగించడం కష్టమే. తాత్కాలిక ప్రయోజనాలకు బదులుగా శాశ్వత ప్రయోజనాలపై దృష్టిపెట్టే స్థిరమైన ప్రభుత్వాలు రావాలి. స్వశక్తితో బతికే దారిచూపే ప్రభుత్వాలు కావాలి. సదుపాయాలు కల్పించాలి. కాని స్వార్థ రాజకీయాలకు బలిచేయొద్దు. నిజాయితీతో, నిస్వార్థంగా పనిచేసే పాలకులు రావాలి. హామీలన్నీ, వాగ్దానాలన్నీ వట్టి బూటకమే. అమలు కానివే.

***డి. వైకుంఠం (40)***
ఆర్.ఎం.పి., సిద్ధిపేట

అందరూ మంచిగ చేస్తమంటున్నారు. అందరి వాగ్దానాలు మంచిగనే ఉన్నాయి. అందుకే అంత గందరగోళంగా ఉంది. ఎవరు

ఏమి చేస్తారో, ఏమి చేయరో ఎవరి నిజాయితీ ఏమిటో తేల్చుకోలేని పరిస్థితి. ప్రస్తుత ప్రభుత్వం రైతుల రుణమాఫీ, విద్యార్థుల ఫీజుల రాయితీల వంటి కార్యక్రమాలు బాగానే ఉన్నవి. అయితే నిత్యావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరగడంతో ప్రయోజనం లేకుండా పోయింది. సమాజంలో సగభాగమైన మహిళలకు సరైన ప్రాధాన్యత లేకపోవడంతో స్త్రీలకు అన్యాయం జరుగుతోంది. మహిళలకు రక్షణ కరవవుతోంది. ప్రభుత్వ పథకాల అమల్లో, పరిపాలనలో సరైన కచ్చితత్వం లేక దళారీల పాత్ర చోటు చేసుకుంటోంది. కింది స్థాయికి చేరలేకపోతున్నది. ఒకటి ఉచితంగా ఇచ్చి మరొకటి భారమైనపుడు లాభం ఉండదు. మాయ మాటలతో మభ్యపెట్టే ప్రభుత్వాలు వద్దు. ప్రజలకు ప్రయోజనాలు చేసే, మహిళలకు ప్రాధాన్యత ఇచ్చే, తెలంగాణ రాష్ట్రాన్ని ఇచ్చే నిజాయితీగల ప్రభుత్వాలు కావాలి. అవినీతి, అన్యాయాలకు చోటులేని పరిపాలన కావాలి, రావాలి.

***ఎస్ కళ్యాణి (35)***
గృహిణి, సిద్ధిపేట

**ఇం**తకు ముందుకన్నా ఈ ప్రభుత్వం రైతులకు కొంతమేలు చేసింది. కాని మనది మనకు (తెలంగాణ రాష్ట్రాన్ని) ఇస్తే బాగుండు. రైతులకు రుణమాఫీ, ఉచిత కరెంటు ఇచ్చిండ్రు కాని, ఎరువుల, విత్తనాల కొరత, ధరల పెరుగుదల వంటి సమస్యలు చుట్టుకున్నవి. యాడికాడికి లెక్క అయింది. పొద్దుందాక తెల్లందాక కష్టం చేసినా ఏమీ మిగలడం లేదు. మందిని ముంచేటోళ్లే బాగుపడుతున్నారు. కష్టం చేసేటోళ్లకు ఎన్ని ఇచ్చినా తక్కువే. ఎవలు గెల్చినా ఒరగబెట్టిందేమీ లేదు. గెలిచేదాక ఒకటి మాట్లాడి, గెలిచినంక ఒకటి చేసే నాయకుల మాటలు నమ్మలేం. అందరు తెలంగాణ కోరుకున్నపుడు మనది మనకు ఇస్తే బాగుండు. మంచోళ్లకే మన ఓటు. రైతుల, కూలీల కష్టాలు తీరాలి.

***సాయి మల్లయ్య (40)***
రైతు, కొండపాక

**త**రతమ బేధాల్లేకుండా అందర్నీ సమానంగా చూసే, అందరికీ సమానంగా న్యాయం జరిగే పరిపాలన కావాలి. అందరూ సామాజిక న్యాయం అంటున్నారు. అది ఎలాంటి న్యాయమో చెప్పటం లేదు. గతంలో ప్రభుత్వాల పట్ల ఉన్నంత వ్యతిరేకత కనిపించనప్పటికీ, అన్యాయాలూ, అరాచకాలూ ఏమి తగ్గలేదు. అన్నపూర్ణ, హరితాంధ్రప్రదేశ్ లని చెప్పినా రైతుల ఆత్మహత్యలు ఆగలేదు. వ్యవసాయ ప్రాధాన్యత అంటూ చెప్పుకున్నప్పటికీ ఆగని రైతుల ఆత్మహత్యలే రైతుల పరిస్థితిని సూచిస్తున్నాయి. అన్యాయాలు, అరాచకాలు, అవినీతి, దళారీల పాత్ర పెరిగిపోయింది. అయినవారికో న్యాయం కానివారికో న్యాయం అమలవుతోంది. జలయజ్ఞం అనేది కాంట్రాక్టర్లకు అయినవారికి వరంగా మారింది. సామాన్యులకు అందుబాటులో లేనంతగా నిత్యావసర సరుకుల ధరలు పెరిగిపోయాయి. తెలంగాణకు సానుకూలమంటూ ఎటూ తేల్చకుండా ఏళ్లు గడిపిన పాలకులు మొండిచెయ్యి చూపినారు. మాతోనే సాధ్యమన్న ప్రభుత్వం మాట తప్పింది. ఓట్లకోసం పాట్లన్నట్టూ మళ్లీ పాత మాటనే. తెలంగాణకు అనుకూలమంటూ పాత పాటే, ఎన్నికల వేళ అన్ని పార్టీలు అమలుకు సాధ్యం కాని హామీలు ఇస్తున్నారు. ప్రతిదానికి ప్రభుత్వాలపై ఆధారపడేలా చేస్తున్నారు. ఎప్పుడు ఏమి ఇస్తారోనన్న ఆశతో చూసేట్ల అరచేతిలో వైకుంఠం చూపిస్తూ అన్ని పార్టీలు హామీలు ఇస్తున్నవి. సాధ్యపడని హామీలు ఇవ్వడం ప్రజల్ని గందరగోళ పర్చడం తప్ప సరైంది కాదు. తాత్కాలిక ప్రజాకర్షక పథకాలకు బదులుగా ప్రజలకు శాశ్వత ప్రయోజనాలు కలిగించే ప్రభుత్వాలు కావాలి. స్వార్థంలేని నిస్వార్థ నాయకులు, అవినీతికి ఆస్కారం ఇవ్వని నాయకులు ఎన్నిక కావాలి. ప్రజల ఉజ్జ్వల భవిష్యత్తు కాంక్షించే, సమన్యాయ పాలన అందించే ప్రజా ప్రభుత్వాలు రావాలి. అవినీతికీ, అన్యాయాలకూ ఆస్కారం ఇవ్వని పాలన కావాలి.

***జి. వెంకటేశం***
ఉపాధ్యాయుడు, మెదక్

(పై ఏడు అభిప్రాయాలు సేకరించినవారు ***ఎన్. భగవాన్‌రెడ్డి***
సిద్ధిపేట, మెదక్ జిల్లా)

**వి**విధ పార్టీలు ఎన్నికల్లో ఇచ్చిన హామీలు ప్రజలను సోమరి పోతులుగా తయారుచేస్తాయి. దీనివలన దీర్ఘకాలిక లబ్ధి కానీ, పేదరిక నిర్మూలన కానీ జరగదు. ఇటువంటి పథకాలు, హామీలు ఉపయోగపడవు. నగదు బదిలీ పథకంపై ఎటువంటి అవకతవకలకు పాల్పడకుండా అమలు జరిగితే ఒక విధంగా పేదరిక నిర్మూలన చేయవచ్చు. గతంలో జరిగిన ఎన్నికలు ప్రస్తుతం జరగబోయే ఎన్నికలను పరిశీలిస్తే పార్టీల మధ్య జరిగేది. నేడు కులాల కుంపటిగా, ప్రాంతాలుగా, సినీగ్లామర్, రంగుల ప్రపంచం చుట్టుకొని, ఎన్నికల ప్రచారం జరుగుతోంది. అయితే సామాజిక శాస్త్రం ప్రధాన విధానంగా ప్రభుత్వ అవినీతే ఒక అంశంగా ఎన్నికలు జరపడం హర్షనీయం. గత కొంతకాలంగా చూస్తే ప్రజలలో కూడ నైతిక విలువలు తగ్గాయి. ప్రభుత్వ విధానాల వలన అవినీతి వ్యవస్థీకృతం అవడం వలన ఎక్కువమంది ప్రజలు అవినీతికి వత్తాసు పలుకుతున్నారు. ఇది చాల ప్రమాదకరం. శాంతిభద్రతలు పూర్తిగా క్షీణించాయి. వరంగల్‌లో ఎన్‌కౌంటర్ చట్టం ఉల్లంఘనకు పరాకాష్ట. పోలీసు వ్యవస్థ స్వేచ్ఛతో పనిలేకుండా రాజకీయ నాయకులకు జేజేలు పలుకుతూ వస్తున్నారు.

***ఎస్. శ్రీనివాసరావు***
అడ్వకేట్, ఆముదాలవలస, శ్రీకాకుళం

**ఎ**న్నికల్లో కేవలం రాజకీయ నాయకుల లబ్ధికొరకే హామీల వర్షం కురిపిస్తున్నారు. తరువాత ప్రజలను పట్టించుకోరు. ఎన్నికల్లో గెలిచిన అభ్యర్థి అయిదు సంవత్సరాలలో ఒక్కసారయినా మా నియోజకవర్గంలో ఉన్న కొన్ని గ్రామాలను నేటికీ కన్నెత్తి చూడలేదు. ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా ప్రజల సమస్యలు, బాధలు పట్టించుకొనే నాయకుడే ఉండటం లేదు. గతంలో ఎన్నికలు ప్రశాంతంగా సామరస్యంగా జరిగేవి. ఇప్పటి ఎన్నికలు మద్యం, డబ్బులతో ముడిపడి వరదలై పారుతోంది. గతంలో ఓటర్లు కూడ పార్టీలను, వ్యక్తులను బట్టి ఓటు వేసేవారు. నేడు కులాలమధ్య, ప్రాంతాల మధ్య ఆధిపత్యపోరు జరుగుతోంది. పూటబత్తెం పిల్లల వెలుగు అన్న చందంలా ఉంది. ఎన్ని ప్రభుత్వాలు మారినా, మాలాంటి పేదల బతుకులు మారడంలేదు. ప్రభుత్వ పథకాలు ఏమీ కూడ దరిచేరడం లేదు. నిజంగా ఒక్కమాటలో

చెప్పాలంటే పార్టీల పరంగా అందుతున్నాయి తప్ప అర్హులు గల వారికి అందడం లేదు.

**ఆర్. కుమారి**
విద్యార్థిని, ఆముదాలవలస, శ్రీకాకుళం

మన రాష్ట్రంలో కాంగ్రెస్, టిడిపి, పిఆర్‌పి ఇస్తున్న ఎన్నికల హామీలు చూస్తే తమిళనాడు రాష్ట్రాన్ని మించి పోతున్నాయి. ఈ హామీలు అన్నీ తాత్కాలికమే. అధికారాన్ని చేజిక్కించుకోవడానికి తప్ప పూర్తిస్థాయిలో ఆచరణ సాధ్యంకాదు. ఈ రోజు టిడిపి ఇస్తున్న హామీలు కలర్ టివి, నిరుద్యోగులకు రు. 2000 పెన్షన్ కింద అవి ఏ విధంగా సాధ్యమవుతాయి? ఈ ఎన్నికలు రసవత్తరంగా జరుగనున్నాయి. అన్ని పార్టీలు తమకు తామే సాటి అన్నట్లుగా బలపడ్డాయి. ఏ పార్టీకి పూర్తిస్థాయిలో మెజారిటీ రాదు. ప్రస్తుత ఎన్నికల్లో బిసి, కాపు కులాల మధ్య ఎక్కువగా పోటీ ఉన్నట్లు అనిపిస్తోంది. కాంగ్రెస్ ప్రభుత్వం పథకాల అమలులో ముందంజలో ఉంది. అలాగే అవినీతిలో కూడా ముందంజలోనే ఉంది. గతంతో పోల్చితే పేదవాడు తన కాళ్ల మీద నిలబడే స్థాయిలో ఉన్నాడు.. ప్రతి ఒక్కరికీ రేషన్ కార్డులు, ఆరోగ్యశ్రీ, ఫీజు రీయంబర్స్‌మెంట్ వంటి పథకాలు కల్పిస్తోంది. గతంతో ప్రస్తుత జీవన విధానం పోలిస్తే అరవై శాతం మెరుగుపడినట్లు అనిపిస్తోంది.

**జి. తిరుపతిరావు**
బొబ్బిలి, విజయనగరం

ఎన్నికల్లో రాజకీయ నాయకులు ఇస్తున్న హామీలు ఎనభై శాతం వరకు అమలు జరగవు. ప్రస్తుతం ఇస్తున్న పథకాలు కూడ అందడంలేదు. ప్రజలకు మాయమాటలు చెప్పి పదవులు దోసింపాటు పడుతున్నారే తప్ప ప్రజల బాగోగులు గురించి మాత్రం కాదు. ఎన్ని పార్టీలు వచ్చినా పేదలు పేదలుగానే ఉంటున్నారు. గతంలో ఎన్నికలు ద్విముఖం ఉండేది. నేడు త్రిముఖం ఏర్పడింది. రానున్న ఎన్నికల్లో ఏ పార్టీకి ఎక్కువ సీట్లు రావు. గతంలో ఎన్నికలు అంటే మాలాంటి వారికి పెద్దగా అవగాహన ఉండేది కాదు. నేడు చిన్న పిల్లలనుండి పెద్దవారి వరకు ఎన్నికలపై అవగాహన ఉంటోంది. వేం ఎప్పుడూ కూలీ వాళ్లుగానే మిగిలిపోతున్నాం. సొంత గూడు లేదు. పూట గడవలేని స్థితిలో ఉన్నాం. ప్రభుత్వాలు మారినా మాలాంటి పేదల బతుకుల రాతలు మాత్రం మారడంలేదు.

**సి.ఎచ్. లక్ష్మి**
గృహిణి, పాలకొండ, శ్రీకాకుళం

ప్రభుత్వాలు ఎన్ని మారినా, ఎన్ని పనులు చేస్తున్నా ఎక్కువగా వాళ్ల బాగోగులు చూసుకుంటున్నారు తప్ప పేద ప్రజల పరిస్థితులు అర్థం చేసుకోవడం లేదు. ఎన్నికల హామీలు నీటి బుడగలుగా అవుతున్నాయి. కష్టపడి పనిచేసే వారికి తప్ప విద్యార్థులకు ఉద్యోగాలు దొరకడం లేదు. పిల్లలకు చదువుకోవడానికి చాల ఇబ్బందులు ఎదురవుతున్నాయి. ప్రస్తుత ప్రభుత్వం బాగా అవినీతిలో కూరుకు పోయింది. ఎన్నికల హామీలు వారి స్వార్థం కొరకు ఉపయోగించు కుంటున్నారు. గతంలో ఎన్నికలు నాకు తెలిసి ఎనిమిది సార్లు ఓటు వేశాను. అప్పటి రోజులు వేరు. ప్రస్తుత పరిస్థితులు వేరు. ఈ ఎన్నికలు మందుబాబులకు బాగా ఉపయోగపడతాయి. ఎన్నికల్లో కొన్నిపార్టీలు మాకు ఓటుకు రెండు వందల నుంచి నాలుగు వందల రూపాయల మేరకు డబ్బులు ఇస్తున్నారు. ఈ అయిదు సంవత్సరాలకు ఆ డబ్బుకే అన్నట్లుగా ఉంది. పిల్లలకు ఎడ్యుకేషన్ లోన్ గురించి వెళితే బ్యాంక్‌లో ఇవ్వడం లేదు. ప్రభుత్వం గొప్ప చెప్తుందే తప్ప మాకు సరియైన పథకాలు, బాగోగులు చూడటంలేదు. పాన్ అమ్మిన డబ్బులతో పూటగడవడం కష్టంగా ఉంది. ఎన్నికల తరువాత ఏ రాజకీయ నాయకుడు మమ్మల్ని పట్టించుకోవడం లేదు.

**ఎన్. సిత్రరావు**
పాన్‌షాప్, విశాఖపట్నం

దేశానికి స్వాతంత్ర్యం రాకముందు జరిగిన ఎన్నికల్లో, 1944లో గుర్తులు ఉండేవి కావు. అప్పట్లో కాంగ్రెస్, జస్టిస్ పార్టీలు మాత్రమే ఉండేవి. పార్టీలకు పచ్చపెట్టె, ఎరుపు పెట్టె కేటాయించేవారు. రాజకీయ నాయకులు ఓటర్లను ఆకర్షించడం కోసం హామీలు ఇస్తున్నాయి. హామీలు ఇచ్చే ముందు దాని గురించి ఆలోచన అనేది ఉండాలి. కాని ఇవి ఏవి సాధ్యం కావు. పథకాలు ఇచ్చేముందు రాష్ట్ర బడ్జెట్ గురించి ఆలోచించాలి కదా? ప్రస్తుతం ఇస్తున్న హామీల బదులు రైతులు అప్పులతో ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. వారిని ఆదుకుంటే బాగుండును. ఓటర్లు కూడ అవినీతి రాజకీయ నాయకులకు ఓటువేసి పట్టంకడుతున్నారు. కులాలపై ఆధారపడి ఎన్నికలు జరుగుతున్నాయి తప్ప, పార్టీల పరంగా, ఏరాజకీయ నాయకుణ్ని ఎన్నుకుంటే మనకుమంచి జరుగుతుంది అనేది ఓటర్లు ఆలోచించడం లేదు. నిజంగా చెప్పాలంటే పాలకులకు చిత్తశుద్ధి లేదు. ఇచ్చిన హామీలు నెరవేర్చడం లేదు. మాలాంటి ఉద్యోగులు బతకడానికే కష్టంగా ఉంటే కూలిపనిచేసే వారి పరిస్థితి ఎలా ఉంటుందో అర్థం చేసుకోవచ్చు. నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశాన్ని అంటుతున్నాయి. బియ్యం మార్కెట్లో కిలో ఇరవై అయిదు రూపాయలు. పేదవారు ఎలా బతుకుతారు, అనేది ప్రభుత్వాలు ఆలోచించాలి. ఎన్నికల హామీల కంటే ప్రస్తుతం ఉన్న హామీలను సక్రమంగా ఆమలు చేస్తే బాగుంటుంది.

**టి. ధర్మారావు**
టీచర్, సరుబుజ్జిలి, శ్రీకాకుళం

ఎన్నికల హామీలు రాజకీయ నాయకుల స్వార్థం కొరకే. వారు పదవుల గురించే హామీలు ప్రకటిస్తున్నారు. ప్రజలకు ఎన్నో పనులు చేస్తున్నట్లు ప్రభుత్వాలు అనుకుంటున్నప్పటికీ మాలాంటి సామాన్యులు, పేద-మధ్యతరగతి వారు ఇలా రోడ్ల పై వ్యాపారాలు, కూలీ చేసుకుంటూ బతుకుతున్నాం. ప్రభుత్వాలు ప్రజలకు మంచి చేసేవి రావాలి. అందరు బాగా ఆలోచించి ఏ రాజకీయ పార్టీకి ఓటు వేయాలి, మనకు ఎవరు న్యాయం చేస్తారో వారికి ఓటు వేసి గెలిపించాలి. అప్పుడే దేశం, రాష్ట్రం బాగుపడుతుంది. హామీల వలన ప్రజలకు ఏ మాత్రం లబ్ధి చేకూరదు. ఇంట్లోనే, కార్పొరేటర్, సర్పంచి, ఎం.ఎల్.ఎ.లు ఉంటారు. అలాగే ఎన్నికలు డబ్బులతో ముడిపడి జరుగుతున్నాయి. దీనిని ఓటర్లు గ్రహించాలి. విశాఖలో ఎక్కువగా యాదవ్‌లు పోటీపడుతున్నారు. కులాల మధ్య పోటీ జరుగుతోంది. రాజీవ్ యువశక్తి పథకం కింద దరఖాస్తు పెట్టాను. కాని ఇంతవరకు నాకు రాలేదు. రాజకీయ నాయకుల చుట్టాలు, వారి మనుషులకు అందుతున్నాయి తప్ప, నిజంగా అర్హతగలవారికీ,

పేదవారికీ అందడం లేదు. రోడ్లపై టీషాపు వ్యాపారం వర్షకాలంలో షాపు మూసుకొని ఉంటే కుటుంబం గడపడం కష్టంగా ఉంటుంది. ఒక పక్క ట్రాఫిక్ పోలీసులతో సతమతం అవుతున్నాం. ఎన్ని ప్రభుత్వాలు మారినా మా జీవితంలో వెలుగులు నింపడం లేదు.

***ఎస్. శేఖర్***
టీషాప్, పెదవాల్తేరు, విశాఖపట్నం

(పై ఏడు అభిప్రాయాలు సేకరించినవారు **ఆర్. రామారావు,** విశాఖపట్నం జిల్లా)

మీటింగులకు మనుషుల్ని చూడడానికి ఎల్తున్నాం. అదికూడా తీరుబాటుంటేనే. ఎప్పుడూ అనుకొని ఎవలకీ ఓటెయ్యలేదు. మాటలు చెప్పడమే గాని, ఎవలకి ఎవరు ఏది ఇచ్చేస్తున్నారో చెప్పండి. అన్నీ వట్టి మాటలే. ఇప్పటి ప్రభుత్వంలో కొందరికి కొన్ని దొరకతున్నాయను కోండి. అయినా ఎవుల్నీ నమ్మలేమండి. ఇకన సభల్లోన వాగ్దానాలకేటి ఎన్నయినా చెప్పేస్తారు. నోటికి అడ్డా ఆపా. సేతల దగ్గరికి వచ్చేసరికి అందరికీ బాగార్లే కావాల. మరిసారి చిరంజీవి దిగాడు కదా, టగ్గాఫోరుగుంటాది. ఎలచ్చనంటే వాలకమైపోయింది. మా బతుకులు మాత్రం ఎలగున్నివి అలాగే ఉన్నాయి.

***సాధు రాము (32)***
బస్సు డ్రైవర్, శ్రీకాకుళం

టివిల్లోన పేపర్లోన వస్తున్నవన్నీ అబద్ధాలని మనకి తెలిసిపోయిన తర్వాత ఎలక్షన్ల గురించి మరిక మనం ఆలోచించకూడదు. ఒకల తర్వాత ఒకలు వస్తుంటారు. మాటలన్నీ గాలికే. పది సంవత్సరాల ముందర ప్రతి సారీ ఎలక్షన్ల ముందు మావూరిలో గుట్టుగా పెద్దలందరూ ఆలోచించి, వూరిబాగు కోసం రకరకాలుగా చూసుకొని, ఏదో ఒకపార్టీకి ఓటెయ్యాలని నిర్ణయించేటోలు. ఇప్పుడదేటీ లేదు. ఎవుడికాడే లీడర్. ప్రతిదానికీ నాకేటి అని అనుకోవడమే గాని, అందరి కోసం మరిలేదు. చిన్న వూరిలోనా వంద పార్టీలు. మాకు సదువులేదు కాబట్టి ఎవరేటి చెప్తున్నారో తెలీదనుకోకండి. అయితే ఓటెయ్యడానికి మేము పార్టీలు సూడం. ఎన్నికల్లోన ఎవరు నిలబడతన్నారన్నదే ఇంపార్టెంట్. ఆల్ల కేరక్టర్ బట్టే తప్ప వాగ్దానాలు బట్టి ఏటీ ఉండదు. అయితే ఒకటి, వర్షాలు పడితే మాత్రం అందరూ హీరోలే.

***పిన్నింటి సుశీల (30)***
భవన నిర్మాణ కార్మికురాలు, శ్రీకాకుళం

(పై రెండు అభిప్రాయాలు సేకరించినవారు **దుప్పల రవికుమార్,** శ్రీకాకుళం జిల్లా)

పథకాలు ప్రకటించడమే గాని, పేదలకు అందడం లేదు. టిడిపి చెప్పేవి ఇస్తే బాగానే ఉంటుంది. లోక్‌సత్తా చెప్పేవి మంచివే. కాని దానికి ఆదరణ లేదు.

***ప్రసాద్ (43)***
సుతారి మేస్త్రి, ఖమ్మం

తెలుగుదేశం కంటే కాంగ్రెస్ ప్రభుత్వ పాలనలో పథకాలు అమలు పర్చడం వల్ల కొంత మేలు జరిగింది. మళ్లీ కాంగ్రెస్ వస్తే బాగుటుందని అనుకుంటాను.

***కిరణ్ (28)***
కార్మికుడు, కొత్తగూడెం, ఖమ్మం

(పై రెండు అభిప్రాయాలు సేకరించినవారు **సి.ఎచ్. కృష్ణ** ఖమ్మం జిల్లా)

కాంగ్రెస్ కరెంట్ ఇస్తానంటోంది. ప్రతిదినాం కట్‌చేస్తోంది. బియ్యం కారట్లు ఇచ్చినంక మా కండ్లు పడలేదని బియ్యం బొయ్యలేదు. మొన్న కండ్లు పడకున్నా సరే బియ్యం బోస్తామని రమ్మంట చెప్పిండ్రు. బీడీల కారట్లు, మెడల గుండ్లు అమ్ముకొని పైసలు పోసి కొనుకున్నం. ఇప్పుడేమో పింఛన్ లేదంటుండ్రు. ఇక చంద్రబాబు కలర్ టివి లు ఇస్తానని అన్నాడు. వాళ్లల్లోని తిరిగినోళ్లకు ఒక పది పంపుతుండవచ్చు. కని కడపకు పంపుతాడ. అయినా అవి ఇస్తే, గెలిస్తేనే గదా. గెలస్తడో లేదో ఎట్ల జెప్పస్తరి. చిరంజీవి 100 రూపాయలకు అన్ని భత్యాలు ఇస్తానంటే మార్కెట్ల ఉల్లిగడ్డలు ఇరవై రూపాయలగా ఉన్నయి. ఒల్లేమి ఇయ్యరు. మన కష్టం తప్పది. మా బీడీలు మేం జేసుకుంటున్నం. ఇండ్లే లేవు, జాగలు లేవు. అన్ని అందరూ ఇస్తామంటారు. ఏమి ఇయ్యరు. ఓల్లకు ఓటేసినా లాభం లేదు. అందరూ అందరే.

***లింగుబాయి (59)***
బీడీ కార్మికురాలు, ఆదర్శనగర్, నిజామాబాద్

రాజశేఖరరెడ్డి కరెంట్ ఎక్కడికెల్లి దెస్తడు. నీళ్లు సరిగా లేవు. కరెంట్ ఉత్పత్తి ఎట్లజేస్తడు. కరెంట్ ఉత్పత్తికి, నీళ్ల లేక, థర్మల్ ప్లాంట్‌ల గాని, ఆటమిక్ ప్లాంట్‌లు గాని ఏమన్నా ఏర్పాటు చేసిండా? తర్వాత తాగటానికీ నీళ్ల ఉండవు. మేఘమథనం అన్నరు, కోట్లు ఖర్చు జేసిండ్రు. ఎత్తిపోతలన్నరు, ఆ ప్రాజెక్టులు పూర్తిగాలేదు. మళ్లా కరీంనగర్, జగిత్యాల, సిరిసిల్లా ప్రజలంతా కాకతీయ కాలువ నీళ్ల రాక బీవండి, బొంబాయి పోవాల్సిందే. ముందటిలాగా బట్టల మిల్లులలో పని జేయాల్సిందే. అదే పరిస్థితి వస్తుంది. ఎందుకంటే, బాబ్లీ ప్రాజెక్టుల వల్ల మహారాష్ట్ర నీళ్ల మనకు రావు. పోచంపాడ్ ఎండిపోతది. నీళ్లు రావు కరెంట్ ఉండదు. చిన్న రైతుల బాధలు అనేకం జూస్తం. ఇది తప్పక జరుగుతది. ఇక చంద్రబాబు కలర్ టివి ఓల్లకిస్తడు, డిష్ ఇస్తడా? కరెంటే ఉండది. ఎవరికిష్టమచ్చినట్లు వాళ్లు మాటలు చెపుతుండ్రు. ఇగ చిరంజీవి రోడ్‌షోలు బాగానే గనిపిస్తున్నయి. ఎవరైనా గంతే. ఇన్ని ఏండ్ల నుండి ఓట్లు వేస్తున్నాం. ఒరిగిందేమీలేదు. మనం ఆలోచించుకొని మన జీవితం మనం ఏదైనా చేసుకొని బతకాల. రోజు తిరగంది, బట్టలు అమ్ముకోంది, నాకు ఎవరు బువ్వ బెడుతరు. ఏండ్ల నుండి ఇదే పనిజేసుకుంటున్నాను.

***అంజయ్య (60)***
బట్టల వ్యాపారి, న్యూ ఎన్.జి.ఓస్. కాలనీ, నిజామాబాద్

(పై రెండు అభిప్రాయాలు సేకరించినవారు **ఎం. నర్సయ్య,** టీచర్, నిజామాబాద్ జిల్లా)

ప్రస్తుతం ఎవరు వచ్చినా ప్రయోజనం కింది వరకు అందడం లేదు. నాయకులకు, వారి బంధువులకు మాత్రమే ప్రయోజనాలు అందుతున్నాయి. నాకు లోన్ కావాలంటే ఇవ్వడం లేదు. నిత్యావసర వస్తువుల ధరలు తగ్గించి, చేతి వృత్తుల వారికి పని కల్పిస్తే బాగుంటుంది.

***కాటాడి సత్యనారాయణ (48)***
సైకిల్ మెకానిక్, కాకినాడ

ఎన్నిసార్లు ఓట్లు వస్తే అన్ని సార్లు ఓటేశాను. నా రిక్షా నేను నడుపుకుంటున్నాను. నాకు ఈ రిక్షా తప్ప ఏమీలేదు. నేను అనాథని. పార్టీలిచ్చిన వాగ్దానాలపై నిలబడతాయని నమ్మకం లేదు. మాకు ఇల్లు లేదు, ఉద్యోగం లేదు. బతికున్నంత కాలం కనీస సౌకర్యాలు ఉంటే చాలు. గెలిచిన తర్వాత వాళ్లు చెప్పింది చేస్తే చాలు.

***నీలపు నూకరాజు (40)***
రిక్షా పుల్లర్, కాకినాడ

ఎన్ని ఎన్నికలు వచ్చినా మధ్యతరగతికి ఒరిగేదేమీ ఉండదు. రాజకీయ పార్టీల వాగ్దానాలు అన్ని ఒట్టి మాటలే. అమలు చేయడానికి కావు. నిరుద్యోగం ఉండకుండా, ధరలు అదుపులో ఉంటే చాలు. పన్నులు పక్కాగా వసూలు చేసి, పేద-మధ్యతరగతి ప్రజలు బతికే పరిస్థితి కల్పిస్తే చాలు.

***మంచింశెట్టి శ్రీనివాస్ (30)***
వీడియోగ్రాఫర్, కాకినాడ

ఎన్నికల వల్లే కదా ప్రభుత్వాలు ఏర్పడతాయి. ఓటు హక్కును అందరూ ఉపయోగించుకోవాలి. ఉపయోగపడతారా లేదా అనేది వేరే విషయం. వాగ్దానాలు ఏవీ నమ్మడం లేదు. నమ్మి వేస్తే మోసపోతారు. కనీస అవసరాలు తీరిస్తే చాలు. ఆహార కొరత లేకుండా, నిత్యావసర వస్తువుల ధరలు పెరగకుండా చూస్తూ, ప్రతి సామాన్యుడు బతికే పరిస్థితి కల్పిస్తే చాలు.

***బత్తుల నర్సింహారావు (28)***
పాన్‌షాప్, కాకినాడ

ఎన్నికల వలన మేలు జరుగుతదని నమ్మకం లేదు. ఇప్పుడు ప్రజలకు తెలుసు. కొద్దిమంది మాత్రమే ప్రయోజనం పొందుతున్నారు. ఎక్కువ మందికి ప్రయోజనాలు అందడంలేదు. కుటుంబానికి సంబంధించిన కనీస అవసరాలు తీరిస్తే చాలు. సాయం చేస్తామని చేయి చూపి నాయకులు పుర్ర చేయి చూపిస్తే బాధగా ఉంటుంది. నాయకుల మీద నమ్మకం కల్పించేలా చేస్తే చాలు.

***బంగారు అప్పారావు (60)***
రిటైర్డ్ మునిసిపల్ వర్కర్, కాకినాడ

(పై ఐదు అభిప్రాయాలు సేకరించినవారు **ముహమ్మద్ ఇబ్రహీం సాహెబ్,** కాకినాడ, తూర్పు గోదావరి జిల్లా)

ఇప్పుడు కొత్త పార్టీలు వస్తున్నాయి. తెలుగుదేశం పాలనలో ఒరిగిందేమీ లేదు. కాంగ్రెస్ ఫర్వాలేదు. అవినీతి బాగా పెరిగింది. ఎవరు వచ్చినా అవినీతి పోయేది లేదు. చెప్పిన వాటిలో కాంగ్రెస్ కొన్నిటిని చేసింది. ప్రజలు అమాయకంగా లేరు కాబట్టి కొంతైనా చేస్తున్నారు. పండిన పంటకు గిట్టుబాటుధర కావాలి. జీవితాలు ఈమాత్రమైన గడిస్తే చాలు. అవినీతి లేకుండా మంచి పరిపాలన ఉంటే బాగుంటుందని అనుకుంటున్నారు.

***సుధాకర్ (33)***
రైతు, గుంటూరు

పార్టీలు ఏవి వచ్చినా ఒరిగేదేమీ లేదు. వాగ్దానాలు నమ్మేవి కావు. కనీస అవసరాలు తీరేట్టులేదు. మా బతుకు మమ్మల్ని బతకనిస్తే చాలు. వాళ్లు వాళ్లు కొట్టుకుంటున్నారు. కాని, ప్రజలకు చేస్తుంది ఏంలేదు.

***రాములు (50)***
రైతు, గుంటూరు

(పై రెండు అభిప్రాయాలు సేకరించినవారు ***బి. అంజమ్మ,*** రైతు, గుంటూరు జిల్లా)

టివిలు గీవీలు మాకెందుకు సార్. మా బతుకు భరోసా ఇవ్వాలి. అయినా మాదాక అవ్వెందుకు వస్తయి.

***పోసక్క***
డ్వాక్రా మహిళ, మంచిర్యాల

సెల్‌ఫోన్‌లు, టివిలు మా కడుపు నింపుతవా? జొన్న పంట పండితే మా బతుకులు బాగుంటయి. ఎవుసం మంచిగ జరిగితే అదే పదివేలు. ఓట్లముందు ఎన్నో జెప్తరు. అయినాంక మళ్లరారు.

***ఆత్రం జంగుబాయి***
వ్యవసాయ కూలీ, మంచిర్యాల

టివిల వల్ల మంచి ఉంది చెడు ఉంది. కొంత జ్ఞానం వస్తుంది. అవసరమొచ్చినపుడు అమ్ముకున్న ఆరు ఏడు వస్తవి. పేదోని అవసరం తీర్తది.

***రాజన్న***
హోటల్ కార్మికుడు, మంచిర్యాల

నిరుద్యోగభృతి వల్ల లాభం లేదు. పని చూపాలే. పని చేసుకునే చదువులుండాలి. అప్పుడే నిరుద్యోగం పోతది. ఎందరికని నిరుద్యోగభృతి ఇస్తరు? ఎట్లా సాధ్యం?

***జి. మల్లేష్***
గ్రాడ్యుయేట్, మంచిర్యాల

(పై నాలుగు అభిప్రాయాలు సేకరించినవారు ***సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి*** మంచిర్యాల, ఆదిలాబాద్)

*తెలంగాణ ఆకాంక్షలకు తూట్లు పొడిచి, ఉద్యమాలను రక్తపుటేరుల్లో ముంచి, గత ప్రభుత్వం కన్నా దూకుడుగా ప్రపంచబ్యాంక్ విధానాలని అమలు చేసిన కాంగ్రెస్ ప్రభుత్వ స్వభావాన్ని వివరిస్తున్నారు* **కిరణ్**

# ఈ ఎన్నికలు ఎవరి కోసం?

ఏప్రిల్ 2004లో జరిగిన అసెంబ్లీ, పార్లమెంట్ ఎన్నికల సందర్భంగా రాష్ట్రంలో చంద్రబాబు ప్రభుత్వానికి వ్యతిరేకంగా నెలకొన్న పరిస్థితుల్ని అత్యంత చాకచక్యంగా ఉపయోగించుకొని, వైఎస్ఆర్ నాయకత్వంలోని కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. ముఖ్యంగా చంద్రబాబు అనుసరించిన ప్రపంచబ్యాంక్ విధానాలను వ్యతిరేకిస్తూ, తమ పార్టీ అధికారంలోకి వస్తే ప్రపంచబ్యాంక్ పథకాలను సమీక్షిస్తానని ప్రకటించారు. టిడిపి పాలనలో మృగ్యమైన ప్రజాస్వామిక హక్కుల్ని పునరుద్ధరిస్తామనీ, నక్సలైట్ల సమస్య సామాజిక, ఆర్థిక సమస్యనీ, వారితో చర్చలు జరుపుతామనీ, బూటకపు ఎన్‌కౌంటర్లు ఉండవనీ ప్రచారం చేసారు. ప్రత్యేక తెలంగాణకు అనుకూలంగా టిఆర్ఎస్‌తో పొత్తు కుదుర్చుకున్నారు. బిజెపి నేతృత్వంలోని ఎన్‌డిఎ లో భాగస్వామిగా ఉన్న టిడిపి పై ముస్లింలకు ఉన్న వ్యతిరేకతను తమకు అనుకూలంగా మల్చుకున్నారు. ఏ అంశాలనైతే ఉపయోగించుకొని కాంగ్రెస్ అధికారంలోకి వచ్చిందో. అధికారంలోకి వచ్చిన మరుక్షణం నుంచి ఆ అంశాలకు తూట్లు పొడుస్తూ వచ్చింది. ప్రజల, ప్రజాస్వామికవాదుల ఒత్తిడి మేరకు అక్టోబరు 2004లో కాంగ్రెస్ ప్రభుత్వం చర్చలకు సిద్ధపడినప్పటికీ, మొదటి విడత చర్చలు కాగానే ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షలకు తూట్లు పొడుస్తూ చర్చల ప్రక్రియకు విఘాతం కలిగించింది. ఎస్ఐబి, గ్రేహౌండ్స్, పోలీస్ బలగాలను ఉసిగొల్పి వందలాది మంది విప్లవకారుల్ని, సానుభూతి పరుల్ని, ప్రజల్ని ఈ ప్రభుత్వం హత్యగావించింది. ఈ కాలంలోనే ప్రభుత్వ ప్రేరేపిత హంతక ముఠాలైన కోబ్రా వంటి సంస్థలు ఏర్పడి ప్రజాస్వామికవాదులను, ప్రజాసంఘ నాయకులను హత్యగావించాయి. కొంతమందిని మాయం చేశాయి. ఇట్లా ప్రస్తుత కాంగ్రెస్ హయాంలో రాష్ట్ర వ్యాప్తంగా నాలుగు వందల మందికి పైగా హత్యగావించబడ్డారు. ఈ హత్యలలో ఎక్కువ భాగం పోలీసులు నిర్వహించిన బూటకపు ఎన్‌కౌంటర్ల ద్వారా జరిగినవే.

ప్రస్తుత కాంగ్రెస్ ప్రభుత్వం ఒకవైపున విప్లవోద్యమంపైన అణిచివేత, నిర్మూలన దాడిని కొనసాగిస్తూనే మరోవైపు ప్రపంచబ్యాంక్ ఆదేశిత విధానాలను చంద్రబాబు హయాంలో కంటే కఠినంగా కొనసాగిస్తూ వచ్చింది.

ఈ ప్రభుత్వం దేశంలో ఏ రాష్ట్రంలో అనుమతించనన్ని సెజ్‌లను పెట్టుబడి దారులకూ, బహుళజాతి సంస్థలకూ కట్టబెట్టి లక్షలాదిమంది రైతాంగాన్ని పంట భూముల నుండి తరిమివేసి నిర్వాసితుల్ని చేసింది. అభివృద్ధి పేరుతో బాక్సైట్ గనులు, కృష్ణపట్నం అల్ట్రా మెగా థర్మల్ ప్లాంట్, కోస్తా కారిడార్, పోలవరం వంటి ప్రాజెక్టులు, గనుల నిర్మాణాలకు అనుమతిస్తూ, ఆదివాసుల్ని, మత్స్యకారులను, రైతాంగాన్ని నిలువ నీడలేకుండా చేస్తోంది ఈ ప్రభుత్వం. ఈ ఒప్పందాలన్నింటిలో కోట్లాది రూపాయల ముడుపులను తాము, తమ పరివారం దండుకుంటున్నారు.

ఇక ప్రత్యేక తెలంగాణ వూసే లేకుండాపోయింది. ఎన్నికల సందర్భంగా టిఆర్ఎస్‌తో చేతులు కలిపి అధికారంలోకి రాగానే బోడిమల్లన్న అన్న చందంగా టిఆర్ఎస్‌లోనే చీలిక తెచ్చింది కాంగ్రెస్. యుపిఎలో ప్రజాభిప్రాయ సాధన పేరుతో ఐదు సంవత్సరాలు తాత్సారం చేసి ప్రజల ప్రత్యేక తెలంగాణ ఆకాంక్షలపై నీళ్లు చల్లడానికి చేయాల్సిన కుటిల ప్రయత్నాలు అన్నీ చేసింది కాంగ్రెస్ ప్రభుత్వం.

జలయజ్ఞం పేరుతో ఒక్క ప్రాజెక్టును కూడా పూర్తి చేయక పోయినప్పటికీ కోట్లాది రూపాయల ముడుపులు మింగి, అవినీతికి అగ్రతాంబూలం ఇచ్చారు. ఉచిత విద్యుత్ తన ప్రభుత్వ గొప్పతనంగా చెప్పుకుంటూ వచ్చిన వైఎస్ఆర్ ప్రభుత్వం, కనీసం ఏడు గంటలు కూడా రైతాంగానికి కరెంటు సరఫరా చేయలేకపోయారు. సకాలంలో విత్తనాలు, ఎరువులు, పురుగు మందులు అందక రైతాంగం ఆందోళనలు చేపడితే వారిపై తీవ్రమైన అణిచివేత ప్రయోగించారు. తనది రైతు ప్రభుత్వం అని హరితాంధ్రను నిర్మిస్తానని ప్రగల్భాలు పలికిన కాంగ్రెస్ ప్రభుత్వం రైతాంగాన్ని మార్కెట్ శక్తులకు బలిచేసి రాష్ట్రంలో వ్యవసాయ సంక్షోభాన్ని తీవ్రతరం చేసింది. అన్ని సెక్షన్ల ప్రజల జీవన పరిస్థితుల్ని మరింత దిగజార్చారు. రాష్ట్రంలో రైతాంగ ఆత్మహత్యలు ఇంకా నిరాటంకంగా కొనసాగుతూనే ఉన్నాయి. చేనేత కార్మికుల ఆకలి చావుల అంశం అప్పుడే రాజకీయ పార్టీల ఎన్నికల వ్యూహంలో భాగంగా నలిగింది.

రాష్ట్రంలో నెలకొన్న ఈ పరిస్థితుల్ని ఎన్నికలలో తమకు అనుకూలంగా మలచుకోవడానికి అన్ని రాజకీయ పార్టీలు పావులు కదుపుతున్నాయి.

స్వర్ణాంధ్ర పేరుతో రాష్ట్రాన్ని స్మశానాంధ్రగా మార్చిన చంద్రబాబు తిరిగి అధికారంలోకి రావడానికి వెంపర్లాడుతున్నారు. ఒకప్పుడు సంక్షేమ పథకాలు, ప్రత్యేక తెలంగాణను వ్యతిరేకించిన చంద్రబాబు ఇప్పుడు ఆమోదముద్ర వేసారు. టిఆర్ఎస్ ఏ రోజూ కూడా ప్రజా ఉద్యమాలను

చేపట్టకపోవడమే కాక, ఈ అయిదు సంవత్సరాల్లో తెలంగాణలోనే ఎన్నో ప్రజాపోరాటాలు, ప్రజల డిమాండ్లు ముందుకు వచ్చాయి. వేటిని టిఆర్ఎస్ చేపట్టలేదు. కేవలం ఎన్నికల్లో విజయం సాధించి ప్రత్యేక తెలంగాణ సాధించగలనని చెబుతూ వస్తున్న టిఆర్ఎస్ ఎంఎల్ఎలు, ఎంపిలు 2007లో చేసిన రాజీనామాలతో ఉప ఎన్నికలు జరగగా టిఆర్ఎస్‌కు చేదు అనుభవాన్నే మిగిల్చాయి. ప్రస్తుతం తెలంగాణ ప్రజల్లో, ఒంటరి అయిన స్థితిలో కాంగ్రెస్‌ను ఓడించే లక్ష్యంతో మహాకూటమిలో చేరింది. మరోసారి తెలంగాణ ప్రజలను, ప్రజల ఆకాంక్షలను బలిపెట్టడానికి ప్రయత్నిస్తున్నది. ఆ పార్టీకి ప్రత్యేక తెలంగాణ పట్ల, మరీ ముఖ్యంగా తెలంగాణ ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షల పట్ల చిత్తశుద్ధి లేదు.

ఇటీవలి కాలంలో టిడిపి లో రెండవ స్థానంలో ఉన్న దేవేందర్ గౌడ్ ఆ పార్టీని వదిలి నవ తెలంగాణ పార్టీ (ఎన్‌టిపి) ని ఏర్పర్చారు. తెలుగుదేశం పార్టీ అధికారంలో ఉన్నప్పుడు హోంమంత్రిగా ఉండి తెలంగాణ ఉద్యమాన్ని అణిచివేయడంతోపాటు, విప్లవోద్యమంపై ఉక్కుపాదం మోపారు. అధికారం కోల్పోయిన తర్వాత మళ్లీ ప్రజల అభిమానాన్ని పొందడానికి తెలంగాణలో ఏవో కొన్ని ఆందోళనలు చేపట్టారు. టిడిపి నావ మునుగుతుందని తెలిసి ప్రత్యేక తెలంగాణ నినాదాన్ని చేపట్టారు. ఈ మధ్యకాలంలో బిసి లాబీయింగ్‌తోని ముందుకు వచ్చిన ప్రజారాజ్యం పార్టీతో ఎన్నికల పొత్తు పెట్టుకుని అధికారానికి రావడానికి నిచ్చెనలు వేయడమే కాక ఆ పార్టీలో విలీనమయ్యారు.

పాలకవర్గాలకు వెనుక ప్రజల్ని సమీకృతం చేయడంలో అత్యంత విశ్వసనీయ పాత్ర పోషించే వామపక్షాలు నేడు సైతం రాష్ట్రంలో అదే పాత్రను సమర్థవంతంగా పోషిస్తున్నాయి. ప్రభుత్వ విధానాలతో ప్రజల ఆగ్రహం తీవ్రస్థాయికి చేరుతుంటే వారి ఆగ్రహాన్ని ఓట్లుగా మరలిస్తున్నారు. ఎప్పుడూ ఏదో ఒక పాలకవర్గానికి పల్లకీ మోసే వామపక్షాలు ఈసారి టిడిపి, టిఆర్ఎస్‌ల పల్లకిని మోయడానికి సిద్ధపడ్డాయి. వీరితో మహాకూటమిని ఏర్పర్చారు.

ఇక బిజెపి విషయం అయితే ప్రత్యేక తెలంగాణ ఏర్పాటును తన ప్రాథమిక ఎన్నికల ఎజెండా అంశంగా ముందుకు తెస్తున్నది. అధికారంలోకి వచ్చిన వంద రోజులలోనే తెలంగాణ ఏర్పాటు చేస్తామని ప్రకటించింది.

అంతకుముందు అయిదు సంవత్సరాలు అధికారం చెలాయించిన బిజెపికి తెలంగాణ విషయం గుర్తుకు రాలేదు. పైగా టిడిపి తో చెట్టపట్టాలు వేసుకొని తిరిగింది. ఇప్పుడు రాష్ట్రంలో ఒంటరిగా మిగిలిన అవకాశవాద పద్ధతుల్లో ప్రత్యేక తెలంగాణ నినాదాన్ని భుజాన వేసుకొస్తుంది. ఏమాత్రం అవకాశం దొరికినా ముస్లిం వ్యతిరేక హిందూ మతోన్మాదాన్ని రెచ్చగొట్టడానికి చూస్తోంది.

టిఆర్ఎస్ 2004లో కాంగ్రెస్‌తో ఎన్నికల పొత్తు పెట్టుకొని కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ యుపిఎ తో అధికారంలో భాగస్వామ్యం వహించి లాబీయింగ్‌తో ప్రత్యేక తెలంగాణ సాధించగలమని తెలంగాణ ప్రజలకు నమ్మబలికింది. మరోవైపు ఈ అయిదు సంవత్సరాల్లో ప్రత్యేక తెలంగాణ ఉద్యమం తీవ్ర నిర్బంధాన్ని ఎదుర్కొంటూ బలోపేతం అయింది. ఈ రోజు ప్రజా ఉద్యమాలల్లో ప్రథమ స్థానాన్ని ఆక్రమించింది. ఐక్యంగా అన్ని తరగతుల ప్రజలు ఉద్యమిస్తున్నారు. ఈ ఉద్యమాలల్లో ర్యాలీ అవుతున్న ప్రజానీకాన్ని చీల్చి ఓటు బ్యాంకుగా మలచుకోవడం కోసం అన్ని పార్టీలు ఉవ్విళ్లురుతున్నాయి. ఈ ఎన్నికల్లో ప్రధానంగా తెలంగాణ ఎజెండా పెట్టుకొని ఈ రోజు అన్ని పార్టీలు నిమగ్నం అయినాయి. పార్టీల పాచికలను ఓడించి, నిజం అయినటువంటి ప్రజాస్వామిక తెలంగాణను పోరాటాలతోనే సాధించుకోవాలి.

ఈ సంవత్సరాల్లో తెలంగాణలో నిర్బంధం కొనసాగినప్పటికీ ప్రజా ఆందోళనలు అనేకం ముందుకు వచ్చాయి. పోలవరం ప్రాజెక్టును, సింగరేణి ప్రైవేటీకరణను, ఓపెన్ కాస్ట్ గనులను వ్యతిరేకిస్తూ కార్మికుల, నిర్వాసితుల పోరాటం, గోదావరి నదీ జలాలు తెలంగాణ ప్రజలకు దక్కాలని బాబ్లీ ప్రాజెక్టును వ్యతిరేకిస్తూ పోరాటం, బీడీ కట్టలపై పుర్రెగుర్తు తొలగించాలని, ఎరువులు, పురుగులమందులు, విత్తనాలు గిట్టుబాటు ధరలకోసం, కరెంటు కోతకు వ్యతిరేకంగా రైతాంగపు మిలిటెంట్ ఆందోళనలు, అసైన్డ్ భూముల కోసం, భూ బకాసురులకు వ్యతిరేకంగా, 610 జిఒను అమలు చేయాలని, సెజ్‌లకు వ్యతిరేకంగా, పోలీసు నిర్బంధానికి, బూటకపు ఎన్‌కౌంటర్లకు వ్యతిరేకంగా ప్రజలు ఉద్యమించారు. దేశవ్యాపిత ఉమ్మడి విధానాలకై టీచర్లు మిలిటెంట్‌గా పోరాడారు. నేడు కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ అధికారంలో ఉన్న పార్టీలు విప్లవోద్యమంపై సమన్వయంతో దాడిని తీవ్రతరం చేస్తున్నాయి.

అన్ని రాష్ట్రాలలో ప్రత్యేక బలగాలను ఏర్పరిచారు. సిఆర్‌పిఎఫ్ నుండి పదివేలమందిని ఎంపిక చేసి కోబ్రా (కంబాట్ బెటాలియన్ ఫర్ రిజల్యూట్ యాక్షన్) పేరుతో ప్రత్యేక శిక్షణనిచ్చి దాడి తీవ్రతను పెంచుతున్నారు.

పాలక వర్గాలు ప్రజాస్వామ్యం పేరిట ఎన్నికలను ఒకతంతుగా చేసి తమ పబ్బం గడుపుకొంటున్నాయి. ఈ తరుణంలో ప్రజలు తమ ప్రజాస్వామిక ఆకాంక్షలకై ఉద్యమించడమే ఏకైక మార్గం. వీ

**వచ్చే సంచికలలో...**

- **ఫోకస్ - మే 2009 : నలభై సంవత్సరాల ప్రత్యేక తెలంగాణ ఉద్యమం**
- **ఫోకస్ - జూన్ 2009 : కొత్త ప్రభుత్వం - సొంత ఎజెండా - ప్రజల ఆకాంక్షలు**
- **మహిళలపై జరుగుతున్న హత్యలు, అత్యాచారాలు - సంకినేని వెంకటయ్య, సంకినేని మంజుల**
- **జాతీయ ఉపాధి హామీ పథకం - అమలు - బుర్ర శ్రీధర్, కేతిరెడ్డి వాసు**

*ఎన్నికలప్పుడు నక్సలైట్ ఉద్యమాన్ని సామాజిక, రాజకీయార్థిక సమస్యగా పేర్కొంటూ, అధికారంలోకి రాగానే దాన్ని శాంతిభద్రతల సమస్యగా అణచివేసే పాలకపార్టీల ద్వంద్వనీతినీ, అవకాశవాదాన్నీ విమర్శిస్తున్నారు* **వరవరరావు**

# సమస్యలు నక్సలైట్లవా? ప్రజలవా?

మాజీ డిజిపి, ప్రస్తుతం ప్రజారాజ్యం పార్టీ ఉపాధ్యక్షుడు ఆంజనేయరెడ్డి తాము అధికారంలోకి వస్తే మావోయిస్టు పార్టీపై నిషేధం ఎత్తివేసే విషయం పరిశీలిస్తామని, వారితో చర్చలు జరుపుతామని కూడా అన్నారు. అయితే సమస్య వాళ్లది గనుక వాళ్లు వస్తే చర్చలు జరుపుతామన్నారు. అంతకుముందు ప్రరాపా మానిఫెస్టో ముసాయిదా విడుదల చేసినపుడు అధ్యక్షుడు చిరంజీవి కూడ నక్సలైట్లు వస్తే చర్చలు జరుపుతామని, వారిని జనజీవన స్రవంతిలోకి తెస్తామని ప్రకటించారు.

అంటే ఇద్దరి అవగాహనలో కూడ నక్సలైట్లు ఒక సమస్య. ఆ మాటకొస్తే అన్ని ఎన్నికల పార్టీలకు కూడ నక్సలైట్లు ఒక సమస్య. కొందరికి శాంతి భద్రతల సమస్య. కొందరికి సామాజిక ఆర్థిక సమస్య. ఇప్పుడు ఎన్నికల సమయం గనుక అందరికందరికీ సామాజిక ఆర్థిక సమస్య గానే కనిపిస్తున్నట్లున్నది.

నక్సలైట్లు ఒక సమస్య అనుకోవడం ఒక అవగాహన అయితే, వాళ్లు శాంతి భద్రతల సమస్య కాకుండా సామాజిక ఆర్థిక సమస్య అనుకోవడం కొంచెం తెలివయిన అవగాహన అని, అది ఆ సమస్యను సానుభూతితో అర్థం చేసుకోవడం అని భావించే వాళ్లు చాలమందే ఉంటారు. నక్సలైట్లకేవో సమస్యలున్నాయి, అందుకోసమే తుపాకులు పట్టుకొని అజ్ఞాత జీవితంలో ఉంటున్నారు అనుకునే వాళ్లూ తక్కువేమీ కాదు. దానినుంచి వచ్చిందే వాళ్లను జనజీవన స్రవంతిలోకి తేవాలన్న యావ.

2004 అక్టోబరులో రెండు విప్లవ పార్టీలను కాంగ్రెస్ ప్రభుత్వం చర్చలకు పిలిచినప్పుడు మొదటి రోజు అక్టోబర్ 15న హోంమంత్రి మీకేం కావాలో అడగండి అన్నాడు. 'మాకేం కావాలి. ప్రజలకు ప్రజాస్వామిక హక్కులు, భూమి, వనర్లు, పని డిమాండు చేయడానికి వచ్చామే తప్ప మాకేమీ అక్కర్లేదు' అన్నాడు రామకృష్ణ.

ఒక సుప్రసిద్ధమైన ప్రజల పాటలో చెప్పినట్లు వాళ్లు తమ కుటుంబాలను, ఇళ్లను, ఉంటే ఆస్తిని కూడ వదిలి, తల్లిదండ్రులు పెట్టిన పేరు కూడ వదిలి ప్రజలకోసం పోరాటం చేయడానికి వెళ్లినవాళ్లు.

అరవయ్యేళ్ల స్వాతంత్ర్యం తర్వాత కూడ ఈ దేశంలో ప్రజల సమస్యలన్నీ అపరిష్కృతంగానే మిగిలిపోవడమే కాదు మరింత జటిలమయ్యాయని వాళ్లు గుర్తించారు. రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలు, ప్రాథమిక హక్కులు, ప్రజాతంత్ర లౌకిక ప్రజాస్వామ్యం అనే లక్ష్య ప్రకటన, సోషలిస్టు తరహా సమాజ సాధన, పంచవర్ష ప్రణాళికలు, సహకార వ్యవస్థ, గరీబీ హటావ్ వంటి విధానాలు, నినాదాలు సమాజంలో సమానత్వం సాధించడం అలా ఉంచి అంతరాలను ఎంతగానో పెంచాయి.

కాంగ్రెస్ ప్రభుత్వం మొదలు కాంగ్రెసేతర ప్రభుత్వాల వరకు జరిగిన అన్ని పార్లమెంటరీ ప్రయోగాలు విఫలమైనవి. అవి ప్రయత్నిస్తే విఫలమయినవా లేక ఆ మాయమాటలతో పాలకవర్గాలు ఇంతకాలం మోసం చేసినవా, అణచివేత, దోపిడీలకు పార్లమెంటును ఒక ఆమోదిత అవకాశంగా వాడుకున్నారా అనే అంశాలు విశ్లేషించి ఇంక ఒక ప్రత్యామ్నాయ మార్గం ద్వారా, నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని విజయవంతం చేయాలని భావించిన విప్లవకారులు నక్సల్బరీ పోరాటాన్ని ప్రారంభించారు.

అంటే నక్సలైట్లుగా మనం పిలుచుకుంటున్న విప్లవకారులు తాము ఎంచుకున్న పంథా ప్రజల సమస్యలకు ఒక ప్రత్యామ్నాయ పరిష్కారమని భావిస్తున్నారు. అది క్రమంగా విప్లవపంథా పట్ల అంగీకారం లేని ప్రజాస్వామ్య వాదులు కూడ గుర్తిస్తున్నారు. పన్నెండేళ్ల క్రితం జస్టిస్ ఎం.ఎన్.రావు ఒక నక్సలైటు ఖైదీ పిటిషన్ను విచారించిన సందర్భంలో ఇచ్చిన తీర్పులో – ఆలోచించగా నక్సలైట్లది ఒక సమస్యగా కనిపించడంలేదు, సమాజంలో ఉన్న సమస్యలకు ఒకానొక పరిష్కారంగా నయినా దానిని గుర్తించవలసి ఉంటుందేమోనని రాసారు.

నక్సలైట్లకు జోహార్లు, నక్సలైట్లు దేశభక్తులు, నక్సలైట్లు తనతో చేతులు కలిపితే ఎర్రకోటపై ఎర్రజెండా ఎగురవేస్తామని 1983 ఎన్నికల్లో ప్రకటించి అధికారానికి వచ్చిన ఎన్టీఆర్ 1985లో పోగొట్టుకున్న పదవిని, వాళ్ల సహకారం కూడ తీసుకొని పొంది 85 నుంచి నక్సలైట్ల మీద అప్రకటిత నిషేధాన్ని అమలు చేసాడు. ఎన్‌కౌంటర్లు, మిస్సింగు కేసులు, టాడా ప్రయోగాలు, చివరకు ప్రజాస్వామ్య వ్యక్తీకరణలయిన ఆట, పాట, మాటలను బంద్ చేసాడు. ఆ రోజుల్లోనే పౌరహక్కుల నాయకులు గోపి రాజన్న, డాక్టర్ రామనాథం, జాపాలక్ష్మారెడ్డిలు రాజ్యం కనుసన్నల్లో హత్యకు గురయ్యారు. పోలీసులే డైనమైటు పెట్టి ఇంద్రవెల్లి స్థూపాన్ని కూల్చివేసారు.

'87లో ఆదిలాబాదు అడవుల్లో ఆలంపల్లి వద్ద పీపుల్స్‌వార్ గెరిల్లాలు సిఆర్‌పి క్యాంపుపై దాడిచేసారు. అందులో పదకొండు మంది జవానులు, ఒక విప్లవకారుడు మరణించారు. అప్పుడే కళ్లు తెరిచినట్లు

ఎన్టీఆర్ తాను నక్సలైట్లతో చర్చలకు సిద్ధమన్నాడు. ఎన్‌కౌంటర్లు ఆపి, సానుకూలమైన వాతావరణం ఏర్పడితే తాము చర్చలకు సిద్ధమేనని అప్పటి పీపుల్స్‌వార్ రాష్ట్ర కార్యదర్శి గణపతి జవాబిచ్చాడు.

నక్సలైట్లతో చర్చలు అనే అంశం ఇట్లా అజెండా మీదికి వచ్చింది. మధ్య మధ్యన ఇటువంటి ఆకాంక్షలు ప్రజాస్వామ్యవాదులు వెలువరిస్తూనే ఉన్నారు గానీ జస్టిస్ ఎం.ఎస్.రావు తీర్పుతో కన్సర్న్‌డ్ సిటిజన్స్ కమిటీ ఈ చర్చలు సాధ్యం చేయడానికే ఏర్పడింది.

అధికారంలో ఉన్న ఒక రాజకీయ పార్టీ అజ్ఞాతంలో ఉన్న ఒక విప్లవపార్టీతో చర్చిస్తానని అంటున్నదంటే ఆ రెండింటి మధ్య ప్రజాసమస్యల పరిష్కారానికి సంబంధించిన తమ తమ అజెండాలు ఉన్నాయని గుర్తించడం. ఆ రెండింటి నుంచి ఏదయినా ఒక ఆమోద యోగ్యమైన పరిష్కారం లభిస్తుందా అని చర్చించడం. అందుకనే ఆ చర్చలు రాజ్యాధికారం కోసమో, తమ తమ సిద్ధాంతాలు అంగీకరింపచేయడం కోసమో జరుగవు. అట్లా జరుగలేదు కూడా.

నక్సలైట్లు దున్నేవారికే భూమి కావాలనే తమ ఆర్థిక కార్యక్రమాన్ని చర్చల అంశంగా ప్రతిపాదించలేదు. ప్రభుత్వం దగ్గర ఉన్న మిగులు భూములు, దురాక్రమణలో ఉన్న భూములు భూమి లేని నిరుపేద ప్రజలకు పంచాలన్నారు. వాక్, సభా, విశ్వాస స్వాతంత్ర్యాలు పునరుద్ధరించాలన్నారు. చర్చ జరుగలేదు గానీ స్వావలంబనలో భాగంగా మూసేసిన ప్రభుత్వరంగంలోని పరిశ్రమలను తిరిగి తెరవాలని, దళితులకు, ఆదివాసులకు, మహిళలకు, మైనారిటీలకు సామాజిక న్యాయం లభించాలని ప్రతిపాదించారు. ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం డిమాండ్‌ను, మద్యపానం, గుట్కాలపై నిషేధాన్ని ప్రతిపాదించారు.

ఈ చర్చలను విఫలం చేసిన కాంగ్రెస్ ప్రభుత్వం కూడ చర్చలకు రెండు విప్లవ పార్టీలను తానే పిలిచింది గానీ, వాళ్లు వస్తే మాట్లాడుతామనలేదు. గాలింపు చర్యలు, ఎన్‌కౌంటర్లు ఆపి, నిషేధం తొలగించి సానుకూల వాతావరణం కల్పించి చర్చలకు పిలిచింది. కనుక ప్రజారాజ్యం పార్టీ సమస్యలు వాళ్లవి గనుక వాళ్లే రావాలని, వస్తే చర్చిస్తామని అనడం చరిత్ర తెలియకపోవడమే.

విధి విధానాల నిర్ణయం దగ్గరే చర్చలు విఫలం చేసిన తెలుగుదేశం ప్రభుత్వం కూడ 2002లో పీపుల్స్‌వార్‌ను తానే చర్చలకు పిలిచింది. చర్చలకు వచ్చే నాయకత్వంపై తలలకు వెలకట్టే పద్ధతిని పాటించబోమని చెప్పింది.

ఇటు పొరుగున ఎల్టీటిఇతో శ్రీలంక ప్రభుత్వం, అటు పొరుగున మావోయిస్టు పార్టీతో నేపాల్ ప్రభుత్వం చర్చలకు ఆహ్వానించి చర్చలు జరిపినవి తప్ప వాళ్లే రావాలి, సమస్యలు వాళ్లవి, కనుక వాళ్లు వస్తే చర్చిస్తామని అనలేదు.

మనదేశంలోనే నాగా విప్లవ ప్రభుత్వంతో కేంద్రంలోని వాజపేయి ప్రభుత్వం, అస్సాం వేర్పాటువాదులతో కేంద్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వం తామే ఆహ్వానించి చర్చలు జరిపాయి.

ఎన్నికలకు ముందు ప్రజారాజ్యం పార్టీ మావోయిస్టు పార్టీ పై నిషేధం ఎత్తివేసే విషయం ఆలోచిస్తామని చెప్పడం వరకు 2004 ఎన్నికల్లో కాంగ్రెస్-తెరాసల ఎన్నికల వాగ్దానం కన్నా వాస్తవాన్ని గుర్తించడమే.

కాని వాళ్లు వస్తే చర్చిస్తామనడం మెలిక పెట్టడం అవుతుంది. సమస్యలు వాళ్లవి అనడం పూర్తిగా అవగాహనా రాహిత్యమవుతుంది.

తాము అధికారానికి వస్తే నక్సలైట్లతో చర్చిస్తామని ప్రకటించే పార్టీకి చిత్తశుద్ధి ఉంటే నిషేధం తొలగించడమొక్కటే కాదు, గాలింపు చర్యలు నిలిపివేయాలి, ఎన్‌కౌంటర్‌లు ఆపివేయాలి. రాజకీయ ఖైదీలపై ఉన్న కేసులన్నీ ఉపసంహరించుకొని వాళ్లను విడుదల చేయాలి. వాక్ సభ విశ్వాస స్వాతంత్ర్యాలను పునరుద్ధరించాలి. అన్ని విధాల చర్చలకు సానుకూలమైన వాతావరణం ఏర్పరచి ప్రభుత్వమే విప్లవకారులను చర్చలకు పిలవాలి. ఈ అంశాలు ఇప్పుడే తమ ఎన్నికల మానిఫెస్టోలో విస్పష్టంగా ప్రకటించాలి.

అయితే, గియితే ఇప్పుడు మానిఫెస్టోలో చేర్చి, ఇది కూడ ఒక కారణంగా అధికారంలోకి వచ్చి తు.చ. పాటించి చర్చలకు పిలిచినా నక్సలైట్లు చర్చలకు రారనేదే జవాబు. ఎందుకంటే ఇవన్నీ ఎన్నికల మానిఫెస్టోలో పేర్కొనకున్నా, ఎన్‌కౌంటర్లను హత్యానేరంగా గుర్తించడం మినహా మిగతా అంశాలన్నీ కాంగ్రెస్ ప్రభుత్వం 2004 మే నుంచి డిసెంబర్ దాకా పాటించింది. ఆ ఏడు నెలలు ఎన్‌కౌంటర్లు లేవు. ఇరువైపుల ప్రాణనష్టం ఇంచుమించు లేనట్లే.

చర్చల పర్యవసానం ప్రభుత్వ వంచనయేనని 2005 జనవరి నుంచే తెలిసివచ్చింది. ఇంక గత నాలుగు సంవత్సరాల చరిత్ర అంతా రక్తసిక్తమైన హింసా విధ్వంసాల చరిత్రే.

చర్చలకు వెళ్లి ఉండాల్సింది కాదని మావోయిస్టు పార్టీ ఐక్యతా కాంగ్రెస్ 2007లోనే సమీక్షించుకున్నది. కనుక ఒక అస్పష్టమైన, అనిర్దిష్టమైన, అవగాహనా రహితమైన ప్రతిపాదనతో ప్రజారాజ్యం పార్టీ మావోయిస్టు పార్టీతో చర్చలు చేస్తాననడం, ఆ చర్చలకు సమస్య వాళ్లది గనుక వాళ్లే వస్తే మాట్లాడుతాననడం హాస్యాస్పదంగానే కాదు, ప్రజాస్వామ్య సంస్కృతికి అవమానకరంగా కూడా ఉన్నది.

ఇంకొక రాజకీయ పార్టీని, తనకన్నా నలభై ఏళ్ల క్రితం ఏర్పడిన పార్టీని ఇంత చులకనగా భావించడం ఇపుడే మొదలైతే ఇంక అధికారానికి వస్తే ఎట్లా ప్రవర్తిస్తుందో. వీ

**సింగరేణిలో ఓపెన్‌కాస్ట్ విధ్వంసం - యాంత్రీకరణ** లపై సింగరేణి ప్రచురణల వ్యాసాల సంపుటి
తీసుకురావాలనుకుంటున్నాం. ఆసక్తి ఉన్నవారు తమ రచనలను,
వివరాలను **ఏప్రిల్ 20లోగా** ఈ కింది అడ్రస్‌కు పంపగలరు.

**శ్రీమన్నారాయణ మూర్తి**, టీచర్,
ఇ.నెం. 18-387/5, ఎల్ఐసి కాలనీ, మంచిర్యాల,
ఆదిలాబాద్ - 504 208. సెల్ : 94411 59090

*కార్మిక ఉద్యమాలను అణచివేసి, కార్మికులను వస్తు సంస్కృతికి, వ్యక్తిగత రుణ సౌకర్యాలకు కట్టేసి సమష్టి చైతన్యం నుంచి ఒంటరి ఆత్మహత్యలకు నెట్టేసిన పాలకుల విధానాలను వివరిస్తున్నారు* **పిట్టల రవీందర్**

# ఎన్నికలు - గని కార్మికుల భవిష్యత్తు

**ఉ**త్పత్తి రంగంలో మానవతా విలువలను పెంపొందించేందుకే ప్రభుత్వరంగ సంస్థలను స్థాపిస్తున్నట్లు అలనాడు మన పాలకులు వల్లించిన సుభాషితాలు ఆచరణలో ఏనాడూ కనిపించిన దాఖలాలులేవు. దేశంలోనే మొట్టమొదటి ప్రభుత్వ రంగ సంస్థగా వినుతికెక్కిన సింగరేణి బొగ్గుగనుల సంస్థ ఇందుకు ఏ విధంగానూ మినహాయింపుకాదు. మన దేశంలో నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానాలపేరిట 1991 నుండి అమలులోకి తీసుకువచ్చిన సరళీకరణ పాలసీలకు సంబంధించిన పర్యవసానాలు జనబాహుళ్యానికి అవగాహనలోకి రావడానికి ఇతర ప్రభుత్వరంగ సంస్థల్లో మాదిరిగానే సింగరేణిలోనూ ఐదారేళ్ల కాలం పట్టింది. ఉద్యోగ నియామకాలను పూర్తిగా నిలిపివేసి, కార్మికవర్గం పోరాడి సాధించుకున్న డిపెండెంట్ ఎంప్లాయ్‌మెంటు లాంటి అనేక సౌకర్యాలను రద్దుపరచి, బంగారు కరచాలనం (స్వచ్ఛంద పదవీ విరమణలాంటి ఇతరేతర పేర్లతోపాటుగా) అమలులోకి తీసుకురావడం ద్వారా వేలాదిమంది గని కార్మికులను కంపెనీ నుండి తొలగించేవరకూ ... సంస్కరణల పేరిట సింగరేణి యాజమాన్యం అమలులోకి తీసుకువచ్చిన ప్రపంచబ్యాంకు నమూనాకు సంబంధించిన సారాంశాన్ని కార్మికవర్గ అవగాహనలోకి రాకుండా నిలువరించడంలో అధికారులు అమలు జరిపిన గ్లోబల్ పాలనాపద్ధతులు ఉపకరించాయి.

1997 నుండి సింగరేణి బొగ్గుగనుల సంస్థ 'మొదటిదశ సంస్కరణ' పేరిట అమలులోకి తీసుకువచ్చిన విధానాల ఫలితంగా కోల్‌బెల్ట్ ప్రాంతాల్లో ఊహకందని పరిణామాలు చోటుచేసుకున్నాయి. ముఖ్యంగా ప్రపంచ వ్యాపితంగా ఎలుగెత్తి నినదించిన సింగరేణి గని కార్మికవర్గం గొంతు మూగబోయింది. న్యాయమైన డిమాండ్ల సాధనకోసం సంఘంగా ఏర్పడే అవకాశం లేకుండాపోయింది. 'ఒక పరిశ్రమ – ఒకే యూనియన్' పేరుతో వందలాది క్రాఫ్ట్ (వృత్తి) సంఘాలు కాలక్రమంలో కనుమరుగయ్యాయి. వెరిఫికేషన్ ఎన్నికల పేరుతో బూర్జువాపార్టీలకు అనుబంధంగా పనిచేసే తొత్తు సంఘాలదే సింగరేణిలో పైచేయిగా మారిపోయింది. సింగరేణి గని కార్మికుల హక్కుల పరిరక్షణ లోనూ, డిమాండ్ల సాధనలోనూ అంతవరకూ కొనసాగిన ప్రజాస్వామిక పోరాటాలకూ, ఆరాటాలకూ 'ఒక పరిశ్రమ – ఒకే యూనియన్' విధానం గండికొట్టింది. సింగరేణిలో అప్పటికే తమ ఉనికిని కోల్పోయి, గనికార్మికుల నుండి తృణీకరణకు గురైన జాతీయ కార్మిక సంఘాలు ఈ పెనుమార్పునకు పూర్తిస్థాయిలో లోపాయికారీ మద్దతును కొనసాగించాయి. ఈ పరిణామాలన్నీ తెలుగుదేశంపార్టీ అధికారంలో కొనసాగిన కాలంలోనే చోటుచేసుకున్నాయి. రెండవదశలో అమలు జరిపిన సంస్కరణల్లో సింగరేణి బొగ్గుగనులను దశలవారీగా, పూర్తిస్థాయిలో యాంత్రీకరణ పద్ధతులను అమలులోకి తీసుకువచ్చారు. కార్మికుల సంఖ్యను తగ్గించడం, బొగ్గు ఉత్పత్తిని వేగవంతం చేయడం ఈ దశలో లక్ష్యాలుగా ఉన్నాయి. చంద్రబాబునాయుడు ముఖ్యమంత్రిగా తెలుగుదేశం పార్టీ ఈ రాష్ట్రంలో కొనసాగిన తొమ్మిది సంవత్సరాల వ్యవధిలోనే సింగరేణిలో సుమారు 22వేలమంది కార్మికులను ఉద్యోగాలనుండి శాశ్వతంగా తొలగించివేసారు. ఉద్యోగ నియామకాలను పూర్తిగా నిలిపివేసారు. సింగరేణి గనికార్మికోద్యమ ఫలితంగా కార్మికవర్గ చైతన్యం పెరిగి, కార్మికులు తమ కుటుంబసంక్షేమం పట్ల దృష్టిని నిలిపి, తమ పిల్లలను విద్యావంతులుగా తీర్చిదిద్ది, భవిష్యత్తులో సింగరేణిలో ఉద్యోగం పొందుతారనే నమ్మకంతో ఉన్న సమయంలోనే కంపెనీలో ఉద్యోగ నియామకాలను పూర్తిగా నిలిపివేయడంతో కార్మిక కుటుంబాలు తీవ్రమనోవేదనకు గురయ్యాయి. ఈ హఠాత్తు పరిణామాలను తట్టుకుని, బయటపడే మార్గం వారికి కనిపించలేదు. సింగరేణిలో ఉత్పత్తి చేస్తున్న బొగ్గులో దాదాపు మూడువంతులు ఇతర ప్రాంతాలకు తరలించుకు పోవడంతో కోల్‌బెల్ట్ ప్రాంతాలలో కొత్తగా ఎలాంటి పరిశ్రమలు రాలేదు. పైగా కరెంటు, బొగ్గు కొరతల నెపంతో ప్రపంచంలోనే అతిపెద్దదయిన రామగుండం ఎరువుల కర్మాగారాన్ని మూసివేసారు. అంతర్గాం నేత, నూలు మిల్లులను మూసివేసారు. నిజాం కాలంనాటి రామగుండం 'ఎ' థర్మల్ విద్యుత్తు కేంద్రాన్ని శాశ్వతంగా మూసివేసి, కూలింగ్ టవర్లను సైతం బాంబులుపెట్టి కూల్చివేసారు. ఆ స్థానంలో నిర్మిస్తామని ప్రారంభించిన బిపిఎల్ పవర్ ప్రాజెక్టు పునాదుల్లోనే సమాధి అయిపోయింది. ఫలితంగా కోల్‌బెల్ట్ ప్రాంతాలలో నిరుద్యోగం అంతకంతకూ పెరిగిపోయింది.

తెలంగాణ గ్రామీణ ప్రాంతాలనుండి ఆత్మగౌరవంతో కూడిన బ్రతుకుదెరువుకోసం సింగరేణి బొగ్గుగనుల ప్రాంతాలకు చేరుకున్న వేలాది దళిత కుటుంబాలు 'బొగ్గుగనులు, ఉపాధి, ఉద్యమాలతో' కలగలిసిపోయి ఒక కొత్తతరం నయాకార్మికవర్గంగా అభివృద్ధిచెందారు. అయితే సంస్కరణల పేరుతో అనుభవంలోకి వచ్చిన మార్పులను తట్టుకునేందుకుగానీ, పూర్తిగా ఎదురునిలిచేందుకుగానీ ఈ నయాకార్మికవర్గానికి సాధ్యంకాని పరిస్థితుల్లోకి నెట్టివేయబడినారు. ఉత్తర తెలంగాణ జిల్లాలకు చెందిన కనీసం యాభయిలక్షల కుటుంబాలు ఈ సంక్షోభాన్ని ప్రస్తుతం ఎదుర్కొంటున్నాయి. వామపక్ష కార్మికోద్యమాల

# కెఎన్‌వై పతంజలి



ప్రముఖ పాత్రికేయుడు, నవలాకారుడు, కవి, ఆయుర్వేద వైద్యుడు కె.ఎన్.వై.పతంజలి మార్చ్ 11న విశాఖపట్నంలోని ఒక ప్రైవేట్ ఆస్పత్రిలో మరణించారు. ఆయన కొద్ది రోజులుగా కేన్సర్‌తో బాధపడుతున్నారు. ఆయన పూర్తిపేరు కాకర్లపూడి నారసింహయోగ పతంజలి. ఆయన విజయనగరం జిల్లా జామి మండలం అలమండలో 29 మార్చ్ 1952న జన్మించారు. ఆయన అలమండ, కొత్తవలస, విజయనగరం లలో విద్యాభ్యాసం చేశారు. ఆయన కళాశాలలో చదువుతున్న సమయంలోనే విప్లవ కవితలు, కథలు రచించారు. ఆయన 1975లో పాత్రికేయుడిగా తన ప్రస్థానం మొదలుపెట్టారు. 1980లో ఈనాడులో జర్నలిస్టుగా చేరి న్యూస్ ఎడిటర్ స్థాయి వరకు ఎదిగారు. ఆయన ఉదయం, ఆంధ్రభూమి దినపత్రికలలో, టివి9లో ఆయన ఎడిటర్‌గా పని చేశారు. చనిపోయేనాటికి సాక్షి దినపత్రిక సంపాదకుడిగా ఉన్నారు. ఆయన స్పష్టంగా, స్వచ్ఛంగా, ముక్కుసూటిగా సంపాదకీయాలు రాసేవారు. 'ఖాకీవనం' నవలతో పతంజలి ప్రసిద్ధి చెందారు.'పెంపుడు జంతువులు', 'రాజుగోరు' వంటి నవలలు సుప్రసిద్ధం. మేరా భారత్ మహాన్, ఒక దెయ్యం ఆత్మకథ, గోపాత్రుడు, వీర బొబ్బిలి, పిలక తిరుగుడు పువ్వు, నువ్వేకాదు, వేట కథలు, రాజుల లోగిళ్లు, దిక్కుమాలిన కాలేజీ, పతంజలి భాష్యం, చూపున్నపాట, పోయేకాలం, అప్పన్న సర్దార్... వంటి అత్యద్భుతమైన కథలు, నవలలు రాశారు. 'గెలుపు సరే... బతకడం ఎలా?' అనే పుస్తకంలో తన అనుభవాలు తెలియజేశారు. 'సింధూరం' సినిమాకు మాటల రచయితగా నంది అవార్డు అందుకున్నారు. హాస్య, వ్యంగ్య, ప్రజాపక్ష రచనలతో పతంజలి సాహిత్యలోకంలో చిరస్థాయిగా నిలిచిపోతారు వీ

వైఫల్యాలు కూడా ఇందుకు దోహదం చేసాయి. ముఖ్యంగా సింగరేణి గని కార్మికవర్గానికి కరదీపికగా నిలిచిన సింగరేణి కార్మిక సమాఖ్య (సికాస)లాంటి విప్లవ కార్మిక సంఘాలను నిలువరించడంలో గడచిన పది సంవత్సరాలుగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రత్యేక దృష్టితో పనిచేసాయి. ఇందులో భాగంగా యాజమాన్యాలు అనేకరకాలైన ఆధునిక పద్ధతులను అమలులోకి తీసుకువచ్చాయి.

సింగరేణి గని కార్మిక వర్గాన్ని ఆర్థికచట్రంలో ఇరికించాయి. ఇందుకోసం మోటారువాహనాలను కొనుక్కునేందుకు రుణాలను మంజూరు చేసాయి. అప్పటిదాకా గనులమీద నిర్వహించిన వేతనాల పంపిణీని బ్యాంకుల ద్వారా చెల్లించారు. బ్యాంకులు కూడా కార్మికులకు వ్యక్తిగత రుణాలను, విలాసవస్తువులను కొనుగోలు చేసేందుకు అవసరమైన రుణాలను ఎరవేసాయి. ఈ రుణాలకు పూచీకత్తుగా తోటి కార్మికులను ఇరికించాయి. క్రెడిట్‌కార్డులు, ఎటిఎం కార్డులు అవసరంతో నిమిత్తం లేకుండానే, అడక్కుండానే కార్మికులజేబుల్లోకి వచ్చిచేరాయి. కోల్‌బెల్ట్ ప్రాంతాలలో పరిస్థితి ఎంతదాకా చేరిందంటే, కార్మికులు తమ అవసరాల నిమిత్తం ఈ క్రెడిట్‌కార్డులను, ఎటిఎం కార్డులను, బ్యాంకు పాస్‌బుక్కులను కుదువబెట్టుకుని వడ్డీవ్యాపారు నుండి అప్పులు తీసుకునేదాకా వెళ్లింది. నెల మొదటివారంలో కార్మికుడే స్వయంగా తన వేతనాన్ని తీసుకునే స్వేచ్ఛను కోల్పోయి, వడ్డీ వ్యాపారి తనకు రావాల్సిన సొమ్మును వసూలు చేసుకున్న తర్వాత మాత్రమే, మిగిలిన మొత్తాన్ని కార్మికుడు తీసుకోనేందుకు అవకాశం ఉంటుంది. ఈ పరిణామాల ఫలితంగా కార్మికులు తప్పనిసరిగా గనిలోకివెళ్లి పనిచేయాల్సిన అవసరం ఏర్పడింది.

నెలవేతనం మీద ఆధారపడి చేసిన అప్పులు, రుణవాయిదాల చెల్లింపులు తప్పనిసరి కావడంతో సింగరేణి గని కార్మికులు అనారోగ్యపరిస్థితుల్లోనూ గనిలోకి వెళ్లాల్సిన అనివార్యత ఏర్పడింది. ఇదే సమయంలో ఉత్పత్తి లక్ష్యాలను చేరుకునే పేరుతో అండర్‌గ్రౌండ్ బొగ్గుగనుల్లో కార్మికులమీద పనిభారం అంతకంతకూ పెంచివేసారు. దిగువశ్రేణి అధికారవర్గానికి ప్రోత్సాహకాలను ఎరగా వేసి కిందిస్థాయి కార్మికులపై ఒత్తిడిని తీవ్రతరం చేసారు. ఈ పరిస్థితులకు తట్టుకోలేని యువకార్మికులు సింగరేణి ఉద్యోగం అంటేనే భయపడే స్థితికి చేరుకున్నారు.ప్రతిరోజూ సక్రమంగా విధులకు హాజరు కాలేకపోయారు. ఇదే సమయంలో సంవత్సరంలో కనీసం 240 రోజులు హాజరులేని కార్మికులకు నోటీసులు జారీ చేసారు. కార్మికుల కుటుంబాలకు కౌన్సిలింగ్ నిర్వహించారు. ఈ విధంగా సింగరేణిలోని బొగ్గుగని కార్మికుల ఆత్మగౌరవాన్ని, ఆత్మాభిమానాన్ని దెబ్బతీసారు.. ఈ నేపథ్యంలోనే వయసు పైబడినవారు స్వచ్ఛంద పదవీ విరమణ కోసం ఎదురుచూసారు. సింగరేణిలో ఇప్పటికే పదమూడుసార్లు ఇట్లాంటి స్వచ్ఛంద పదవీ విరమణ పథకాన్ని అమలు జరిపి, దాదాపు ఇరవై ఐదు వేలమంది కార్మికులను నిర్బంధంగా తొలగించివేసారు.

మరోవైపున గనులమీద కార్మికులకు విరామ సమయం లేకుండా చేసారు. ఇందుకోసం యోగాతరగతులను నిర్వహించారు. అక్షరాస్యతా కార్యక్రమాలను అమలు చేసారు. ఎయిడ్స్ వ్యాధిని గురించి బోధనా తరగతులను నిర్వహించారు. బొగ్గుగనులమీద ప్రత్యేకంగా ధ్యానమందిరాలనే నిర్మించారు. గతంలో కార్మికులు గనిలోకి దిగేముందు పరస్పరం చర్చించుకునే అవకాశం లేకుండా పోయింది. తమ బాధలను వెళ్లబోసుకునేందుకు ఆస్కారం లేకుండా పోయింది. అండర్‌గ్రౌండ్‌లో పనిపరిస్థితులపై సమీక్షించుకునే వీలులేకుండా పోయింది. గనికార్మికుల జీవితాలను ఒక నిర్వేదం ఆవరించుకుంది. ఈ పరిణామాలు కుటుంబజీవనంపై తీవ్రమైన ప్రభావాన్ని చూపాయి. సింగరేణి గని కార్మికులు సమూహిక వ్యక్తీకరణకు దూరమయ్యారు. ఒంటరితనంతో లోలోపల కుమిలిపోతున్నారు.

ఇట్లా సింగరేణిలో గడచిన పదిసంవత్సరాలుగా అమలులోకి వచ్చిన సంస్కరణల పర్యవసానంగా గని కార్మికులు తీవ్రమైన మానసిక ఒత్తిడులకులోనై, యాంత్రికమైన జీవనవిధానంలోకి నెట్టివేయబడి, చివరకు తానే ఒక యంత్రపరికరంగా మారిపోయాడు. ఇవ్వాళ్ల సింగరేణి కోల్‌బెల్ట్ ప్రాంతాలలో ప్రతినిత్యం వెలుగులోకి వస్తున్న ఆత్మహత్యల పరంపర ఇందుకు ఒక సూచిక మాత్రమే! వీ

*పార్లమెంటరీ ప్రజాస్వామ్యపు సారాంశాన్ని చూడకుండా, కేవలం ఎన్నికలు జరగడమే ప్రజాస్వామ్యమని జరుగుతున్న ప్రచారాన్ని విశ్లేషిస్తున్నారు* **ఎన్. వేణుగోపాల్**

# ప్రజాస్వామ్యమంటే ఎన్నికలు మాత్రమేనా?

ఎన్నికలలో ఎవరు గెలిచి అధికారానికి వస్తారు? ఎవరు ఓడిపోయి ప్రతిపక్షంలో కూచుంటారు? ఎవరు గెలిస్తే ఏ విధానాల ఆధారంగా పాలన సాగుతుంది? ఎవరు గెలిచినా పాలనా విధానాలు, పాలనా వ్యవస్థలు మారే అవకాశం ఉంటుందా? ఎవరు అధికారంలోకి వస్తే ప్రజాజీవితం ఏ కొంచెమైనా మెరుగుపడుతుంది? ఇటువంటి ప్రశ్నలు వేసుకునే సందర్భం ఇది. కాని ఈ ప్రశ్నలకన్న ముఖ్యంగా జవాబు చెప్పుకోవలసిన ప్రశ్నలు వేరే ఉన్నాయి. అసలు ఎన్నికలంటే ఏమిటి? ఎన్నికలను పరమ పవిత్రంగా చూడవలసిందేనా? ఎన్నికలు లేకపోతే ఏం జరుగుతుంది? సమాజం, పాలన ప్రజాస్వామికంగా ఉండాలంటే ఎన్నికలు తప్పనిసరిగా జలగవలసిందేనా? అసలు ప్రజాస్వామ్యం అంటే ఎన్నికలు మాత్రమేనా? ప్రజాస్వామ్యాన్ని భారత సమాజం వంటి సమాజంలో ఎలా అర్థం చేసుకోవాలి?

ప్రజాస్వామ్యం అనే మాటకు క్రీ.పూ. 5-4 శతాబ్దాల నాటి గ్రీకు నగర రాజ్యాల రోజుల నుంచీ రెండువేల ఐదువందల సంవత్సరాల చరిత్ర ఉన్నప్పటికీ ఇప్పటికీ ఒక సమగ్ర నిర్వచనం లేదు. గ్రీకు భాషలోని డెమోస్ (ప్రజలు), క్రాటోస్ (పాలన, బలం) అనే రెండు మాటలతో రూపొంది, డెమోక్రసీ అని ఇంగ్లిష్‌లోకి వచ్చిన ఈ మాట తెలుగులో ప్రజాస్వామ్యం అయింది. (స్వామ్యం అనే మాట స్వామి అనే సంస్కృత పదం నుంచి వచ్చింది. దానికి నాథుడు అని అర్థం. వాడుకలో స్వామ్యం అంటే ఆధిపత్యం, యజమానిగా ఉండడం, పైన ఉండడం అనే అర్థం ఉంది గనుక ప్రజాస్వామ్యం అనే అనువాదం ఎంత సరయినదనే సమస్య ఉండనే ఉంది).

అందరికీ ఆమోదయోగ్యమైన నిర్వచనం ఒకటి లేనప్పటికీ, రెండు లక్షణాల ద్వారా ప్రజాస్వామ్యాన్ని అర్థం చేసుకునే ప్రయత్నం జరుగుతోంది. అవి ఒకటి, తమ పాలన ఎలా ఉండాలో నిర్ణయించుకునే హక్కు, అవకాశం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రజలందరికీ ఉండడం. అంటే ప్రజలందరికీ పాలనాధికారం సమానంగా అందుబాటులో ఉండడం. తమను తామే పాలించుకోవడం. రెండు, ప్రజలందరికీ సమానమైన ప్రాథమిక హక్కులు, అధికారాలు ఉండడం. పాలన తమదే గనుక ప్రజలలో ఎక్కువ తక్కువలు లేకుండా అందరూ సమానంగా ఉండడం. ఈ రెండు లక్షణాలను దాదాపుగా ప్రజాస్వామిక సిద్ధాంతకర్తలందరూ ఆమోదించారు.

ఈ లక్షణాలను మరికొంత వివరంగా చూడవలసి ఉంది. ప్రజాస్వామ్యంలో ప్రజలు తమను తాము పాలించుకుంటారన్నప్పుడు, అది ప్రాతినిధ్య పాలన కాక తప్పదు. ఏథెన్స్ వంటి నగర రాజ్యాలలో ప్రజాస్వామ్యం మొదలయినప్పుడు పాలనా నిర్ణయాలలో పౌరులందరూ ప్రత్యక్షంగా పాల్గొనే అవకాశం ఉండేది గాని, కాలం గడిచినకొద్దీ, పాలనా ప్రాంత విస్తీర్ణం, జనసంఖ్య పెరిగినకొద్దీ ఈ ప్రత్యక్ష భాగస్వామ్యం సాధ్యం కాని స్థితి వచ్చింది. అంతేగాక, గ్రీకు నగర రాజ్యాలలోని ప్రత్యక్ష ప్రజాస్వామ్యంలో కూడ పౌరులంటే ఎవరనే నిర్వచనంలోనే సమస్య ఉంది. బానిసత్వాన్ని ఆమోదించిన ఆ సమాజం బానిసలకు నిర్ణయాధికారం ఇవ్వలేదు. స్త్రీలకు, పిల్లలకు కూడా నిర్ణయాధికారం ఇవ్వలేదు. అంటే అంత చిన్న నగర రాజ్యాలలో కూడ ప్రత్యక్ష ప్రజాస్వామ్యం సంపూర్ణంగా ఆచరణలోకి రాలేదు. అతి తక్కువమందిని, బానిస యాజమానులను, బానిసల శ్రమతో రూపొందిన అదనపు సంపదను అనుభవించే బుద్ధిజీవి వర్గాన్ని పౌరులుగా నిర్వచించి, వారికే ప్రత్యక్ష ప్రజాస్వామ్యాన్ని పరిమితం చేయవలసి వచ్చింది. ఇక కాలక్రమంలో సార్వత్రిక వయోజన వోటు హక్కు వచ్చి, కేవలం పిల్లలను మినహాయించి మిగిలినవారందరినీ పౌరులుగా గుర్తించిన తర్వాత, విశాలమైన దేశాలలో, జనసంఖ్య విపరీతంగా పెరిగిపోయినప్పుడు ప్రత్యక్ష ప్రజాస్వామ్యం అమలు చేయడం సులభం కాదు గనుక, ప్రాతినిధ్యం పరోక్ష ప్రజాస్వామ్య పద్ధతిలో అమలవుతోంది. ఈ పరోక్ష ప్రాతినిధ్య ప్రజాస్వామ్యంలో కూడ సమస్యలు ఉన్నాయి గాని ప్రస్తుతానికైతే చాల దేశాలు ఈ పరోక్ష ప్రాతినిధ్య రూపాన్నే ప్రజాస్వామ్యంగా నిర్వచించుకుంటున్నాయి.

ఇక సమాజంలో చాలమంది వ్యక్తులకు ఒక వ్యక్తి ప్రాతినిధ్యం వహించగలరని ఒప్పుకుంటున్నామంటేనే ఆ చాలమందికి ఆ ఒకరి గురించీ, తమ ప్రాతినిధ్య స్వభావం గురించీ, తాము ఇచ్చిన హక్కు ద్వారా ఆ ఒకరు చేయబోయే పనుల గురించీ పూర్తి సమాచారం ఉందనీ, ఉంటుందనీ, ఆ సమాచారం ఆధారంగానే వారు తమ నిర్ణయం తీసుకుంటున్నారనీ అనుకోవలసి వస్తుంది. అంటే ప్రజాస్వామ్యం అని తనను తాను గుర్తించుకునే సమాజంలో ప్రజలందరికీ అవసరమైన సమాచారం ఉండాలన్నమాట. ఆ సమాచార వినిమయం స్వేచ్ఛగా జరగడానికి అవకాశాలు ఉండాలన్నమాట.

సమాచారం ఉండడం, ఆ సమాచారాన్ని అర్థవంతమైన నిర్ణయాల కొరకు ఉపయోగించడానికి తగినట్టుగా సమాచార వినిమయం ఉండడం

అంటే వాక్సభా స్వాతంత్ర్యాలతో పాటు అన్ని ప్రాథమిక హక్కులు ఉండడం అని అర్థం. నా దగ్గర ఉన్న సమాచారాన్ని ఇతరులకు తెలియజేయాలంటే నాకు వాక్స్వాతంత్ర్యం ఉండాలి, భావ ప్రకటనా స్వాతంత్ర్యం ఉండాలి, ఎంతో మందితో మాట్లాడవలసి ఉంటుంది గనుక ఇతరులను కలుసుకునే హక్కు, ఎక్కడికైనా వెళ్లగలిగే హక్కు, ఇతరులతో కలిసి సంఘం ఏర్పాటు చేసుకునే హక్కు, తదితర హక్కులన్నీ ఉండాలి. ఇవి ఒకరికి ఉండడమంటే అర్థం ప్రతి ఒక్కరికీ ఉండడమనే. అంటే ఈ హక్కులు సమాజంలో ప్రతి ఒక్కరికీ సమానంగా ఉన్నప్పుడు మాత్రమే ఆ సమాజంలో ప్రజాస్వామ్యం ఉన్నదని చెప్పుకోగలుగుతాం.

కాని మూడు సంవత్సరాలకో, ఐదు సంవత్సరాలకో, ఆరు సంవత్సరాలకో క్రమబద్ధంగా ఎన్నికలు జరగడం మాత్రమే ప్రజాస్వామ్యం అయినట్టు, అటువంటి ఎన్నికలు జరిగే దేశాలన్నీ ప్రజాస్వామిక దేశాలయినట్టు చాలమంది పొరపాటు పడుతున్నారు. ఎన్నికల ప్రక్రియ ఎంత అపసవ్యంగా, అవినీతి మయంగా, అక్రమాలతో జరిగినా, ఎన్నికలు జరుగుతూ ఉంటే చాలు, ప్రజాస్వామ్యం ఉన్నట్టే అనే అభిప్రాయాన్ని పాలకవర్గాలు ప్రచారం చేస్తున్నాయి. ఆ ఎన్నికల ప్రక్రియ ఆధారంగానే పెద్ద ప్రజాస్వామ్యం, గొప్ప ప్రజాస్వామ్యం అనే విశేషణాలు కూడ చేరుస్తున్నారు. ప్రజాస్వామ్యం అనేది ఒక సామాజిక విలువ. ఒక సంస్కృతి. ఒక జీవన విధానం. ఒక పాలనా విధానం. అది ఉంటే ఉంటుంది, లేదా ఉండదు, లేదా అసమగ్రంగా ఉంటుంది. అంతేగాని దానిలో గొప్పదీ, పెద్దదీ ఏమీ లేదు.

ఎన్నికలు మాత్రమే ప్రజాస్వామ్యం కాదని చెప్పడానికి ఎన్నో ఆధారాలున్నాయి. ఎన్నికలు సార్వత్రిక వయోజన వోటు హక్కు ఆధారంగా జరగడం ఉన్న పద్ధతులన్నిటిలోకీ ఉత్తమమైన పద్ధతి అని అంటారు. బానిసలనూ, స్త్రీలనూ, పిల్లలనూ మినహాయించిన గ్రీకు నగర రాజ్యాల నుంచి ఇరవయో శతాబ్ది తొలి అర్థభాగంలో కూడ స్త్రీలను, పేదలను మినహాయించిన దాకా మొత్తం రెండున్నర వేల ఏళ్ల ప్రజాస్వామిక చరిత్రలో అందరికీ పాలనా నిర్ణయ అవకాశం ఉండే వయోజన వోటు హక్కువచ్చి ఇంకా వంద సంవత్సరాలు కూడా నిండలేదు. ప్రజాస్వామ్యమంటే మౌలిక అర్థం మనుషులందరూ సమానమే అని గుర్తించడం. ఆ గుర్తింపును పాలనకు వర్తింపజేస్తే ఒక మనిషికి ఒక వోటు అనే సూత్రం వస్తుంది. కాని ఆ సూత్రాన్ని కాగితం మీద రాసుకున్నప్పటికీ కూడ, ఆచరణలో కొందరు మనుషులకు వోటు హక్కు లేకపోవడం, కొందరు మనుషుల వోట్లకు ఎక్కువ విలువ ఉండడం ఇప్పటికీ కొనసాగుతూనే ఉంది.

నిజానికి సార్వత్రిక వయోజన వోటు హక్కు అనే సూత్రానికి కూడ ఆచరణలో ఎన్నో సమస్యలు ఉన్నాయి. ఒక నిర్ణీత వయసు దాటిన పౌరులకే, వయోజనులకే, ఆ హక్కును పరిమితం చేయడం ఒక సమస్య. అంతకన్న తక్కువ వయసు ఉన్న ప్రజలు పౌరులు కారా, వారి హక్కులను ఎవరు కాపాడతారు, వారికి ఎవరు ప్రాతినిధ్యం వహిస్తారు, పాలనలో వారికి భాగస్వామ్యం అవసరం లేదా వంటి ప్రశ్నలెన్నో ఉంటాయి. వోటు హక్కు రావడానికి 18 ఏళ్లో, 21 ఏళ్లో, 25 ఏళ్లో పరిమితి విధించుకున్న ఏ సమాజంలోనైనా అంతకన్న తక్కువ వయసు గల వాళ్లు ఇరవై శాతమో, ఇరవై ఐదు శాతమో ఉంటారు. అంటే ఆ సమాజానికి ప్రాతినిధ్యం వహించేందుకు ఎన్నికయిన అభ్యర్థి పట్ల ఆ ఇరవై శాతానికో, ఇరవై ఐదు శాతానికో ఎటువంటి అభిప్రాయం ఉన్నదో ఎవరికీ తెలియదు. కాని పాలకుడుగా ఆ అభ్యర్థి తీసుకునే విధాన నిర్ణయాలు ఆ వయోజనులు కాని వారికి కూడా వర్తిస్తాయి.

ఈ సమస్య అంతటితో అయిపోదు. వోటు హక్కు ఉన్న వయోజనులందరూ – అంటే ఆ సమాజంలోని డెబ్బై ఐదు, ఎనభై శాతం – తమ వోటు హక్కును వినియోగించుకుంటారనుకున్నా, అభ్యర్థుల సంఖ్య పెరిగిన కొద్దీ, గెలిచే అభ్యర్థికి వచ్చే వోట్ల సంఖ్య తగ్గిపోతుంది. సైద్ధాంతికంగా చూసినప్పుడు, ఆ డెబ్బై ఐదు శాతం మంది వోట్లను ఆశిస్తూ పదిమంది అభ్యర్థులు పోటీపడినప్పుడు, అందరికీ సగటున సమానమైన వోట్లు వచ్చినప్పుడు, ఎనిమిది – తొమ్మిది శాతం వోట్లు వచ్చినా అభ్యర్థి గెలిచి పాలకుడవుతాడు. అంటే తొమ్మిది మంది విశ్వాసాన్ని చూరగొన్న వ్యక్తి వందమందికి వర్తించే పాలన నడిపే అవకాశం పొందుతాడు.

ఇక్కడ మరొక సమస్య కూడ ఉంది. వోటు హక్కు ఉన్న ప్రజలందరూ పూర్తి సమాచారంతో, స్వతంత్రంగా తమ వోటు హక్కు వినియోగించుకుంటారనే ప్రాతిపదిక మీద ఈ లెక్కలు వేస్తున్నాం. కాని భారత సమాజం వంటి సమాజంలో వోటు హక్కు వినియోగించు కోవడంలో నిర్లిప్తత ఉంది. ఒకరి వోటు హక్కును మరొకరు వినియోగించడం, నిర్ణయించడం, ప్రభావితం చేయడం, ఆకర్షణల, ప్రలోభాల ద్వారా ఆ వోటు హక్కును మార్చడం వంటి అపసవ్య ధోరణులెన్నో ఉన్నాయి. అంటే మొత్తంగా ఎన్నికలలో వినియోగించబడుతున్న వోటు హక్కులో స్వతంత్రంగా, సంపూర్ణ సమాచారంతో, తమ అభిమతాన్ని ప్రకటించే దిశగా పడుతున్న వోట్ల సంఖ్య సగం కూడ ఉండకపోవచ్చు. 1952 నుంచి ఇప్పటివరకు భారతదేశంలో జరిగిన ఏ ఎన్నికలలోనూ 70 శాతం కన్న ఎక్కువ వోట్లు పడలేదు. అంటే స్పష్టంగా 30 శాతం మందికి పైగా పాలనలో తమ భాగస్వామ్యాన్ని ఉపయోగించుకోలేదు. ఉపయోగించుకున్నారేమో అనిపించిన 70 శాతం మందిలో కూడ స్వతంత్రంగా ఉపయోగించుకున్న వారు సగం కూడ ఉండకపోవచ్చు. అంటే ఇప్పటివరకూ ఏ ఎన్నికలలో నైనా వోటు హక్కు ఉన్న వారిలో 30–35 శాతం కన్న ఎక్కువమంది తమ అభిప్రాయాలు వ్యక్తం చేయలేదన్నమాట.

భారత సమాజం అనేక అస్తిత్వాలు, వాటి మధ్య తీవ్రమైన అసమానతలు ఉన్న సమాజం గనుక ప్రతి ఒక్క అస్తిత్వమూ, ప్రతి ఒక్క సమూహమూ తన ప్రాతినిధ్యాన్ని కోరుకుంటుంది. మరొకరు తనకు ప్రాతినిధ్యం వహించజాలరని అనుకుంటుంది. అందువల్లనే మన ఎన్నికలలో ఎక్కువమంది అభ్యరుథలు పోటీ పడుతుంటారు. కనీసం నలుగురు పోటీ పడ్డారనుకున్నా, వోటు హక్కును వినియోగించుకున్న 35 శాతంలో, తొమ్మిది శాతం వోట్లు తెచ్చుకున్నవారికి పాలనార్హత వస్తుందన్నమాట.

అంటే సైద్ధాంతికంగా చూసినా, భారత ఎన్నికల విధానపు ఆచరణ రీత్యా చూసినా, మన సమాజంలో పది శాతం కన్న తక్కువ మందికి ప్రాతినిధ్యం వహిస్తున్నవారికే వందమంది మీద పాలనాధికారం దక్కుతున్నది. ఇందుకు కారణం ప్రజాస్వామ్యానికి అత్యవసరమైన,

ప్రజాస్వామ్యం నెలకొనాలంటే ముందస్తు షరతు అయిన సమానత్వం అనే భావన భారత సమాజంలోకి ఎంతమాత్రమూ రాకపోవడమే. తన దగ్గర పారిశ్రామిక విప్లవంతో, ప్రజాస్వామిక విప్లవంతో తలెత్తిన వ్యక్తివాదం, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం వంటి విలువల వల్ల ఏర్పడిన పార్లమెంటరీ ప్రాతినిధ్య పద్ధతిని బ్రిటిష్ వలస వాదం అటువంటి సామాజిక మార్పులేమీ జరగని భారత సమాజంలోకి అంటు కట్టింది. సహజంగానే ఈ యూరోపియన్ మొక్క భారత నేలలో సక్రమంగా పెరగకపోవడమే కాక గుంటపూలు పూయడం మొదలుపెట్టింది.

ఇక్కడ పరిశీలించవలసిన ముఖ్యమైన రాజకీయార్థిక కోణం మరొకటి కూడ ఉంది. పాశ్చాత్య పెట్టుబడిదారీ సమాజాలు, ముఖ్యంగా పశ్చిమ యూరప్ దేశాలు, అమెరికా మార్కెట్ ఆర్థిక వ్యవస్థే ఉత్తమమైన సామాజిక నిర్మాణమని, ప్రజాస్వామ్యమే ఏకైక ఉత్తమ పాలనా విధానమని ప్రచారం చేస్తున్నాయి. ఒకరకంగా మార్కెట్ ఆధారిత పెట్టుబడిదారీ వ్యవస్థకూ, ప్రజాస్వామ్యానికీ అవినాభావ సంబంధం ఉన్నట్టు ప్రచారం చేస్తున్నాయి. మార్కెట్‌లో వినియోగదారుగా వ్యక్తికి ఎటువంటి స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారం ఉంటాయో, ఎన్నికలలో పౌరుడికి అటువంటి స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారం ఉంటాయని పెట్టుబడిదారీ ప్రజాస్వామిక సిద్ధాంతవేత్తలు ప్రవచిస్తున్నారు. పైకి చూడడానికి ఇది ఆకర్షణీయమైన విశ్లేషణ లాగానే కనిపిస్తుంది గాని, వినియోగదారుకు మార్కెట్‌లో ఉండే స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారాల మీద కొనుగోలు శక్తి అనే పరిమితి ఉంది. ఆ స్వాతంత్ర్యం సంపూర్ణమైనదీ, అందరికీ సమానంగా వర్తించేదీ కాదు. అదే విధంగా పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో వోటరుకు ఉండే స్వాతంత్ర్యానికీ, సార్వభౌమాధికారానికీ కూడ పరిమితులు ఉన్నాయి. అందరినీ సమానంగా చూస్తాననే మార్కెట్ కొనుగోలు శక్తి ఉన్న వినియోగదారును ఎక్కువగా చూసినట్టుగానే, అందరినీ సమానంగా చూస్తాననే ప్రజాస్వామ్యం కూడ సామాజిక స్థాయిని బట్టి విలువ ఇస్తుంది. భారత సమాజ్ వంటి అంతరాల సమాజంలో ఈ పరిమితులు మరింత ఎక్కువగా పని చేస్తాయి. ఒక మనిషికి ఒక వోటు అనే సూత్రం కాగితం మీద మాత్రమే మిగిలిపోయి, కులాన్ని బట్టి, మతాన్ని బట్టి, కుటుంబంలో స్థానాన్ని బట్టి, ఆస్తిని బట్టి ఒక మనిషికి ఒక వోటు ఉంటుందా లేదా, ఆ మనిషి ఆ వోటు హక్కును వినియోగించుకోవచ్చునా లేదా, వినియోగించుకుంటే ఎవరి అదుపాజ్ఞలలోపల వినియోగించుకోవచ్చును అనే విధి నిషేధాలెన్నో అమలులోకి వస్తాయి. అంటే భారత సమాజంలో ప్రజాస్వామిక ఎన్నికల మూల స్తూపమైన 'ఒక మనిషికి ఒక వోటు' అనే పద్ధతి సక్రమంగా అమలు కావడంలేదు. అందువల్ల దీన్ని ప్రజాస్వామ్యమని అనడానికే వీలులేదు.

కనుక మార్కెట్‌లో వినియోగదారు సార్వభౌమాధికారం నిజం కావాలంటే కొనుగోలుశక్తిలో సమానత్వం రావలసిన అవసరం ఎలా ఉందో, అలాగే ఎన్నికలలో వోటరు సార్వభౌమాధికారం నిజం కావాలంటే రాజకీయ సమానత్వం రావలసి ఉంటుంది. కాని రాజకీయ సమానత్వం అనేది ఆకాశం నుంచి ఊడిపడేది కాదు. ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక సమానత్వం లేకుండా రాజకీయ సమానత్వం సాధ్యమే కాదు. రాజకీయ సమానత్వం లేకుండా స్వేచ్ఛాయుతమైన, స్వతంత్రమైన ఎన్నికలకు అవకాశం లేనప్పుడు, ప్రజాస్వామ్యానికే అవకాశం లేనప్పుడు, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక సమానత్వం లేకుండా ప్రజాస్వామ్యం నెలకొనడానికి అవకాశం లేదని అర్థమవుతుంది.

ఎన్నికలు జరుగుతున్న పద్ధతిలో అవకతవకలవైపు నుంచి మాత్రమే కాక, ఎన్నికయి, ప్రజాప్రతినిధులుగా చట్టసభలలో పాల్గొంటున్న వారి వ్యవహార సరళిని బట్టి చూసినా భారత ప్రజాస్వామ్యం నిజమయిన ప్రజాస్వామ్యంగా లేదని అర్థమవుతుంది. ఎన్నికలలో పోటీ పడుతున్నప్పుడు తనకే ఎందుకు వోటు వేయాలో, ప్రత్యర్థుల కన్న తానే ఎందువల్ల ఉత్తమమైన అభ్యర్థో ప్రతి అభ్యర్థీ చెప్పుకోవలసి ఉంటుంది. అలా చెప్పుకుంటున్నదే చాల తక్కువమంది. ఒకవేళ చెప్పుకున్నా ఆ క్రమంలో చేసే వాగ్దానాలు అబద్ధాలనీ, అతిశయోక్తులనీ, ఆచరణకు రానివనీ చెప్పేవాళ్లకూ వినేవాళ్లకూ కూడ స్పష్టంగా తెలుసు. తాము ఎవరి వోట్ల వల్ల గెలివవలసి ఉన్నదో వారి సమస్యల పరిష్కారానికి తాము ఏమి చేయనున్నారో చెప్పుకోవలసిన అభ్యర్థులు ఆ ఊసే లేకుండా ఎన్నికల చదరంగంలో పావులు కదుపుతున్నారు. అంటే ఎన్నికలలో ప్రధానపాత్ర వహించవలసిన విధానాలకూ, ప్రణాళికలకూ ఉండవలసిన స్థానం ఉండడం లేదు. బెదిరింపులు, బుజ్జగింపులు, కుల, మత, ప్రాంత సమీకరణాలు, డబ్బు ప్రలోభాలు, మద్యం, దొంగ వోట్లు, ప్రత్యర్థికి పడతాయనుకున్న వోట్లను చీలదీయడం వంటి అనేక అక్రమ మార్గాలే ఎన్నికలలో ప్రధాన పాత్ర వహిస్తున్నాయి. ఈ మొత్తం క్రమంలో ఎన్నికలు భారీ పెట్టుబడులతో కూడిన వ్యాపారంగా మారిపోయాయి. పెట్టుబడిమీద లాభం ఏ స్థాయిలో వస్తుందో చూసుకోవడమే ప్రతి అభ్యర్థికీ, ప్రతి పార్టీకీ పని అయిపోయింది. అందువల్ల గెలిచి చట్టసభలో ఉన్నప్పుడు కూడ తమ పెట్టుబడి, లాభంతో సహా తిరిగి వచ్చే కార్యక్రమాలకే ఆ ఐదు సంవత్సరాలనూ వినియోగిస్తున్నారు తప్ప ఏ విధాన నిర్ణయాలు జరుగుతున్నాయి, వాటి వల్ల ప్రజాజీవనంపై ఏ ప్రభావాలు అనేది ప్రజాప్రతినిధులకు పట్టడం లేదు. స్వార్థపరశక్తులు, దేశదేశాల సంపన్నులు, బహుళజాతి సంస్థలు మన ప్రజల జీవితాలనూ, ఉపాధినీ, వనరులనూ అల్లకల్లోలం చేసే అనేక విధానాలను రూపొందించి పాలకుల చేత అమలు చేయిస్తుంటే, ప్రజా ప్రతినిధులన బడేవారికి – వారు అధికారపక్షం వారయినా, ప్రతిపక్షం వారయినా – సమాచారం కూడ ఉండడం లేదు. సమాచారం ఉన్న చోట కూడ వ్యతిరేకించవలసినంతగా వ్యతిరేకించడం లేదు. చట్టసభల కార్యక్రమంలో భాగం పంచుకోవడం కన్న తమ సొంతపనులు చక్కబెట్టుకోవడమే వారి ప్రధాన కర్తవ్యంగా మారిపోతోంది. అంటే మన ప్రజాప్రతినిధులన బడేవారు ఎవరికీ ప్రతినిధులుగా చట్టసభలలో ఉన్నారో వారి ప్రయోజనాల కొరకు పనిచేయడం లేదు. అంటే ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం అమలు కావడమే లేదు.

ఇంతకూ ప్రాతినిధ్యం ఎంతవరకు నిజమైన ప్రాతినిధ్యం అవుతుంది? విభిన్న అస్తిత్వాల, అంతరాల సమాజంలో ప్రాతినిధ్యం అనే దాన్ని ఎట్లా అర్థం చేసుకోవాలి? ఎవరు ఎవరికి ప్రాతినిధ్యం వహించగలరు? బహు అస్తిత్వాల సమాజంలో ప్రాతినిధ్యం కూడ బహుముఖాలుగా ఉండవలసి ఉంటుందా? లేక ఐదేళ్లకొకసారి ఎన్నికయిన ఒకరే ఎప్పుడూ అందరికీ ప్రాతినిధ్యం వహించగలరా?

ఈశాన్య రాష్ట్రాలలో భారత సైనిక అణచివేత కింద ఎటువంటి దుర్భర జీవన పరిస్థితులున్నాయో వివరిస్తున్నారు

**సి. వనజ**

# ఎక్కుపెట్టిన తుపాకుల మధ్య మణిపూర్

ఎక్కుపెట్టిన తుపాకీ గురికి ఎదురు నిలబడి బతకడం ఎలా ఉంటుందో దేశపు ఈశాన్య ప్రాంతానికి ఒక్కసారైనా వెళ్లకపోతే బహుశా అర్థం కాదు. ఎక్కుపెట్టిన తుపాకీకి ఎదురొడ్డి పోరాడడం గురించి కాదు ఇక్కడ మాట్లాడుతున్నది. బతకడం గురించి. నిరంతరం పహారా కాసే తుపాకుల గురి మధ్య రోజువారీ జీవితం గడపడం, పనులు చేసుకుని కుటుంబాలను పోషించుకుంటూ సాధారణ జీవితం గడపడం. అది ఎంత భయానక అనుభవమో తెలియాలంటే మణిపూర్ లేదా మరో ఈశాన్య రాష్ట్రం వెళ్లకపోతే అర్థం చేసుకోవడం కష్టం.

మార్చ్ మొదటివారంలో ఒక సమావేశం కోసం మణిపూర్ రాజధాని ఇంఫాల్ వెళ్లిన మహిళా జర్నలిస్టుల బృందానికి తొలిరోజు ఎదురయిన అనుభవం అక్కడి పరిస్థితికి ఒక చిన్న మచ్చుతునక మాత్రమే. అది ఇంఫాల్‌లో ఒక చివరి ఎగువ మధ్యతరగతి కాలనీ. అక్కడ ఇచ్చిన బసకు మధ్యాహ్నానికి చేరినవారిలో కొందరు సాయంత్రం నాలుగు గంటలకు బ్రెడ్ కొనుక్కుందామని బయటకు వెళ్లారు. అప్పటికి పదిహేను రోజుల క్రితం ప్రభుత్వంలో ఒక పెద్ద అధికారిని గుర్తు తెలియని వ్యక్తులు కాల్చి చంపడంతో నగరమంతటా ప్రతి రోజూ సాయంత్రం ఐదు గంటల నుంచి ఉదయం ఐదు గంటల వరకు కర్ఫ్యూ అమలులో ఉంది. దాంతో ఐదు లోపల వెనక్కి వచ్చేయమని నిర్వాహకులు హెచ్చరించారు.

ఐదుగురు కలిసి బ్రెడ్ కొనుక్కుని చిన్న చిన్న కొలనుల మధ్య ముద్దుగా విస్తరించిన కాలనీ, ఆ పక్కనే ఉన్న కొండల వరస సౌందర్యానికి విస్తుపోతూ వెనక్కు నడుస్తున్నప్పుడు ఐదు గంటలకు ఒక పది నిమిషాలు తక్కువ అయి ఉంటుంది. హఠాత్తుగా ఐదారు మిలిటరీ జీపులు రోడ్లమీద నడుస్తున్న వారిమీద ఎక్కుపెట్టిన తుపాకులతో రావడంతో ఒక్కసారి అందరికీ గుండెలు అవిసిపోయాయి. ఎందుకంటే అలావెళ్లే మిలిటరీ ఎంత చిన్న సంఘటనకయినా, అనుమానంతో అయినా కూడా రెచ్చిపోయి విచక్షణా రహితంగా కాల్పులు జరపగలదన్న సంగతి అప్పటికే అందరికీ తెలుసు. పరిగెత్తడానికి భయం. దాదాపు ప్రాణాలు అరచేత పెట్టుకుని బసకు వచ్చిపడ్డారు.

బయటి నుంచి వెళ్లినవారికి ఒక్కరోజు అనుభవమే ఇలా ఉంటే

---

మొదలయిన ప్రశ్నలెన్నిటికో సరయిన సమాధానాలు చెప్పుకున్నప్పుడే భారత సమాజంలో ప్రజాస్వామ్యం ఎలా సాధ్యమవుతుందో గుర్తించగలం.

ఎన్నికలు ఎక్కువలో ఎక్కువ కొన్ని సంవత్సరాలకు ఒకసారి, లక్షలాది మందికి ఒకరిని ప్రతినిధులుగా నిలపడం మాత్రమే చేయగలవు. అలా ఎన్నికయిన ప్రతినిధులకు జవాబుదారీతనం కూడ లేదు. అంతేగాక వారికి రక్షణగా రాజ్యాంగయంత్రాన్ని నిలిపి, వారిని ఎన్నుకున్న ప్రజల నుంచే దూరం చేసిన పాలనా పద్ధతి కొనసాగుతోంది. అందరినీ సమానంగా చూడవలసిన చట్టం కొందరి ప్రయోజనాలకొరకే తయారు కావడం ఒకవైపునా, సామాజిక సంక్షేమం కోసం రూపొందిన చట్టాలు అమలు కాకపోవడం, చట్టబద్ధపాలన లేకపోవడం మరొకపక్కనా కొనసాగుతున్నాయి. దీన్ని ఎంత పరిమిత అర్థంలో ప్రజాస్వామ్యంగా గుర్తించినా ఇది పైనుంచి ప్రజాస్వామ్యమే తప్ప కిందినుంచి ప్రజాస్వామ్యం కాదు. పాలకుల ప్రజాస్వామ్యమే తప్ప ప్రజల ప్రజాస్వామ్యం కాదు.

ప్రజల ప్రజాస్వామ్యం అంటే ఎన్నికలు ఉండడం, లేకపోవడం కన్న ముఖ్యంగా ప్రజల మధ్య సమానత్వం ఉండడం, ప్రజలకు నిజమైన పాలనాధికారంలో భాగస్వామ్యం ఉండడం. ప్రజలందరికీ సమాన హక్కులు ఉండడం, సామాజిక వనరులమీద ప్రజలందరికీ సమానమైన అదుపు ఉండడం. సామాజిక వనరులను వాడుకొని భౌతిక, మానసిక, సృజనాత్మక అభివృద్ధిని సాధించడంలో ప్రతి ఒక్కరికీ సమాన అవకాశాలు ఉండడం. పుట్టుక వల్ల, ఆస్తి వల్ల, కుల, మత, ప్రాంత భేదాలవల్ల, స్త్రీ-పురుష భేదం వల్ల ఏ ఒక్కరికీ హెచ్చు అవకాశాలు గాని, తక్కువ అవకాశాలు గాని లేని స్థితి ఉండడం. ఇటువంటి సమానత్వం ఉండాలంటే 'ఒకరి కోసం అందరూ, అందరికోసం ఒకరు' అనే సూత్రం అమలు కావలసి ఉంటుంది. అంటే వైవిధ్యాన్ని గుర్తిస్తూనే, అంగీకరిస్తూనే, భిన్నాభిప్రాయంతో గౌరవంగా వ్యవహరించగల, ఆదాన ప్రదానాలతో సహజీవనం గడపగల స్థితి ఏర్పడవలసి ఉంటుంది. అంటే ప్రజాస్వామ్యం ఒక పాలనా పద్ధతిగా మాత్రమే కాదు, ఒక జీవన విధానంగా, ఒక సంస్కృతిగా కింది నుంచి ప్రజల జీవితాలలోనూ, ఆలోచనలలోనూ స్థానం సంపాదించుకోవలసి ఉంటుంది. అటువంటి జీవన విధానాన్నీ, సంస్కృతినీ నెలకొల్పుకోగలిగినప్పుడు ప్రాతినిధ్యాన్ని ఎన్నికల ద్వారా మాత్రమే కొలవగల స్థితి ఉండదు. అప్పుడు ప్రజాస్వామ్యానికి ఎన్నికలు మాత్రమేననే సంకుచిత అర్థం మారిపోతుంది.

ప్రతిరోజూ అక్కడే అదే స్థితిలో బతికే వారి పరిస్థితి ఎలా ఉంటుందో మరి. రోజూ సాయంత్రం ఐదు గంటలకు జనజీవితం స్థంభించాల్సిందే. ఐదు గంటలు అవుతూ ఉంటే రాజధాని నగరం రోడ్లన్నీ భీతిల్లిపోతాయి. కనపడిన ఏదో ఒక వాహనాన్ని పట్టుకుని ఎలాగోలా ఇంటికి చేరడం కోసం మణిపూర్ వాసులు పరుగులు పెడుతుంటారు. మార్కెట్ నుంచి ప్రజలు తండోపతండాలుగా ఒక ఫోర్స్‌లాగా బయటకు వస్తుంటారు. ఒక సాయంత్రం అక్కడ పేరుమోసిన ఇమ్మా (తల్లి) మార్కెట్టుకు వెళ్లినప్పుడు మార్కెట్లో అడుగు పెట్టడానికి అందులోంచి బయటపడుతున్న ఒక మహా మానవ ప్రవాహాన్ని అడ్డుకోవలసి వచ్చింది. మనం ఐదయితే రోడ్లు ట్రాఫిక్‌తో నిండిపోతాయని భయపడే సమయానికి అక్కడి రోడ్లు నిర్మానుష్యం అయిపోతాయి.

అయితే ఇది మణిపూర్‌లో ఒక తాత్కాలిక స్థితి కాదు. కర్ఫ్యూ వేళల్లో తేడా ఉండొచ్చు. కొన్నిసార్లు అసలు కర్ఫ్యూ కూడా లేని అదృష్టవంతమైన రోజులూ ఉండవచ్చు. కాని దాదాపు నలభై ఏళ్లుగా మణిపూర్ ప్రజలు, ఆ మాటకొస్తే ఈశాన్య రాష్ట్రాల ప్రజలంతా కూడా దాదాపు ఇదే జీవితం గడుపుతున్నారు.

అక్కడ ఆర్మ్‌డ్ ఫోర్సెస్ స్పెషల్ పవర్స్ యాక్ట్ 1958 పేరున నలభై ఏళ్లుగా తిష్ట వేసుకుని కూర్చున్న భారత సైన్యం అకృత్యాలకు అంతు లేదన్నది ఐదారేళ్లుగానే బయటకు వెలుగుచూస్తున్న వాస్తవం.

ఈ చట్టం కింద కేవలం అనుమానం మీద ఎవరినైనా కాల్చి చంపొచ్చు. దానిపైన కనీసం ఎఫ్ఐఆర్ కూడా దాఖలు చేసే వీలు లేదు. అపరిమితమైన అధికారాలు ఉన్న ఆ చట్టం అండతో అక్కడ సైన్యం చేసే అరాచకాల గురించి ఎంత చెప్పినా తక్కువే. ఒక చిన్న మందుల దుకాణం మనిషితో ఒక ఆర్మీ జవానుకు తగాదా వస్తే వరసపెట్టి అన్ని మందుల దుకాణాల మీద కాల్పులు జరపడం వంటి చిల్లర సంఘటనలు అక్కడ నలభై ఏళ్ల ఆర్మీ చరిత్రలో వందలో వేలో. అక్కడ ఆర్మీతో తలపడుతున్న సాయుధ గెరిల్లా గ్రూపులు దాదాపు నలభై దాకా ఉంటాయని ఒక అంచనా. ప్రతిగా మణిపూర్‌లో రోజూ కనీసం ముగ్గురు నలుగురు ఎన్‌కౌంటర్ అవుతూ ఉంటారు. అందులో చాలా భాగం అనుమానితులు లేదా రోడ్డుమీద నడుస్తూ అకారణంగా ఆర్మీ తుపాకులకు చిక్కినవారు. ఫలితంగా మణిపూర్ అంతటా అసంఖ్యాకంగా వితంతువులు, అనాథపిల్లలు. హింస-ప్రతిహింస ఒక వలయంగా ఏర్పడి ఏది హింసో, ఏది ప్రతిహింసో అర్థం కానంత గందరగోళంలో సామాన్య జనజీవితం దుర్భరంగా మారిపోయింది.

ముందునుంచీ మణిపూర్ ఇలాగే ఉందా? లేదంటాడు మణిపూర్‌లో పనిచేస్తున్న హ్యూమన్‌రైట్స్ అలర్ట్ ప్రతినిధి బబ్లూ. మణిపూర్‌లో అనేకమంది యువకుల్లాగానే విద్యావంతుడైన, వివేకవంతుడైన ఈ యువకుడు మణిపూర్ జీవితంలో హింస ఎంత బలంగా వలయాలు వలయాలుగా వేళ్లునుకునిపోయిందో, సామాన్య జీవితం, భద్రత అన్న మాటలే వాళ్ల జీవితాల్లోంచి ఎలా అదృశ్యం అయ్యాయో వివరిస్తూ ఉంటే వినేవాళ్లకు మతిపోతుంది. ఊపిరాడదు. ఎలా అయినా అక్కడినుంచి పారిపోవాలనిపిస్తుంది. ఏమైనా చెయ్యాలనిపిస్తుంది.

కర్ణుడి చావుకి వంద కారణాలు అన్నట్లుగా మణిపూర్ ఘర్షణలకు వంద కోణాలు. అక్కడ మైదాన ప్రాంతాల్లో నివసించే వాళ్లను మెయితీలు అంటారు. వీళ్లు ప్రధానంగా వైష్ణవం పాటించే హిందువులు. ప్రధానంగా ఆదివాసీ భూభాగంగా ఉన్న ఈశాన్యంలో 18వ శతాబ్దంలో అడుగుపెట్టిన వైష్ణవం ఇది. కొండల్లో నివసించే ఆదివాసులు ప్రధానంగా నాగాలు, కుకీలు. కొండలకు, లోయలకు ఉండే ఘర్షణకు అటు నాగా, కుకీలు, ఇటు మెయితీలు ప్రాతినిధ్యం వహిస్తారు. కొండల్లో ఆధిపత్య పోరులో తిరిగి నాగాలు, కుకీలు ఒకరికొకరు ఎదురు నిలుస్తారు. తమ జాతులకు ప్రాతినిధ్యం వహిస్తూనో లేదా మొత్తంగా మణిపూర్ సార్వభౌమత్వానికి ప్రాతినిధ్యం వహిస్తూనో పనిచేస్తూ అక్కడ ఉన్న భారత ఆర్మీ మీద పోరాడే గెరిల్లా గ్రూపులు కొన్ని.

మణిపూర్ సార్వభౌమత్వం లేదా ఈశాన్య రాష్ట్రాల సార్వభౌమత్వం అన్నమాటలు మనలాగా 'భారత ప్రధాన భూభాగం'లో నివసించే వాళ్లకు రుచించకపోవచ్చు. అవును, ఈశాన్య రాష్ట్రాల వాళ్లు ఎవరైనా భారత దేశం అనరు. తాము, భారత ప్రధాన భూభాగం అని మాత్రమే అంటారు. భారత ప్రధాన భూభాగంలో ఉన్నప్పుడు చాలా మందికి ఈశాన్య రాష్ట్రాలు భారతదేశం అని ఎలా అనిపించదో అక్కడి వాళ్లకు కూడా తాము భారత దేశంలో భాగం అనిపించదు. వాళ్లు భారతీయులకు, బ్రిటిష్ వలసవాదులకు పెద్ద తేడా చూపరు. ఎందుకంటే చరిత్ర అలాంటిది.

ఈశాన్య రాష్ట్రాలకు భారత ప్రధాన భూభాగంతో ఉన్నది కేవలం 22 కిలోమీటర్ల కోడిమెడ వంటి భూభాగం సంబంధం మాత్రమే. మంగోలియన్ రేసుకు దగ్గరగా ఉండే ఈశాన్య రాష్ట్రాల ప్రజలు భారతదేశంలో ఎప్పుడూ భాగం కాదు. బ్రిటిష్‌కు ముందు ఉన్న మహా మహా హిందూ, ముస్లిం సామ్రాజ్యాలు సైతం ఈశాన్యానికి విస్తరించింది లేదు. బ్రిటిష్ వలసవాదులు మాత్రమే హద్దులు చెరిపి కొన్ని ఈశాన్య రాష్ట్రాలను ఇండియన్ యూనియన్ ఖాతాలో చేర్చారు. కాని మణిపూర్ వంటి చోట తీవ్ర ప్రతిఘటన ఎదురై ప్రత్యక్షంగా పాలించలేక స్థానిక రాజుల ద్వారా దొడ్డిదారి పాలన మాత్రమే చేయగలిగారు. 1947 ఆగస్ట్ 14న బ్రిటిష్ పార్లమెంట్‌లో ఇండియన్ యూనియన్ విముక్తి ప్రకటనతో ఈ ప్రాంతం కూడా విముక్తం అయింది. అప్పటికే విద్యావంతుల ప్రాంతంగా ఉన్న మణిపూర్‌లో రాజుల పాలన నుంచి ప్రజాస్వామ్య పాలనకోసం పోరాటాలు జరుగుతున్నాయి. ఫలితంగా 1947 మణిపూర్ రాజ్యాంగ చట్టం జరిగి చట్టసభలు ఏర్పడ్డాయి.

దేశ విభజన సమయంలో జిన్నా పాకిస్థాన్‌కు, నెహ్రూ ఇండియా, ఇంకా చుట్టు పక్కల ఉన్న బర్మా, చైనా వంటి అనేక దేశాలకు జరిగిన వాటాల పంపకంలో ఈశాన్య రాష్ట్రాలు భారత పద్దుల్లో పడ్డాయి. తమ పద్దులో ఉన్న రాష్ట్రాలను బలవంతంగా అయినా భారత్‌లో చేర్చే సమరోత్సాహంతో సర్దార్ వల్లభాయ్ పటేల్ దేశమంతా సైనిక చర్యలు జరిపిన రోజులవి. అలా చేర్చుకున్న షిల్లాంగ్‌కు అప్పటికే మణిపూర్‌కు నామమాత్రపు రాజుగా ఉన్న మహారాజా బోధచంద్రను పిలిపించి విలీన ఒప్పందంపై సంతకం చేయమని బలవంతం చేశారు.

అప్పటికే చట్టబద్ధంగా ఏర్పడిన సభ ఉందని, సంతకం చేయడానికి తనకు హక్కు లేదని మహారాజు వాదిస్తే, ఢిల్లీలో ఉన్న పటేల్ 'షిల్లాంగ్‌లో బ్రిగేడియర్‌లు ఎవరూ లేరా?' అని ప్రశ్నించారట. అటువంటి బెదిరింపుతో చేయించిన సంతకంతో మణిపూర్ భారత

ప్రధాన భూభాగంలో 1949లో భాగం అయింది. దాన్ని బలవంతంగా అమలు చేయడానికి ఆ తరువాతి కాలంలో సైనిక చర్యలు, అత్యంత అప్రజాస్వామికమైన ఎఎఫ్ఎస్‌పిఎ 1958 చట్టం, దాని ఆధారంతో నలభై ఏళ్లుగా అక్కడ ఆర్మీ తిష్ట మొదలయ్యాయి.

నిజానికి 1947 నాటికి మణిపూర్ ప్రజలకు, ముఖ్యంగా చదువుకున్న మధ్యతరగతి మణిపూర్ ప్రజలకు భారత దేశం అన్నా, గాంధీ, నెహ్రూ సోషలిస్టు భావాలన్నా ఎంతో గౌరవం ఉండేదంటాడు బబ్లూ. మర్యాదగా ప్రజలను అడిగి ఉంటే ఈ కలయిక సాఫీగానే జరిగి ఉండేదంటాడాయన. ఒక సైనిక చర్యతో జరిపిన ఈ బలవంతపు విలీనం చిన్న అందమైన కొండల, లోయల, కొలనుల దేశంలో చిచ్చు పెట్టింది. విలీనం జరిగిన ఏడాదే ఇండిపెండెంట్ సోషలిస్టు రిపబ్లిక్ మణిపూర్ కోసం మణిపూర్ రెడ్ ఆర్మీ పుట్టింది. దాన్ని సైన్యం నిరంకుశంగా అణచివేసిన తర్వాత మణిపూర్ సార్వభౌమత్వాన్ని కోరుతూ అనేక సాయుధ గెరిల్లా గ్రూపులు మొదలయ్యాయి. గాలి నిండిన రబ్బరు బుడగను ఒక చోట నొక్కితే మరొకచోట పైకి లేచినట్లు సైన్యం ఈ సాయుధ గ్రూపులను అణచివేసిన కొద్దీ అవి పుడుతూనే ఉన్నాయి.

ఈశాన్య ప్రాంతంలో సైన్యం చేసే అరాచకాలే కాదు, ప్రభుత్వం చేసే అరాచకాలకు కూడా తక్కువ లేదంటారు అక్కడి వాళ్లు. అక్కడి నుంచి సహజ వనరులను, సంపదలను యథేచ్ఛగా కొల్లగొట్టుకుని పోయే భారత ప్రభుత్వానికి ఆ రాష్ట్రాల అభివృద్ధిలో మాత్రం పూర్తి చిన్న చూపే. అందుకే మొత్తం ఈశాన్య ప్రాంతం భారతదేశ అభివృద్ధితో పోలిస్తే ముప్పై శాతం వెనకబడి ఉంది. అందుకే, ఇంఫాల్ వంటి రాష్ట్ర రాజధాని నగరంలో ఒక ఎగువ మధ్యతరగతి కాలనీలో కూడా మంచినీటి సౌకర్యం కనిపించదు. నగరం అంతా రోజుకు నాలుగు గంటల కరెంటుతో సరిపెట్టుకోవడం, దేశంలో ఉత్పత్తి అయ్యే పెట్రోల్‌లో ఇరవై ఐదు శాతం అందిస్తున్న అస్సాంలో కనీస జీవన ప్రమాణాలు కూడా లేకపోవడం. ప్రభుత్వం ఎంత దుర్మార్గం సాగిస్తోందంటే అక్కడ తీసిన ఆయిల్‌ను అస్సాం బయట శుద్ధిచేసి ఆ రాష్ట్రానికి అందులో ఒక పైసా ఆదాయం కూడా అందకుండా జాగ్రత్త పడుతోంది. పేదరికానికి, తిరుగుబాటుకు ఉన్న ప్రత్యక్ష సంబంధాన్ని తప్పు పట్టగలమా?

అక్కడ వలయాలు, వలయాలుగా విస్తరించిన హింసకూ, యువతలో మాదక ద్రవ్యాల వాడకానికి కూడా సంబంధం ఉంది. మణిపూర్ రాష్ట్రం ఏడాదికి ఐదువేల మంది పట్టభద్రులను ఉత్పత్తి చేస్తే అందులో ఏడాదికి యాభై మందికి కూడా ఉద్యోగాలు దొరకవు. ఏ జవాబుదారీతనమూ లేని, సైన్యం రక్షణతో పనులు చక్కబెట్టుకునే ప్రభుత్వాలు ఉన్న చోట ఉన్నదంతా విపరీతమైన అవినీతి. యువతలో పేరుకుపోయిన, పోతున్న నిస్సహాయత హింస, మాదక ద్రవ్యాలు చెరో ప్రత్యామ్నాయం కావడంలో వింతేముంది?

డెబ్బై దశకంలో మణిపూర్‌లో వెల్లువెత్తిన మహిళా ఉద్యమానికి అంతా అక్కడి యువతలో, ముఖ్యంగా యువకుల్లో పెరిగిన నైరాశ్యం, తాగుడు, మాదక ద్రవ్యాలకు అలవాటు పడి కుటుంబాల్లో చెలరేగిన గృహ హింసే కారణం అంటారు మహిళా ఉద్యమ నాయకులు రోస్. ఇంత ఉద్రిక్తతలో మణిపూర్‌లో మహిళలు నిలబడుతున్న తీరు చెప్పుకోక తప్పదు.

మణిపూర్‌లో హక్కుల కోసం, తమ, పౌర, సమాజ హక్కుల కోసం అయినా నిలబడి ఏ సంస్థలో పనిచేసే మహిళయినా మీరా పైబీ అంటారు. మణిపూర్ భాషలో మీరా అంటే కాగడా, పైబీ అంటే మోసేవాళ్లు. నిజం చెప్పాలంటే నలభై ఏళ్లుగా అక్కడ జరుగుతున్న అరాచకాలను కొంతైనా బయటి ప్రపంచం దృష్టికి, ముఖ్యంగా భారత ప్రధాన భూభాగం దృష్టికి తెచ్చారంటే అది ఆ మహిళలే. మణిపూర్ రాజప్రసాదం కాంగ్లా గేటు బయట ఈ మహిళలు జరిపిన నగ్న ప్రదర్శనే తొలిసారి మణిపూర్ సమస్యపట్ల భారత ప్రధాన భూభాగం మీడియాను కదిలించింది. నగ్న ప్రదర్శన జరిపిన 12 మంది మహిళలలో ఒకరు, మణిపూర్ తల్లుల సంఘం నాయకురాలు న్గాంబీ మాటల్లో చెప్పాలంటే, 'మామీద సైన్యాలు నిరంతరం జరిపిన అత్యాచారాలే మమ్మల్ని ఈ పనికి పురికొల్పాయి'. మరోవైపు పార్లమెంట్ వేసిన జీవన్‌రెడ్డి కమిషన్ మాటల్లోనే 'హింసకు, అణచివేతకు, దౌర్జన్యానికి, అపరిమిత అధికార దుర్వినియోగానికి ప్రతీకగా మారిన ఎఎఫ్ఎస్‌పిఎ 1958' ని ఎత్తివేయాలని షర్మిల గత ఎనిమిదేళ్లుగా నిరాహార దీక్ష చేస్తూనే ఉంది. అరెస్టు చేసి సెలైన్ ద్వారా బలవంతంగా లోపలికి ఆహారం పంపుతున్న మణిపూర్ ప్రభుత్వం ఏడాదికి ఒకసారి ఆమెను విడుదల చేసి తిరిగి అరెస్టు చేయడం ఒక ఆనవాయితీగా మార్చుకుంది.

ఏళ్ల తరబడి ఇలా ఆస్పత్రిలో ఉండి పీలగా, పాలిపోయిన షర్మిలను చూసేందుకు తల్లి ఎప్పుడూ రాదట. 'నా కూతురు ఏ ఆశయం కోసం ఈ పని చేస్తూ ఉందో అది నెరవేరే దాకా నేను నా కూతుర్ని చూడను' అని ఆమె అంటే, ఆమె విడుదలను స్వీకరించేందుకు. ఒక తల్లుల సంఘమే ఏర్పడింది. ఆ తల్లుల సంఘంతో కలిసి ఈ మార్చ్ 7న ఆస్పత్రి బయట షర్మిల కోసం ఎదురు చూస్తున్నప్పుడు న్గాంబీ 'ఈ దుర్మార్గమైన చట్టం ఎత్తి వెయ్యడానికి, తమ జీవితాల్లో కొంచెం శాంతి రావడానికి మణిపూర్ మహిళలు ఎన్నిసార్లు బట్టలు విప్పెయ్యాలో' అన్నారు. వీ

**వీక్షణంకు ఉత్తరాలు రాసేవాళ్లు, మనీఆర్డర్లు పంపేవాళ్లు తమ వివరాలను పూర్తిగా రాయవలసిందిగా కోరుతున్నాం. అలాంటి వివరాలు లేనందువల్ల ఉత్తరాలకు జవాబు రాయడంగాని, మనీ ఆర్డర్ల మేరకు పుస్తకాలు, పత్రికలు పంపడం గాని వీలు కావడం లేదు.**

**- వై. రామచంద్రం (సర్క్యులేషన్ మేనేజర్) 9949 391028**

Email : yatelliram@gmail.com

అడ్డదారుల్లో పదోన్నతులు పొందే ఉపాధ్యాయులు, విద్యార్థులకు ఏ విలువలు నేర్పగలరని ప్రశ్నిస్తూ, విద్యార్థుల భవిష్యత్తును తీర్చిదిద్దడమే నిజమైన పదోన్నతి అంటున్నారు **సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి**

# నేటి నినాదం 'అసత్యమేవజయతే'

**టీ**చర్లు రోజూ బడులలో పిల్లలకి నీతి బోధన చేస్తుంటారు. అవినీతి, అక్రమాలు, అన్యాయంపై ఎన్నో విషయాలు పిల్లలకి చెబుతుంటారు. తమ పిల్లలను చైతన్యవంతులుగా తీర్చిదిద్దాలని తల్లిదండ్రులు కోరుకుంటారు. 'నియ్యతుండాలే' అనే మాట పిల్లల తల్లిదండ్రుల నుండి ఎన్నోసార్లు విన్న గురువులు ఆర్థికపరంగా లాభపడాలని ఉన్న ఉద్యోగస్థానం నుండి పెంపు కోసం (ప్రమోషన్ కోసం) సర్టిఫికెట్స్‌ని అడ్డదారుల్లో తెచ్చుకొని పనిచేస్తున్న వృత్తికి అవమానం తెస్తున్న సంఘటనలు ఎప్పటినుండో జరుగుతున్నాయి. ఈ మధ్యకాలంలో విపరీతంగా సర్టిఫికెట్స్ చలామణీ అవుతున్నాయి. విద్య అంగడి సరుకైంది. లోపభూయిష్ట విద్యావిధానంతో ప్రమాణాలు నానాటికీ దిగజారుతున్నాయి. డబ్బున్నవారు ఎన్నైనా సర్టిఫికెట్స్‌ని కొని తెచ్చుకొని ప్రమోషన్లకు, ఉద్యోగాలకు వాడుకుంటున్నారు. చాలా విశ్వవిద్యాలయాల్లో దూరవిద్యను ప్రవేశపెట్టి డిగ్రీ, పిజి ఉన్నత విద్యాకోర్సులు, వృత్తి విద్యా కోర్సులయిన బి.ఇడి., ఎం.ఇడి., ఎం.ఎ. ఎడ్యుకేషన్ సర్టిఫికెట్స్ అడ్డగోలుగా విడుదల చేస్తోంది. వాటిని అడ్డదారుల్లో కొనుగోలు చేసి ప్రమోషన్స్ పొందుతున్నారు.

చాలా విశ్వవిద్యాలయాల్లో కొన్ని కోర్సులకు యుజిసి గుర్తింపు లేదు. అయినా ఆ సర్టిఫికెట్స్‌ని ప్రమోషన్ల కోసం ఉపయోగిస్తుండ్రు. వినాయక్ మిషన్ రిసెర్చ్ పొజిషన్ – సేలం, జనార్దన్ రాయ్ రాజస్థాన్ విద్యాపథ్, డీమ్డ్, తమిళనాడు, ఇగ్నో విశ్వవిద్యాలయాల నుంచి గోవా, ఢిల్లీ లోని కొన్ని యూనివర్సిటీల నుంచి సర్టిఫికెట్స్‌ను పొందుతున్నారు. గుర్తింపు కలిగిన కోర్సులు కొన్ని ఉన్నప్పటికీ ఆ పరీక్షల నిర్వహణ చూసి రాయడమే. ఇంటర్‌లో మార్కు పోను మిగతావి చూసి వేల, వేల రూపాయలను అభ్యర్థులనుండి తీసికొని సర్టిఫికెట్స్ ఇస్తున్నారు. ఒకేసారి రెండు సంవత్సరాల కోర్సు పేరుతో చాలా విశ్వవిద్యాలయాలు కొన్ని కోర్సులలో ముందుకు వస్తున్నాయి.

కొన్ని జిల్లాలలో పైన పేర్కొన్న యూనివర్సిటీల నుండి సర్టిఫికెట్స్‌ను అంగీకరించక ప్రమోషన్‌లు ఇవ్వలేదు. మెజారిటీ జిల్లాలలో ఈ సర్టిఫికెట్స్‌తో ప్రమోషన్స్ పొందుతున్న టీచర్లే అధికం. నిజంగానే ప్రమోషన్స్ పొందాలనుకుంటే ఆయా టీచర్లు సంబంధిత డిగ్రీ సబ్జెక్టులను పిజి స్థాయిలో చదివితే, వాటి నుండే ప్రమోషన్స్ పొందితే పిల్లలకి న్యాయం జరుగుతుంది. కాని అట్లా కాక కేవలం డిగ్రీ ప్రమోషన్ కోసమే అయితే ఏ సబ్జెక్టులో అయితే ప్రమోషన్ పొందవచ్చో దానికి సంబంధించిన సర్టిఫికెట్స్‌ని అడ్డదారుల్లో సంపాదించి ప్రమోషన్ పొందాలనుకోవడం ఉపాధ్యాయ వృత్తికే కళంకం. టీచర్లు ప్రమోషన్స్ పొందడంలో నియమ నిబంధనలు పాటించాల్సిన అవసరం ఉంది. టీచర్ ఇష్టంగా చదివిన కోర్సు వల్ల ప్రమోషన్ పొందిన టీచర్ వల్ల విద్యార్థులకు లాభం జరుగుతుంది, కాని వేలకు వేల రూపాయలను సమర్పించి సర్టిఫికెట్స్‌ని కొని ప్రమోషన్ పొందితే ఏం ప్రయోజనం? పిల్లలకి ఏమేర న్యాయం జరుగుతుందో తెలియనిది కాదు. ప్రభుత్వ పాఠశాలలకు వచ్చే పిల్లలు చాలా సమస్యలతో ఎన్నో బాధలతో వస్తుంటారు. అలాంటప్పుడు అడ్డదారుల్లో తెచ్చుకున్న సర్టిఫికెట్స్ వల్ల పిల్లలకి సరియైన బోధన, జ్ఞానం అందుతుందా?

వృత్తి నిబద్ధత, సామాజిక బాధ్యత రెండూ టీచర్లకి ఉండాల్సిన లక్షణాలు. నేడు టీచర్‌కు తను చేస్తున్న వృత్తి, ప్రవృత్తిగా మారి మిగతా వ్యాపార లావాదేవీలు వృత్తిగా మారాయి. ప్రజల కోసం పని చేయాలన్న తపన సమాజాన్ని అంగుళం మేర అయినా మార్చాలన్న ఆలోచన ఏనాడో కొరవడింది. వృత్తిని ఆర్థిక పరమైన అంశంగానే భావిస్తుండ్రు. బోగస్ సర్టిఫికెట్స్‌తో ప్రమోషన్‌లు పొందిన వాళ్లు ఉన్నత పాఠశాలల్లో చేరి పిల్లలకి ఏం న్యాయం చేస్తారు? సంబంధిత సబ్జెక్టులను అనర్గళంగా అర్థమయ్యే రీతిలో పిల్లలకి బోధించగలరా? ప్రమోషన్స్ పొందాక పిల్లలకి కష్టపడి చెప్పాలనే ధ్యాస ఎందరికుంటుంది? ప్రతిరోజూ తన పిల్లవాడి చదువు గూర్చి ఆరా తీసే టీచర్లు తాము పని చేస్తున్న పాఠశాలల పిల్లల పట్ల ప్రేమ, ఆప్యాయతలను అందిస్తూ అర్థమయ్యే రీతిలో పాఠాలు బోధించగలరని అనుకోవచ్చా?

సరిగా బోధించని స్కూల్ అసిస్టెంట్లు, ఉపాధ్యాయుల పై ప్యానల్ గ్రేడ్ ప్రధానోపాధ్యాయులు ఎట్లా ప్రవర్తిస్తారు? ఎందరిని సరెండర్ చేయగలుగుతారు? ప్రణాళికా బద్ధంగా విద్యార్థులకు బోధన కొనసాగడంలో వీళ్లు నిజంగానే కృతకృత్యులవుతారా?

తాను చదివిన డిగ్రీకి తెచ్చుకున్న డిగ్రీ ద్వారా పిల్లలకి అన్యాయమే జరుగుతుంది. ఇంకొక విషయమేమిటంటే సక్సెస్ పాఠశాలల్లో ప్రమోషన్స్ తీసుకున్న టీచర్లు ఇంగ్లిష్ మాధ్యమంలో బోధన చేయాలని ఉంది. సరే వాళ్లకి సంవత్సరానికి పది రోజుల శిక్షణ ఇచ్చినప్పటికీ సెంట్రల్ సిలబస్ పిల్లలకి అర్థమయ్యే రీతిలో బోధన కొనసాగుతుందా అంటే అదీ అనుమానమే. స్పాట్ వాల్యుయేషన్‌లో ఇట్లా అడ్డదారుల్లో ప్రమోషన్స్ పొందినవాళ్లు పదవ తరగతి పిల్లల పేపర్లను ఎట్లా దిద్దుతారు? అంతా

*షికాగో మహత్తర కార్మిక పోరాటాల చరిత్ర కొనసాగింపుగా వర్తమానంలో జరిగిన కార్మిక పోరాట విజయగాథను వివరిస్తున్నారు* **పి.వి. రమణ**

# చరిత్ర సృష్టించిన షికాగో కార్మికులు

ప్రపంచవ్యాప్తంగా ఆర్థిక సంక్షోభాల ప్రభావంతో కోట్లాది మంది ఉద్యోగుల్ని రోడ్లమీదికి విసిరేస్తున్న సమయంలో, డిసెంబర్ 2008లో అమెరికా, షికాగోలలో 'రిపబ్లిక్ విండోస్ అండ్ డోర్స్' అనే కంపెనీలో పనిచేస్తున్న రెండు వందల నలభై మంది కార్మికులు చరిత్ర సృష్టించారు. ప్రపంచ కార్మికులకు ఎనిమిది గంటల పనిదినాన్ని సాధించిన షికాగోలో, మేడే అమర పౌరుల పోరాట సంప్రదాయాన్ని నిలబెట్టారు.

సరైన సమయం ఇవ్వకుండా యాజమాన్యం, ఫ్యాక్టరీని మూసివేస్తున్నామని ప్రకటించడంతో కార్మికులు ఫ్యాక్టరీని స్వాధీనం చేసుకున్నారు. వారంతా యూనైటెడ్ ఎలక్ట్రికల్, రేడియో అండ్ మెషీన్ వర్కర్స్ ఆఫ్ అమెరికా (యు.ఇ.) యూనియన్ సభ్యులు. అమెరికా కార్మిక సంఘాలలో ఎఎఫ్ఎల్ – సిఐఒ లాంటి బడా యూనియన్లు యాజమాన్యాల తొత్తులుగా మారి మొత్తం అమెరికా కార్మికోద్యమాన్ని పోరాటాల వైపు వెళ్లకుండా బలహీనం చేసిన తరుణంలో, చిన్న యూనియన్ అయిన 'యూనైటెడ్ ఎలక్ట్రికల్స్'కు కార్మిక సమస్యలపై అనేక పోరాటాలు చేసిన చరిత్ర ఉంది.

సమస్యల తీవ్రత వలన అకస్మాత్తుగా మొదలయ్యే పోరాటాల్లా కాకుండా, 'రిపబ్లిక్' కార్మికులు, తమ సమస్యలపై తీవ్రంగా చర్చించి ఎటువంటి పరిస్థితినైనా ఎదుర్కోవటానికి నిర్ణయం తీసుకొని మరీ పోరాటం ప్రారంభించారు. డిసెంబర్ 2న కంపెనీ ముఖ్య అధికారి బారీ దూచిన్ మూడు రోజుల తర్వాత నుంచీ ఫ్యాక్టరీ మూసివేస్తున్నామని ప్రకటించాడు. ఫ్యాక్టరీకి అంతవరకు పెట్టిబడికి అప్పుగా ఇస్తున్న 'బ్యాంక్ ఆఫ్ అమెరికా' పరిస్థితి తారుమారు కావడంతో, ఇక అప్పును కొనసాగించలేమని చెప్పడమే దీనికి కారణం. దీనివలన కార్మికుల్ని తొలగిస్తున్నామని, వారికి ఇవ్వాల్సిన బకాయిలు, తొలగించినందుకు అదనంగా ఇవ్వాల్సిన పరిహారం, ఆరోగ్య ఇన్సూరెన్స్‌లను ఇవ్వలేమని చేప్పేసారు.

నెలరోజుల క్రితం నుండే ఫ్యాక్టరీ యంత్రాలు ఒక్కొక్కటి దూరంగా ఉన్న రైల్వే యార్డుకి తరలించడం జరుగుతూ వచ్చింది. దీన్ని కార్మికులు కంపెనీ మూసివేతలో భాగమనుకున్నారు. కాని యజమాన్యం ఫ్యాక్టరీని వేరే రాష్ట్రానికి తరలిస్తున్న సంగతి గ్రహించేశారు.

యూనైటెడ్ ఎలక్ట్రికల్ యూనియన్ ఆర్గనైజర్ మార్క్ మీయిన్‌స్టర్ రిపబ్లిక్ ఫ్యాక్టరీ యూనియన్ ప్రెసిడెంట్, మెయింటెనెన్స్ కార్మికుడు.

---

వడ్లలో పెరుగు కలిపిన వైనంలా ఉన్నాయి ఈ మెగా ప్రమోషన్స్. లోపభూయిష్ఠ విద్యా విధానం వల్ల విద్యార్థుల జీవితాలు బాగుపడతాయా అన్నది సందేహమే. వేలకు వేలు డబ్బులు పెట్టి ప్రమోషన్స్ పొందినవాళ్లు తమ కళ్లముందే ఉన్నత స్థానాల్లోకి వెళుతుంటే నిజంగా పని చేసే టీచర్ల పరిస్థితిని ఎట్లా అర్థం చేసుకుందాం?

ప్రమోషన్స్‌కు ఓ ప్రాతిపదికను ఏర్పాటు చేయాలన్న వాదన ముందుకొస్తోంది. సీనియారిటీ ప్రకారమే పరీక్ష నిర్వహించి ప్రమోషన్ ఇస్తే బాగుంటుందనే అభిప్రాయం కూడా ముందుకు వస్తోంది.

డి.ఎస్.సి.లో రాయడానికి పనికివచ్చిన సింగిల్ సబ్జెక్ట్ (డా.బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం నుండి) ప్రమోషన్స్‌కు పనికి రాకుండా పోతోంది. అంతకుముందు సింగిల్ సబ్జెక్ట్‌కు ప్రమోషన్స్ ఇచ్చి కొద్దికాలంలోనే దానిని నిలిపివేయడం వల్ల ఉపాధ్యాయులు విద్యాశాఖ పనితీరుపట్ల అసంతృప్తితో ఉన్నారన్నది నిజం.

విద్య ప్రైవేటీకరణలో భాగమే ఈ సక్సెస్ పాఠశాలలు. అదీ గిరిజన ప్రాంతాల్లో కూడా ఆంగ్ల మాధ్యమంలోనే నడపడం. ఈ ప్రమోషన్స్ ద్వారా తెలియవచ్చేది ప్రాథమిక, ఉన్నత విద్యారంగాలు మొత్తంగా కొన్ని రోజులకు ప్రభుత్వం నుండి వేరు కానున్నవి. విద్యా రంగం మునిగిపోతున్న పడవగా భావించాల్సి వచ్చింది. ఈ మధ్యనే ప్రమోషన్లలో టీచర్లు రెండు గ్రూపులుగా విడిపోయి కొట్టుకోవడం, కుర్చీలను తగులబెట్టడం చేసారు. సమాజానికి దిశానిర్దేశం చేయాల్సిన అధ్యాపకులు వ్యక్తిత్వాన్ని కోల్పోతుంటే విద్యార్థుల భవిష్యత్తు ఏం కాను? నిజంగానే ప్రమోషన్స్‌తో విద్యార్థులకు మరింత బాగా చదువు అందుతుందా?

ఇన్ని బోగస్ సర్టిఫికెట్స్ వెలుగులోకి వచ్చినా ప్రభుత్వం తన బాధ్యతను మరిచింది. దొంగ సర్టిఫికెట్స్‌తో ప్రమోషన్స్ పొందినవాళ్లపై చర్యలు తీసుకోలేక పోతోంది. విద్యాశాఖలో అవినీతి వల్లనే ఇదంతా జరుగుతోంది. దేశంలోని యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ గుర్తింపు లేని విశ్వవిద్యాలయాల జాబితాను ప్రభుత్వం ముందే విడుదల చేసి ఉంటే దొంగ పంతుల్ల ఆటకట్టబడేది కదా. విచ్చలవిడిగా సర్టిఫికెట్స్‌ను విడుదల చేస్తున్న సంస్థలపై ప్రభుత్వ కట్టడిలేదు. విద్యారంగాన్ని సంస్కరించాల్సిన బాధ్యత ప్రభుత్వం పై లేదా? విద్యను అంగడి సరుకు చేసిన ప్రభుత్వం విద్యార్థుల భవిష్యత్తును బాగుచేస్తుందనుకోవడం అనుమానమే. విద్యార్థుల భవిష్యత్తును తీర్చిదిద్దగలిగితే టీచర్లకు అదే నిజమైన ప్రమోషన్. వీ

ఆర్మాండ్ రోబ్లెస్‌తో కలిసి మూసివేతకు ఏదైనా నిరసన పోరాటం చేయగలమా?అని చర్చించాడు. నిజానికి అరెస్టు చేసే ప్రమాదం ఉందని తెలిసినా చివరకు ఫ్యాక్టరీని స్వాధీనం చేసుకోవడానికి నిర్ణయించారు. డిసెంబర్ 5న రోబ్లెస్ రిపబ్లిక్ ఫ్యాక్టరీ కార్మికుల జనరల్ బాడీ సమావేశాన్ని క్యాంటీన్లో ఏర్పాటు చేసి, అవసరమైతే ఫ్యాక్టరీని స్వాధీనం చేసుకోవాలనే ప్రతిపాదనకు కార్మికులందరూ ఏకగ్రీవంగా అంగీకారం తెలిపారు.

ఫ్యాక్టరీని స్వాధీనం చేసుకొన్న కార్మికులు, మూడు షిఫ్టులు వేసుకొని, ఇరవై నాలుగ్గంటలూ అత్యంత జాగరూకతతో కాపలా కాస్తూ, తమ న్యాయమైన డిమాండ్లు పరిష్కరించబడే వరకు ఎలాంటి పరిస్థితినైనా ఎదుర్కొంటామని ప్రకటించారు. ఫ్యాక్టరీని రోజూ శుభ్రం చేయటానికి, యంత్రాల రక్షణ కోసం, ఫ్యాక్టరీ రక్షణ కోసం మూడు కమిటీలు ఏర్పాటు చేసుకొని బాధ్యతలు పంచుకొన్నారు. కంపెనీ నోటీస్‌బోర్డులో మద్యం సేవించడం, డ్రగ్స్ వాడడం, సిగరెట్ తాగడం లాంటివి నిషేధిస్తూ ప్రకటన ఏర్పాటు చేసారు.

రిపబ్లిక్ కార్మికుల మిలిటెంట్ పోరాటానికి అమెరికాలో బ్రహ్మాండమైన ప్రతిస్పందన లభించింది. అనేక కార్మిక యూనియన్లు, మత సంబంధ సంస్థలు, కమ్యూనిటీ గ్రూప్‌లు, పోరాటం చేస్తున్న కార్మికులకు ధనాన్ని, బట్టల్ని, ఆహారాన్ని, దుప్పట్లను పంపిస్తూ వారి పోరాటంలో విజయం సాధించాలని ఆకాంక్షించారు. ఫ్యాక్టరీ కార్మికుల స్వాధీనంలో ఉన్నంత కాలం, సహకార్మికులు, అమెరికాలో ఉన్న బ్యాంక్ ఆఫ్ అమెరికా బ్రాంచీలన్నింటి వద్దా చార్లెట్, నార్త్ కరోలినాలో గల బ్యాంక్ హెడ్‌క్వార్టర్స్ వద్ద నిరసన ప్రదర్శనలు జరిపారు. అనేక యూనియన్లు, కమ్యూనిటీ గ్రూప్స్ కలిసి, షికాగో సిటీ హాల్ వద్ద పెద్ద ప్రదర్శన జరిపి, సమస్యల్ని వెంటనే పరిష్కరించకపోతే బ్యాంక్ ఆఫ్ అమెరికాను 'బాయ్‌కాట్' చేస్తామని హెచ్చరించారు.

చట్ట విరుద్ధంగా కార్మికులు పోరాటం చేస్తున్నారని తెలిసి కూడా రాజకీయ నాయకులు, పోలీసులు చర్యలు తీసుకోవడంలో వెనకాడటానికి అప్పటికీ అనేక చోట్ల నిరసన జ్వాలలు రగులుతూండడం ప్రధాన కారణం. కార్మికుల ఆగ్రహం ఎక్కడికి దారితీస్తుందోననే భయం. అంతే కాక ఫ్యాక్టరీ స్వాధీనం చేసుకొన్న రోజున బుష్ ప్రభుత్వం ఐదు లక్షల ముప్పై మూడు వేల మంది ఉద్యోగాల కోత గురించి 'లేబర్ డిపార్ట్‌మెంట్ రిపోర్ట్' ప్రకటించడంపై కార్మికులు తీవ్రంగా ఆగ్రహం వ్యక్తం చేశారు.

కార్మికుల పోరాట తీవ్రతను గమనించిన బారక్ ఒబామా సలహాదారుడు, ఇలియనోస్ సెనేటర్ డిక్‌డర్బన్ ఫ్యాక్టరీని సందర్శించారు. మూసివేతకు గురయ్యే ప్రమాదానికి దగ్గరయ్యే పరిస్థితిలో బ్యాంక్ ఆఫ్ అమెరికాను అమెరికా ప్రభుత్వం నుండి ఇరవై అయిదు బిలియన్ డాలర్ల రాయితీగా పొందడాన్ని గుర్తు చేస్తూ ప్రజాసొమ్మును రాయితీగా తీసుకొంటున్న బ్యాంక్‌లు వాటిని కేవలం తమ అధికార్ల జీతాలు, సౌకర్యాల కోసమే ఖర్చు పెట్టడం కాకుండా, రిపబ్లిక్ కంపెనీ లాంటి వాటిని వ్యాపారంలో నిలబెట్టాలనీ, తద్వారా కార్మికుల జీవితాల్ని రక్షించడానికి ఉపయోగపడాలనీ ప్రకటిస్తూ కార్మికులకు తన మద్దతు తెలిపాడు.

డిసెంబర్ 7న జరిగిన పత్రికా సమావేశంలో, ఒక విలేఖరి బారక్ ఒబామాను రిపబ్లిక్ కార్మికుల పోరాటం గురించి అభిప్రాయం అడగ్గా 'కార్మికులు వాళ్లకు న్యాయంగా రావాల్సిన సొమ్ము గురించి అడుగుతున్నారు. నేటి ఆర్థిక వ్యవస్థ సంక్షోభ బాధితులు వారు. వారి న్యాయమైన డిమాండ్లను పరిష్కరించాల్సిన అవసరం ఎంతైనా ఉంది' అని ప్రకటించవలసి వచ్చింది. రిపబ్లిక్ కార్మికుల పోరాట తీవ్రతే వారు ఇలా మాట్లాడటానికి కారణం అని మనకు అర్థమవుతుంది.

కార్మికుల పోరాట పటిమకు, రాజకీయ నాయకుల ప్రమేయానికి తలవొగ్గి, బ్యాంక్ ఆఫ్ అమెరికా' రిపబ్లిక్ కంపెనీకి 1.35 బిలియన్ డాలర్లు, కార్మికుల బకాయీలు, పరిహారానికోసమై సమకూర్చక తప్పలేదు. దీనిపై యూనైటెడ్ ఎలక్ట్రిక్ యూనియన్ వైస్ ప్రెసిడెంట్ మెల్విన్ మాక్లిన్ మాట్లాడుతూ పోరాటం మొదలు పెట్టిన తర్వాత మేమంతా జైలు కెళ్లడం ఖాయం అనుకున్నాం కాని ఇంత ఘనవిజయం సాధిస్తామని 'ఊహించలేదు' అన్నాడు. చివరకు తీసివేతకు పరిహారంగా అరవై రోజుల జీతం, ఆర్జిత సేవలకు జీతం, 2 నెలల ఆరోగ్య ఇన్సూరెన్స్ లాంటి తమన్యాయమైన హక్కులన్నీ రిపబ్లిక్ కార్మికులు సాధించుకొన్నారు.

'రిపబ్లిక్ విండోస్ అండ్ డోర్స్' కంపెనీ కార్మికుల వీరోచిత పోరాట ప్రభావం వెంటనే కనబడింది. గత పదిహేను సంవత్సరాలుగా యూనియన్ ఏర్పాటుకు తీవ్రంగా సతమతమవుతున్న, నార్త్ కరోలినాలో గల ప్రపంచంలో అతి పెద్దదైన జంతువులను వధించే ప్లాంట్ కార్మికులు డిసెంబర్ 11న యూనియన్ ఏర్పాటుకు ఏకగ్రీవంగా ఓటు వేశారు. ఇంకా అనేక చోట్ల అటువంటి సంఘటనలు జరుగుతున్నాయి.

బుష్ హయాంలో ఎనిమిది సంవత్సరాలకు ఒక్కసారి మాత్రమే వైట్‌హౌస్‌ను సందర్శించిన బడా కార్మిక యూనియన్ ఎఎఫ్ఎల్ – సిఐఒ అధ్యక్షుడు జాన్‌స్వీనీ కార్మికుల పోరాట చైతన్యాన్ని చూసి బేజారయి, నేడు ప్రెసిడెంట్ బరాక్ ఒబామాను వారం రోజుల కొకసారి కలుస్తున్నాడు. అందువల్లే కావచ్చు, ఎఎఫ్ఎల్ – సిఐఒ ఎగ్జిక్యూటివ్ బోర్డ్ సమావేశానికి వీడియో ద్వారానే ఒబామా 'ఈనాడు కార్మికులకు, యూనియన్లకు సరైన, సమాన ప్రాతినిధ్యం ఇవ్వాల్సిన అవసరం ఉంది. మీ కోసం నేను ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంటాను' అని సందేశాన్ని పంపాడు. ఇవన్నీ గమనిస్తే రిపబ్లిక్ ఫ్యాక్టరీ కార్మికుల పోరాటాల్లాంటివి భవిష్యత్‌లో పెరిగే అవకాశాలున్నాయని గ్రహించి, అలాంటివి విస్తరించకుండా కార్మికుల్ని బుజ్జగిస్తూ, పోరాటాల్ని బలహీనం చేసే క్రమం కనబడుతోంది.

షికాగో రిపబ్లిక్ కార్మికుల పోరాటం, మన దేశంలో నూతన ఆర్థిక విధానాలు ప్రారంభమైన 1991లో ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా ఉత్తరప్రదేశ్‌లో దల్లు సిమెంట్ కంపెనీ కార్మికుల వీరోచిత పోరాటాన్ని గుర్తు తెస్తోంది. అప్పుడు వారు కూడా ఫ్యాక్టరీని షిఫ్టులు వేసుకొని, పహారా కాస్తూ, వందలాది మందిని అరెస్టు చేసినా చివరకు పోలీసుల కాల్పుల్లో నలభై మంది మరణించినా, అన్ని యూనియన్లు ఏకతా సమితిగా ఏర్పడి 'ప్రాణాలైనార్పిస్తాం, ప్రైవేటీకరణ జరగనివ్వం' అంటూ నిలబడి ప్రభుత్వాన్ని లొంగదీసిన పోరాటం గుర్తుకు వస్తుంది. అప్పుడు దల్లా సిమెంట్ కార్మికులైనా, నేటి అమెరికా షికాగో రిపబ్లిక్ కార్మికులైనా, ఆత్మగౌరవంతో, ఐక్యంగా పోరాడితే సాధించలేనిదేమీ లేదని రుజువు చేసారు. ఆ మార్గంలోనే కార్మికవర్గం పయనించి సామ్రాజ్య వాద దోపిడీని అంతం చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. వీ

*ప్రజల అండదండలు ఉన్నంత వరకూ ఉద్యమాలు సజీవంగా ఉంటాయంటూ తమిళనాడు రాజకీయాలను శాసిస్తున్న తమిళ ప్రజల చైతన్యాన్ని వివరిస్తున్నారు* **డా. జి. లచ్చయ్య**

# తమిళనాడులో ఏం జరుగుతోంది?

'నా శవాన్ని ఆసరాగా (అడ్డుగా) చేసుకొని ఉద్యమాన్ని మరింత బలోపేతం చేయండి' అని తన నాలుగు పేజీల ఆత్మాహుతి నోటులో కొలత్తుర్ ముత్తుకుమార్ అనే జూనియర్ తమిళ జర్నలిస్టు జనవరి 29న రాసి చెన్నైలోని కేంద్ర ప్రభుత్వ కార్యాలయ సముదాయమైన శాస్త్రీ భవన్ వద్ద ఆత్మాహుతికి పాల్పడ్డాడు. జర్నలిస్టులు, యువకులు, విద్యార్థులు రోడ్లపైకి వచ్చారు. శ్రీలంకలో తమిళుల పై జరుగుతున్న మారణకాండకు వ్యతిరేకంగా తమిళనాడు ఆందోళనలో చోటు చేసుకున్న ఆత్మాహుతి పరంపరలో ముత్తుకుమార్ ఒకరు. దీంతో న్యాయవాదులు సమ్మెలో దిగారు. కళాశాలలను ప్రభుత్వం నిరవధికంగా మూసివేసింది. ముత్తుకుమార్ తర్వాత మరో అయిదారుగురు ఆత్మాహుతికి పాల్పడ్డారు. శ్రీలంక తమిళుల ఊచకోతకు నిరసనగా ఫిబ్రవరి 21న తమిళనాడులో మానవహారం ప్రదర్శన – శివప్రకాశం అనే అరవై సంవత్సరాల డి.ఎం.కె. కార్యకర్త అన్నాసాలైలోని గుండిలో ఆత్మాహుతికి పాల్పడి గాయాల పాలయ్యాడు.

ఆత్మాహుతికి పాల్పడుతున్న వారిలో రాజకీయ కార్యకర్తలే కాదు, ముగ్గురు విద్యార్థులు, పౌరులు కూడా ఉండడం గమనార్హం. లాయర్లపైన పోలీసుల దాడులకు ముందు రోజున విసికె (విడుత్తలై చిరుత్తైగళ్ కట్చి) కార్యకర్త తమీజ్ వెండన్ (30) కడతూర్‌లో ఆత్మాహుతికి పాల్పడడానికి ముందు నాలుగు రోజులు ఉదయం నుంచి సాయంత్రం దాకా నిరాహార దీక్ష చేసి మరీ ఆత్మాహుతి చేసుకోవడం ఫిబ్రవరి మూడవవారంలో తమిళ రాజకీయ పార్టీలను కుదిపి వేసింది. ఆత్మాహుతి చేసుకోవడం యుద్ధరంగంలో మరణించినంతగా తమిళులు భావిస్తారు. ఈ ఆత్మాహుతుల్ని అన్ని రాజకీయ పార్టీలు సొమ్ము చేసుకుంటాయే గాని వాటిని నివారించి, వారించే ప్రయత్నం ఇంతవరకు ఏ రాజకీయ పార్టీ చేయలేకపోయింది.

ఈ సందర్భంగానే ఫిబ్రవరి 17న, జనతా పార్టీ అధ్యక్షులైన సుబ్రహ్మణ్యస్వామి చిదంబరం గుడికి సంబంధించిన ఒక కేసులో మద్రాసు హైకోర్టుకు వచ్చారు. ఒకవైపు శ్రీలంక అధ్యక్షుడు మహింద్రా రాజపక్ష ఎల్‌టిటిఇ ని తుడ్చిపెట్టే దాకా సైనిక పోరు ఆగదని ప్రకటించడం, మరోవైపు కేంద్రంలోని యుపిఎ ప్రభుత్వం శ్రీలంక ప్రభుత్వం పట్ల సరిగా స్పందించకపోవడం, ఈ చర్యలన్నింటినీ సుబ్రహ్మణ్యస్వామి సమర్థించడంతో ఆగ్రహించిన లాయర్లు కోర్టు హాలులో ఇద్దరు జడ్జీల సమక్షంలోనే ఆయనపై కుళ్లిన కోడిగుడ్లతో దాడిచేశారు. సుబ్రహ్మణ్యస్వామి వెంటనే కోర్టు ఆవరణ బయటగల ఎస్‌ప్లాండే పోలీసు స్టేషన్లో ఫిర్యాదు చేసారు. ఈ సందర్భంగా న్యాయవాదులపై కేసు నమోదు చేసి, కొంతమంది న్యాయవాదులను అరెస్టు చేశారు. దీనికి నిరసనగా ఫిబ్రవరి 18న హైకోర్టు న్యాయవాదులు కోర్టులను బహిష్కరించి, కుల దూషణ చేసాడని సుబ్రహ్మణ్యస్వామిపై ఎస్.సి, ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టం కింద కేసు నమోదు చేసి అరెస్టు చేయాలని డిమాండ్ చేసారు. అందుకు పోలీసులు నిరాకరించారని, పైగా ఫిర్యాదు చేయడానికి వచ్చిన లాయర్లను అరెస్టు చేసే ప్రయత్నం చేసారని ఆరోపిస్తూ, పోలీసులపై రాళ్లు రువ్వగా, ప్రతిగా పోలీసులు లాఠీచార్జ్ చేసారని కథనాలు. ఈ సందర్భంగా జరిగిన ఘర్షణలో కొంతమంది పోలీసులతో పాటు, అధిక సంఖ్యలో న్యాయవాదులు గాయపడగా, అరుముగం పెరుమాల్ ఆదిత్యన్ అనే జడ్జికి తలపగిలింది. మరోవైపు కోర్టు ఆవరణలో డ్యూటీ చేసే మహిళా పోలీసులపై న్యాయవాదులు పరుష పదజాలంతో దూషిస్తూ దాడిచేసారని, కోర్టులో తాము డ్యూటి చేయలేమని మహిళా పోలీసులు వాపోయారు.

న్యూఢిల్లీలో శ్రీలంక తమిళులపై జరుగుతున్న దాడులను వ్యతిరేకిస్తూ ఫిబ్రవరి 19న మానవ హక్కుల కమిటీ సమావేశం ఏర్పాటు చేసింది. గత కొంతకాలంగా శ్రీలంక తమిళులపై సైనిక దాడులు కొనసాగుతున్నాయని, హాస్పిటల్స్‌పైన బాంబులు వేస్తూ ప్రజలకు వైద్య సౌకర్యాలు అందకుండా చేస్తున్నారని, జర్నలిస్టులని చూడకుండా హత్య చేస్తున్నారని, సాధారణ పౌరులను కాల్చి వేస్తున్నారని, ఈ విధంగా రెండు లక్షల యాభై వేల మంది పౌరులు నిర్బంధంలో ఇరుక్కుపోయారని స్వయంగా శ్రీలంక రాజకీయ నాయకుడైన సిరుతుంగ జయసూర్య ఈ సమావేశంలో తెలిపారు. ఈ సైనిక దాడుల్లో వేలాదిమంది చనిపోవడమే కాకుండా దాదాపు పదకొండు వేలమంది అంగవైకల్యం పొందారని ఆగ్రహించిన తమిళ తంబిలు రాష్ట్రవ్యాప్తంగా చేపట్టిన ఆందోళనలు ఫిబ్రవరి 19నాటి హైకోర్టు సంఘటనతో శ్రీలంక సమస్య నుంచి దృష్టి పోలీసులవైపు మారింది.

ఈ సంవత్సరం ఆరంభం నుంచి శ్రీలంక తమిళుల రక్షణకై ఇటు రాష్ట్రంలో పెద్ద ఎత్తున ఆందోళనలు జరుగుతుండగా, అటు కేంద్రంలో అన్ని తమిళ రాజకీయ పార్టీలు యుపిఎ ప్రభుత్వంపైన, సోనియాగాంధీ పైన, విదేశీ వ్యవహారాల శాఖ మంత్రి ప్రణబ్ ముఖర్జీ పైన శ్రీలంక ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకరావాలని, సైనిక దాడులను ఆపు చేయించాలని, అవసరమైతే అంతర్జాతీయ సహకారాన్ని తీసుకోవాలని ఒత్తిడి తెస్తూ ఉన్నారు.

ఈ సందర్భంగా ఈ సంవత్సరారంభం నుంచి హైకోర్టు, మధురై బెంచ్, ఇతర జిల్లా కోర్టులు కేవలం తొమ్మిది రోజులే పని చేసాయని ఆరోపిస్తూ బెంగుళూర్ నేషనల్ లా స్కూల్‌కు చెందిన మాజీ అధ్యాపకుడు హరీష్ సాల్వే మద్రాసు హైకోర్టులో ఒక పిటిషన్ కూడా దాఖలు చేసాడు.

ఒకవైపు శ్రీలంక తమిళులపై సైనిక దాడులు, మరోవైపు యుపిఎ తటస్థ వైఖరి, ఇంకోవైపు సుబ్రహ్మణ్యస్వామి ఎల్‌టిటిఇ కి వ్యతిరేక ప్రకటనలతో తమిళనాట రాజకీయాలన్నీ వేడెక్కిపోయాయి. అంతర్జాతీయ సూత్రాలకు వ్యతిరేకంగా తమిళులుండే ప్రాంతాల్లో అసుపత్రులపై బాంబులు వేయడం, రెడ్‌క్రాస్ సంస్థను దేశం వదిలి పోవాలని రాజపక్ష ఆదేశాలివ్వడంతో తమిళులకు మరింత ఆవేశాన్ని కలిగించింది.

మరోవైపు ఎల్‌టిటిఇ ఆయుధాల్ని వదలాలని ప్రణబ్ ముఖర్జీ పార్లమెంట్‌లో ప్రకటించడాన్ని సుబ్రహ్మణ్య స్వామి, జయలలిత స్వాగతించడంతో తమిళనాడులో రాజకీయ నాయకులు రెండు శిబిరాలుగా విడిపోయారు. పాలకపక్షం, యుపిఎ భాగస్వామి పార్టీ అయిన డిఎంకె పార్టీ అధినేత కరుణానిధి అడకత్తెరలో పోకలాగా మారి హాస్పిటల్ పాలయ్యాడు. అటు కేంద్ర ప్రభుత్వాన్ని ఒప్పించలేక, వ్యతిరేకించలేక తమిళులను మచ్చిక చేసుకోవడానికి శ్రీలంక తమిళుల సంక్షేమం, హక్కుల సంస్థను స్థాపించి శ్రీలంక తమిళులకు తన సానుభూతిని ప్రకటించుకున్నారు. ఇది ఇలా ఉండగా మిగతా రాజకీయ పార్టీలన్నీ కలిసి (పిఎంకె, ఎండిఎంకె, విసికె, బిజెపి, పిడికె) వైకో నాయకత్వం కింద శ్రీలంక తమిళుల రక్షణసంస్థ నొకదాన్ని స్థాపించాయి. ఇందులో కాంగ్రెస్‌తో పొత్తు కలిగిన ఎం.రాందాస్ నాయకత్వంలోని పిఎంకె పార్టీ కూడా ఉండడం గమనార్హం. ఈ సంస్థ రెండు కోట్ల సంతకాలను సేకరించే కార్యక్రమాన్ని చేపట్టింది. ఈ సంతకాలను కేంద్ర ప్రభుత్వానికి, యునైటెడ్ నేషన్స్ జనరల్ కౌన్సిల్‌కు పంపించి శ్రీలంకలో తమిళులపై జరుగుతున్న సైనిక దాడులను నిలుపుదల చేయించాలని ఉద్యమం చేపట్టింది. ఈ సంతకాల సేకరణ ఫిబ్రవరి 23న మొదలుపెట్టి వారం రోజులు కొనసాగించాలని, ఈ సందర్భంగా అన్ని జిల్లా కేంద్రాల కలెక్టర్ కార్యాలయాల ముందు ప్రదర్శనలు చేపట్టాలని, ఫిబ్రవరి 22న తిరుచ్చిలో, మార్చ్ 3న ట్యుటికోరన్‌లో తర్వాత తేదీలలో పుదిచ్చేరి, వెల్లూర్, సేలంలలో భారీ ర్యాలీలు, ప్రదర్శనలు చేపట్టి ఉద్యమాన్ని బలోపేతం చేయాలని తీర్మానించింది.

ఈ రాజకీయ పార్టీల ఐక్య ఉద్యమాన్ని ఎలా ఎదుర్కోవాలో తెలియని ఎల్‌టిటిఇ వ్యతిరేక రాజకీయ పార్టీలు వైకో ఎల్‌టిటిఇ చీఫ్ ప్రభాకరన్‌తో కలిసి ఉన్న ఫొటోలను సంపాదించి పత్రికలకు విడుదల చేసాయి. ప్రభాకరన్‌ను సినిమా హీరోతో పోల్చిన సినిమా డైరెక్టర్ సిమెన్‌ను, ఎల్.టి.టి.ఇ. ని బహిరంగంగా సమర్థిస్తున్న విసికె అధ్యక్షుడైన తోల్ తిరుమావళ్లన్‌ను అరెస్టు చేయాలని తమిళనాడు అసెంబ్లీలో ప్రస్తావనకు రాగా, ఎఐడిఎంకె ప్రతినిధి కెఎ సెంగోట్యియన్ మద్దతు తెలిపారు. మరోవైపు తాము ఎల్‌టిటిఇ కి మాత్రం వ్యతిరేకులమని, శ్రీలంక తమిళులకుకాదని వారి రక్షణకై కేంద్రం చొరవ చూపాలని ఎఐడిఎంకె అధినేత్రి జయలలిత ఒక్క రోజు నిరసన ప్రదర్శన చేపట్టి కొంత డబ్బును కూడ సమకూర్చడం వెనక రాబోయే ఎన్నికలు, వాటి ద్వారా పొందాల్సిన లబ్ధి కనబడకనే కనబడుతుంది.

ఈ విధంగా తమిళనాడులో శ్రీలంక తమిళుల సమస్య ఒక రాజకీయ చిచ్చును లేపిందనే చెప్పవచ్చు. మనసులో ఎల్‌టిటిఇ ని వ్యతిరేకిస్తున్న పార్టీలన్నీ బహిరంగంగా ప్రకటించలేని స్థితిలో ఉన్నాయి. శ్రీలంక తమిళుల సమస్యను ప్రస్తావించకుండా రాబోయే ఎన్నికల్లో ఓట్లు దండుకోవడం కష్టసాధ్యమని గ్రహించే డిఎంకె, ఎఐడిఎంకె పార్టీలు ఇలాంటి అవకాశవాద రాజకీయాల్లో పాల్గొంటున్నా యనేది అందరికీ తెలిసిందే. పైగా ఈ మధ్యన జరుగుతున్న ఉద్యమాలు విద్యార్థుల చేతుల్లోకి వెళ్లడం, గత అక్టోబర్‌లో అన్ని తమిళ రాజకీయ పార్టీల ఎంపి లు తమ తమ లోకసభ, రాజ్యసభ సీట్లకు రాజీనామా చేస్తామని ప్రకటించినా ఇంతవరకు ఒక్క ఎంపి కూడా రాజీనామా చేయలేదని స్టూడెంట్స్ మూవ్‌మెంట్ ఫర్ తమిళ ఈలం కన్వీనర్ వి. ఇజిలన్ ఆరోపించారు. ఇప్పటికైనా రాజీనామా చేయకపోతే ఆత్మాహుతికి పాల్పడ్డ ముత్తుకుమారన్ రాసిన లేఖను చెన్నైలోని డెబ్బై ఏడు కళాశాలల్లో పంపిణీ చేసి తమిళ రాజకీయ పార్టీల ద్వంద్వ నీతిని బహిర్గతం చేస్తామని హెచ్చరించారు. ఎన్నికల లబ్ధికోసమే రాజీనామాల అస్త్రాలను ప్రస్తావించాయని, రాజకీయ పార్టీలు నాటకాలాడుతున్నాయని ఆయన అన్ని రాజకీయ పార్టీలపై మండిపడ్డారు.

పాలకపక్షమైన డిఎంకె ఫిబ్రవరి 21న రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లా, తాలుకా కేంద్రాల్లో శ్రీలంక తమిళుల రక్షణకై (నర్మగర్భంగా ఎల్‌టిటిఇపై దాడులను ఆపాలని) మానవహారాలను ఏర్పాటు చేసి తన సంఘీభావాన్ని తెలిపింది. ఇందులో స్వయాన స్థానిక పరిపాలన మంత్రి ఎం.కె. స్టాలిన్ లాంటి నాయకులు పాల్గొనడం గమనార్హం. కరుణానిధి కుమార్తె, రాజ్యసభ సభ్యురాలు కనిమోజి ఈ సందర్భంగా మాట్లాడుతూ, శ్రీలంక తమిళుల సమస్యకు ఒక రాజకీయ పరిష్కారాన్ని కనుగొనే దిశగా భారత ప్రభుత్వం ఐక్యరాజ్య సమితిపై ఒత్తిడి తీసుకురావాలని డిమాండ్ చేసారు. మానవహారంగా ఏర్పడి శ్రీలంక తమిళుల రక్షణకై కేంద్ర ప్రభుత్వం వెంటనే చర్యలు తీసుకోవాలని నినదించడం తమిళులకున్న రాజకీయ చైతన్యానికి నిదర్శనం.

రాజకీయ నేపథ్యంతో కూడుకున్న సమస్యగా భావించిన మరి కొంతమంది పౌరులు, విద్యార్థులు, అధికారులు, విశ్వవిద్యాలయ కులపతులు, ప్రొఫెసర్లు, అధ్యాపకులు అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవాన్ని పురస్కరించుకొని భారీ సంఖ్యలో ర్యాలీలను నిర్వహించడం జరిగింది. ఒక్క నమక్కల్‌లోనే దాదాపు ఇరవై వేల మంది పాఠశాల, కళాశాల విద్యార్థులు పాల్గొని తమ మాతృభాషాభిమానాన్ని చాటుకోవడం, తమిళ మాతృభాష తమకు గర్వకారణమని, ఆ భాషను రక్షించుకోవాల్సిన బాధ్యత ప్రతి తమిళ పౌరునిపై ఉందని నినదించడం ద్వారా తమిళులంతా ఒకటేననే భావన కలిగించాయి. అందుకే వారు సునాయసంగా తమిళ భాషకు ప్రాచీన హోదాను సాధించుకోగలిగారు.

శ్రీలంక తమిళుల రక్షణకై చేపట్టిన మానవహారాలైనా, మాతృభాష రక్షణకై చేపట్టిన ర్యాలీలైనా మద్రాసు హైకోర్టు లాయర్లపై జరిగిన దాడికి నిరసనగా కూడా కనపడుతుంది. ఎందుకంటే, ఫిబ్రవరి 19 నాటి సంఘటన తర్వాత తమిళనాడు అంతటా కనిపిస్తే కాల్చివేత ఉత్తర్వులు అమలులో ఉన్నా, ఒక్క ప్రాంతంలో కూడా పోలీసుల హడావిడి కనపడకపోవడం, పౌరజీవనం స్తంభించకపోవడం అక్కడి పోలీసులకున్న నిబద్ధతను కూడా తెలియజేస్తున్నది.

నిజానికి దక్షిణ భారతదేశ రాష్ట్రాలైన ఆంధ్రప్రదేశ్, కర్నాటక, కేరళ, పుదిచ్చేరి, తమిళనాడులలో ఒక్క ఆంధ్రప్రదేశ్‌లో తప్ప మిగతా రాష్ట్రాలలో రాష్ట్రాభిమానం, భాషాభిమానం మెండని, స్థానిక హక్కులకై వారు ఏ విధంగా పోరాడుతారో, రకరకాల వేదికలను తమ లక్ష్య సాధనకై ఏ విధంగా ఉపయోగించుకుంటారో ఫిబ్రవరి 17 నుంచి 23 దాకా జరిగిన సంఘటనలు చక్కని నిదర్శనాలు. ఆంధ్రప్రదేశ్‌లో రాజకీయాలు ప్రజల్ని నిర్దేశిస్తే, తమిళనాడులో ప్రజలే రాజకీయాల్ని నిర్దేశించడం గమనార్హం. ప్రజల అండ, హార్దిక, ఆర్థిక సహకారమున్నంత వరకు శ్రీలంక తమిళుల ఉద్యమం కొనసాగుతూనే ఉంటుందనేది ఎవరు కాదనలేని సత్యం. వీ

*అరవై ఏళ్ల స్వతంత్ర భారతదేశంలో సగానికి పైగా పిల్లలు పోషకాహార లేమితో బాధపడుతున్నారనీ, భవిష్యత్తుకు ఇది ప్రమాదకరమనీ అంటున్నారు* **వి. హనుమంతరావు**

# తిరోగమనంలో పురోగమనం

ప్రపంచంలో పోషకాహార లేమితో బాధపడుతున్న మూడేళ్ల లోపు బాలబాలికల్లో సగం మంది భారతదేశంలోనే ఉన్నారు; సగటున చూస్తే మన దేశంలో పోషకాహార లేమి రేటు దక్షిణాఫ్రికా కన్నా కనా కష్టంగా ఉంది; దక్షిణాసియా దేశాల్లో పోషకాహార లేమి విషయంలో మన దేశం ఆఖరు స్థానంలో ఉంది. (బంగ్లాదేశ్, నేపాల్‌తో కలిపి); ఈ రేటు 46 శాతం (రేటు అంటే అంతర్జాతీయంగా గుర్తించిన తక్కువ బరువు పిల్లల సంఖ్యతో పోలిస్తే); ఈ రేటు 2005-06లో 46 శాతం. ఆరు శాతం అభివృద్ధి సాధించామని, దేశం వెలిగిపోతోందని కాలరెగరేసుకొని కళ్ల నెత్తిన పెట్టుకొని నాయకులు విహారం చేస్తున్న రోజుల్లో ఇంత ఎక్కువ శాతమా; తినడానికి తిండి లభించకపోవడం ఒకటైతే, తినే తిండిలో పోషకాహార విలువలు లేకపోవడం మరింత దారుణం; 18.5 బి.ఎం.ఐ. (బాడీమాస్ ఇండెక్స్ - శరీరారోగ్యానికి అదో కొలత) కి తక్కువ ఉన్న పెద్దవాళ్ల జనాభా 1998-99లో మొత్తం జనాభాలో 36 శాతం మంది ఉంటే 2005-06లో 33 శాతానికి మాత్రమే తగ్గింది; మూడేళ్ల బాలబాలికల్లో ఉండాల్సినంత బరువు లేని వారు 47 శాతంమంది ఉన్నారు. గత అయిదేళ్ల కాలంలో వీరి శాతం ఏమీ తగ్గలేదు; గత ఇరవై ఐదు సంవత్సరాలుగా పౌరుల బరువు, ఎత్తు విషయంలో మార్పు ఏమీలేదు.

ఈ 'అభివృద్ధి' సూచికలన్నీ పదకొండవ ప్రణాళిక పుస్తకంలో నుంచి ఉటంకించినవి. అరవై రెండు సంవత్సరాల పాలన తర్వాత దేశంలో ప్రజల, ముఖ్యంగా బాలబాలికల పోషకాహార స్థాయి ఇదీ. ఇటువంటి పాలకులను మళ్లీ గద్దెనెక్కిస్తారా?

తల్లి గర్భంలో ఉన్నప్పుడే పోషకాహారలేమితో పుడితే అది జీవితాంతం వారిని వెంటాడుతోంది. వారికి పుట్టిన బిడ్డలకు కూడా సంక్రమిస్తుంది. శారీరకంగా, మానసికంగా ఎదగలేరు. త్వరగా అనారోగ్యానికి గురవుతారు. జబ్బు చేస్తే కోలుకోవడానికి మరింత ఎక్కువ కాలం పడుతుంది. పోషకాహార లేమికి, ఎయిడ్స్ వ్యాధికి సంబంధం ఉంది. పోషకాహార లేమితో అసంఘటిత కార్మికులు పూర్తి శక్తితో పనిచేయలేరు. అలాంటి వారిని పని నుంచి తొలగించే అవకాశం ఉంది. పుట్టిన పిల్లలలో మెజారిటీ తక్కువ బరువుతో జన్మిస్తున్నారు. బరువు 1.4/1.6 కిలోల మేరకు తగ్గితే, పదేళ్లు వచ్చేసరికి 2 కిలోలు, పెద్దవాళ్లు 13-18 కిలోల మేరకు బరువు తగ్గుతారు. ఎత్తు పెరగటం విషయంలో కూడా అదే జరుగుతుంది. పై విషయాల్లో ఎస్.సి., ఎస్.టి. ఇంకా తక్కువ స్థాయిలో ఉన్నారు.

పిల్లలు తినే ఆహారాన్ని సర్వే చేసి పరిశీలించగా 70 నుంచి 80 శాతం మంది వారి శక్తిని కేవలం ఆహార ధాన్యాలు, పప్పుల నుంచి మాత్రమే సంపాదించుకొంటున్నారు. ఇందువల్ల రెండు సమస్యలు వస్తాయి. ఒకటి, వాళ్లకు కావాల్సిన శక్తిని అలాంటి ఆహారం ఇవ్వలేదు. అదే ఆహారం రోజూ తినాలంటే అనాసక్తిని చూపిస్తారు. ఆపాటి కేలరీలు కూడ లభించవు. రెండు, కొవ్వు, పాలు, గుడ్లు వగైరా శరీరానికి కావాల్సిన ఇనుమును ఇస్తాయి. ఇవి ఆహారంలో లేకపోతే పిల్లలు ఆకలికి గురవుతారు. రక్తలేమి ఏర్పడుతుంది. వారు పోషకాహార లేమికి బలవుతారు. పోనీ, తినే అన్నం అయినా కడుపు నిండా తినగలుగుతున్నారా, కొనుక్కో గలుగుతున్నారా అని చూస్తే 1993-94/2004-05 మధ్యకాలంలో తలసరి బియ్యం, గోధుమ వినియోగం గ్రామాల్లో 13.3 నుంచి 12.07 కిలోలకు, పట్టణాల్లో 11.3 నుంచి 10.51 కిలోలకు పడిపోయింది. వారి మొత్తం ఖర్చులో ఆహారం కోసం ఖర్చు 2004-05 కు ముందు మూడు దశాబ్దాల్లో పడిపోతూ వచ్చింది. పల్లెల్లో 55 నుంచి 73 శాతం వరకు. పట్టణాల్లో 64.5 నుంచి 42 శాతానికి పడిపోయింది. అంటే వారి కొనుగోలు శక్తి అంతమేరకు పడిపోయిందన్న మాట. మనం తినే ఆహారం ఇచ్చే శక్తిని కేలరీల్లో కొలుస్తారు.

1983-2004/05 మధ్య ఇరవై సంవత్సరాల కాలంలో గ్రామీణ ప్రాంతాల్లో తలసరి రోజు కేలరీలు 2221 నుంచి 2047కు, పట్టణాల్లో 2080 నుంచి 2020 కేలరీలకు తగ్గింది. ఇది సగటు లెక్క; ప్రతి కుటుంబంలో అందరికీ తినిపించి స్త్రీ మిగిలిందే తింటుందన్న సంప్రదాయం తెలిసిన విషయమే.

| సబ్సిడీ (కోట్ల రు.) | |
|---|---|
| 1996-97 | 5166 |
| 1997-98 | 7500 |
| 1998-99 | 8700 |
| 1999-2000 | 9200 |
| 2000-01 | 12010 |
| 2001-02 | 17494 |
| 2002-03 | 24176 |
| 2003-04 | 25160 |
| 2004-05 | 25746 |
| 2005-06 | 23071 |
| 2006-07 | 23827 |

ఆహార భద్రత, లభ్యత, ధర, వినియోగదారుని కొనుగోలు శక్తి అనే మూడు విషయాల మీద ఆధారపడి ఉంటుంది. నిరుపేదలు, పేదలు, లోయర్ మధ్యతరగతి ప్రజల ఆహార భద్రత పై వాటిపైన ఆధారపడి ఉంటుంది. ఈ మూడు కాకుండా తిండి గింజలను సరఫరా చేసే వ్యవస్థ, అంటే మార్కెట్ లేదా చవక ధరల దుకాణాల వ్యవస్థ కీలకపాత్ర వహిస్తుంది. వీటన్నిటికన్నా ముఖ్యం వానలు పడాలి. వరి చేలు పండాలి.

*విచారణలో ఉన్న ఖైదీలకు, శిక్షపడిన ఖైదీలకు కూడ ప్రాథమిక హక్కులు రద్దు కావనీ, కాని రాష్ట్రంలో జైళ్లలో ఖైదీల హక్కులపై ఆంక్షలు విధిస్తున్నారనీ వివరిస్తున్నారు* **ఎ. స్నేహలత**

# ఖైదీల హక్కులను కాలరాస్తున్న చెరసాలలు

అవేజైళ్ళు, అవేసమస్యలు, ఆనాటి విషయాలే. ఎప్పటి జ్ఞాపకాలే. ఎందరో విచారించి, వివరించినవే. మరెందరో అనుభవించి, వ్యక్తీకరించినవే. ఇలా ప్రతీ విచారణలోనూ, అనుభవంలోనూ జైళ్లు ఎప్పటికీ ఖైదీల్లో వికాసాన్నీ, విశ్వాసాన్నీ, కలిగించలేవనేది అనునిత్యం మన మనసుల్లోకి వస్తూనే వుంది. జైలు అంటేనే స్వేచ్ఛకు సంకెళ్ళు. కదిలే కాలునే కాదు కంటిరెప్పను, మూసిన పెదాలను సైతం శాసిస్తాయి. హద్దుల్లోనే పొద్దులన్నీ గడిచిపోతాయి.

చదువులేని 35 ఏళ్ల నిరుపేద జీవితఖైదీ: 'మేము చచ్చి బతుకుతున్నోళ్లం. చచ్చినోళ్ళ మీదే తెల్లగుడ్డ కప్పుతారు. ఆ తెల్లగుడ్డే మా ఒంటిమీద వేశారు. దీని మీదున్న సన్నటి నీలంచార మేమింకా బతికున్నామంటుందన్నాడు' ఆ మాటలు చెబుతున్నప్పుడు ఆ ముఖంలోని చావా? బతుకా? అనే నిర్వేదం ఇంకా వెంటాడుతోంది. ఎన్నేళ్ళయినా మారని ఈ నరకకూపాల (జైళ్ళు) నీ ఖైదీల మనోవేదన మౌనంగానే నిలేస్తోంది.

అనాదిగా సమాజంలోని మనుషుల మధ్య అంతరాల దొంతర్లు, శ్రమదోపిడీ పునాదిగా నేరం జరుగుతోందనేది అవగతమే. అదేవిధంగా నేరాలకు శిక్షా అనివార్యమే. అయితే ఈ శిక్ష నేరాలను అదుపు చేసేదిగా వుంటుందా? నేరాలు చేసేవారిలో, చేస్తున్నవారిలో పరివర్తన, మార్పు తెస్తుందా? అసలు జైల్లో మగ్గుతున్న వారంతా నిజంగా నేరం చేసినవాళ్లేనా? ప్రశ్నలే... ప్రశ్నలు. వీటికి సమాధానాలు తెలిసినవే. కానీ సందర్భానుసారం మళ్లీ మళ్లీ మననం చేసుకోవలసిన స్థితి తప్పదు. ఇటీవల విశాఖ సెంట్రల్ జైల్లోని తీరుతెన్నులు పై స్థితిని గుర్తుచేస్తున్నాయి.

ఇక్కడ జరుగుతున్న, జరిగిన కొన్ని సంఘటనలు పరిశీలించినపుడు ఆ సంఘటనల నేపథ్యానికి బాధ్యులెవరు? బలవుతున్నదెవరో స్పష్టంగా అర్థమవుతుంది. సాధారణంగా ఖైదీలను చూడటానికి వచ్చే బంధువులు, ఆప్తులు, స్నేహితులు తమ వారికి అవసరమైన వస్తువులు, తినుబండారాలు, డబ్బు ఇస్తుంటారు. పత్రికలు, పుస్తకాలు ఇవ్వడం చూడడం (చదువుకున్నవారైనా). అయితే ఆ ఇచ్చేవన్నీ అతిసన్నని రంధ్రాల ఒక చిన్న కిటికీ, ఆ కిటికీకి తాళం వేసున్న

---

పంటకు సరియైన గిట్టుబాటు ధర రైతుకు ముట్టాలి. నూతన మిలీనియంలో పరిణామాలు చూస్తే ప్రభుత్వ అసమర్థత స్పష్టంగా కనిపిస్తుంది. బిజెపి హయాంలో ఆరు కోట్ల టన్నుల ఆహార ధాన్యాల నిల్వలు పేరుకొనిపోగా, వాటిని దేశంలో ఆకలితో అలమటించే వారికి చవక ధరకు లభ్యమయ్యేలా చర్యలు తీసుకోకుండా, రైతుకు ఇచ్చే కనీస మద్దతు ధర కన్నా తక్కువ ధరకు విదేశాలకు అమ్మి ఆ నిల్వలను వదులుకొన్నదంటే ఆ ప్రభుత్వం దృష్టిలో సామాన్యులు లేరని అర్థమమవుతుంది. కాంగ్రెస్ ప్రభుత్వం వచ్చిన తర్వాత పరిస్థితి తలకిందులై యాభై లక్షల టన్నులను దిగుమతి చేసుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. గోదాముల్లో తిండి గింజలు తక్కువ కావటంతో చవక దుకాణాలకు సరఫరా తగ్గింది. మార్కెట్లో ధరలు పెరిగాయి. పేదలు తమ తిండిని తగ్గించుకోవాల్సి వచ్చింది. చవక దుకాణాల నిర్వాకం గురించి అందరికీ తెలిసిన విషయమే. ఈ వైఫల్యాల నుంచి ప్రజల దృష్టిని మరల్చడానికి తాము వేల కోట్ల రూపాయల సబ్సిడీ ఇచ్చి పేదలను ఆదుకొంటున్నామని చెప్పుకుం టోంది. సబ్సిడీ ఇస్తున్న మాట వాస్తవమే.

ధరలను అదుపులో పెట్టి, పేదల కొనుగోలు శక్తిని పెంచితే ఈ సబ్సిడీ ఇవ్వాల్సిన అవసరమే ఉండదు. కాగా ప్రభుత్వ అసమర్థతకు చెల్లిస్తున్న మూల్యమే సబ్సిడీ.

రేషన్‌కార్డులదో పెద్ద బాగోతం. దారిద్ర్య రేఖకు కింద ఉన్న వారికి, రేఖకు పైన ఉన్నవారికి, నిజమైన నిరుపేదలకు రకరకాల కార్డులు, రేషన్ దుకాణాల నుంచి రేషన్ బియ్యం అక్రమ మార్గాల ద్వారా తరలింపు, ఉద్దేశిత లక్ష్యం నెరవేరకపోవటం అందరికీ తెలిసిన విషయాలే. ప్రభుత్వమే జరిపిన సర్వే ప్రకారం నిజమైన నిరుపేదలకు (టిడిపిఎస్) ఉద్దేశించిన పథకం 57 శాతం మందికే లాభిస్తోంది. కొన్ని రాష్ట్రాల్లో 75 శాతం బియ్యం దారి మళ్లిపోతోంది. 2003-04లో దారిద్ర్య రేఖ కింద ఉన్నవారికి ఇచ్చిన ఆహార ధాన్యాల్లో 141 లక్షల టన్నులకు గాను, వాస్తవంలో వారికి లభించింది 61 లక్షల టన్నులు మాత్రమే. వారికి అందాల్సిన 80 లక్షల టన్నుల ధాన్యాలు అక్రమ మార్గాలలో తరలిపోయాయి. అదే సంవత్సరంలో పై లెక్కల ప్రకారం రు. 7258 కోట్ల సబ్సిడీకి గాను, దారిద్ర్య రేఖకు కిందనున్న వారికి చేరాల్సిన రు.4123 కోట్ల సబ్సిడీ వారికి అంద లేదన్నమాట. ఆ పేదలకు ఆహార ధాన్యాలే అందకపోతే, పోషకాహార విలువలెక్కడ నుంచి వస్తాయి? చవక దుకాణాలకు 29.65 మిలియన్ టన్నులు విడుదల చేస్తే, 2004-05లో వినియోగదారులకు అందింది 13.53 మిలియన్ టన్నులు మాత్రమే. ఈ పంపకం విధానం వల్ల పేదవారికి రేషన్ ముట్టిందా లేదా అనేది కాక వారికి కార్డు ఉందా లేదా అనే స్థితికి దిగజారింది. పంపక విధానం నాయకులకు, మధ్యవర్తులకు, చవక దుకాణదారులకు ఫలహారం అందించే పథకంగా తయారైంది. కాగా ఈ పథకంతో పాటు, అలాంటి పథకాన్ని అమలుపరచలేని నాయకులను ఇంటికి పంపాల్సిన సమయం ఆసన్నమైంది. వీ

అరచెయ్యంత భాగం తలుపు ద్వారా ఇవ్వాలి. కానిస్టేబుల్ తీసుకుని చెక్‌చేసి ఒకటొకటి సదరు ఖైదీకిస్తాడు. జైలు సిబ్బంది ఆ విధంగా జాగ్రత్తలు పాటిస్తారు. కానీ ఇటీవల దీనికి భిన్నంగా మెయిన్‌గేట్ నుండే పై లావాదేవీలన్నీ జరుగుతున్నాయి. ఖైదీలకు వస్తువులిచ్చేవారిని పురుగుల్లాగా చూస్తున్నారు. ఖైదీల మీదే కాదు వారికోసం వచ్చేవారి మీద కూడా భయంకరమైన పెత్తనం చెలాయిస్తున్నారు. కుక్కలనో, పిల్లులనో తరిమినట్టు తరముతున్నారు. ఎంతో హీనమైన పరిస్థితినెదుర్కో వలసిన వస్తోంది. అసలు దీనికి ముందేం జరిగిందో తెలుసుకోవాలి.

ఇదే జైల్లో శిక్షననుభవించి వెళ్లిన పోలా భాస్కర్, మళ్లీ 27 అక్టోబర్ 2008న జైల్లో వున్న తన మిత్రులు అరిఫ్, వెంకటరెడ్డిలను కలిశాడు. భాస్కర్ తనతోపాటు చోరీసొత్తు 2 లక్షలు నగదు 40 తులాల బంగారం మిత్రులకివ్వడానికి తెచ్చాడు. జైలు సిబ్బంది అనుమతితోనే లోపలికి తీసుకుని వెళ్లాడు. వార్డర్ కృష్ణమూర్తి, జైలర్ రాజమౌళి, డిప్యూటీ జైలర్ డేనియల్ ఈ చోరీ సొత్తు మొత్తాన్ని కాజేసారు. ఒక చోరీకేసు విచారణలో ఇదంతా సివిల్ పోలీసుల దృష్టికి వచ్చింది. చివరికి లంచాలతో జైలు సిబ్బంది, సివిల్ పోలీసులు కుమ్మక్కయ్యారు. ఈ వార్తను డిసెంబర్ 29న పత్రికలన్నీ ప్రచురించాయి. కానీ ఈ సంఘటనలకి, అవినీతికి బాధ్యులు ఖైదీలు, వారి ఆత్మీయులుగా చిత్రీకరిస్తున్నారు. ఇకముందు జరక్కుండా కట్టుదిట్టమైన చర్యలు తీసుకుంటామన్నారు. ఆ చర్యలేమిటో ఇంతకు ముందే చెప్పుకున్నాం.

ఈ నెపంతో రాజకీయ ఖైదీల పట్ల వ్యవహరిస్తున్న తీరు మరీ అన్యాయంగా ఉంది. రాజకీయ ఖైదీలంతా తమ ప్రత్యేక గుర్తింపు కోసం, హక్కులకోసం పోరాడుతున్నారు. ఎందుకంటే ఏళ్లతరబడి ఈ సర్కారు సామాన్య పేదప్రజల పై పెత్తనం చేస్తోంది. నీటినీ, భూమినీ, అడవినీ, గనులను అమ్మేస్తుంది. భూమి నుండి ఉపాధి నుండి తరిమేసి ప్రజలని నిర్వాసితులుగా, అతిపేదవారిగా మార్చేసింది. మరోపక్క కులం, మతం, ప్రాంతం పేరుతో జరుగుతోన్న మారణహోమం ఇలాంటి దుర్భర జీవనంలో ఉన్న ప్రజల భద్రత, మెరుగైన జీవితాలకై ఉద్యమాలు నడుస్తున్నాయి. సమిష్టి విలువలనూ, విద్యను అందివ్వాలి. ముఖ్యంగా భూమిని ఈ ప్రజలందరికీ ధారాదత్తం చేయాలి. ఇంతటి గొప్ప గొప్ప ఆశయాలతో నడుస్తోన్న ఉద్యమాలలో కొందరు నిస్వార్థంగా తమ జీవితాన్నీ, ప్రాణాన్నీ పణంగా పెడుతున్నారు. పోరాడుతున్నారు. వీరంతా అక్రమకేసులతో రాజకీయ ఖైదీలుగా జైళ్లల్లో మగ్గుతున్నారు. అందుకే ఈ రాజకీయ ఖైదీల జైలు నిర్బంధం గురించి ప్రత్యేకంగానే చెప్పుకోవాలి. విడుదలుండదు. బెయిళ్లురావు. కేసుల సత్వర విచారణ ఉండదు. ఇంటర్వ్యూలివ్వరు. వీరిని చూడటానికి తల్లిదండ్రులు, స్నేహితులు, ఆత్మీయులు వస్తారు. ఈ రావటంలో శ్రమా, ఖర్చూ, ఆందోళన, పోలీసుల భయం ఉంటాయి. అయినా వీటన్నిటినీ అధిగమించి వస్తుంటారు.

ఏళ్లతరబడి అజ్ఞాతంలో వుంటూ ఎందరెందరో విప్లవకారులు తమకుటుంబాలకు దూరమవుతారు. అరెస్టయినపుడు సహజంగానే కుటుంబసభ్యులను కలవాలనే ఆరాటం, ఆత్రుత ఉంటాయి. అలా వచ్చిన వారికి గౌరవం తర్వాత మాట కనీసం మాట్లాడనివ్వని, చూడనివ్వని పరిస్థితి. ఆధారాలు, గుర్తింపుకార్డులు చూపమంటున్నారు. లేదంటే ఇంటర్వ్యూలివ్వరు. ఎంతెంతో దూరాల నుండి వచ్చే వీరికి నిరాశే మిగులుతోంది. చివరికి మీడియా ముందు తమగోడును వినిపించుకుంటున్నారు. అంతేనా? రాజకీయ ఖైదీలకు పత్రికలు, పుస్తకాలు చాలా అవసరం. వారికోసం తీసుకెళ్లిన పత్రికలు, పుస్తకాలు కూడా ఇవ్వకపోవడం అన్యాయం. నిత్యం ప్రజలు నిరభ్యంతరంగా చదివేవే. ప్రభుత్వ అనుమతితో నడుస్తున్న రిజిస్టర్డ్ పత్రికలే 'ఇండియాటుడే', 'వీక్షణం', 'మహిళామార్గం', 'అరుణతార', వంటివి, దినపత్రికలు కూడా సెన్సారు చేసిగాని ఇవ్వరు. పత్రికలు అనుమతించకపోవడం అక్షరాన్ని నిషేధించడమే. భావప్రకటనను, ప్రచారాన్ని అడ్డుకోవడమే. తద్వారా అజ్ఞానాన్ని పెంచి పోషించడమే. ఈ విధంగా రెండు రకాలుగా వ్యక్తి స్వేచ్ఛనూ, పత్రికల స్వేచ్ఛను హరిస్తోంది జైలు.

చోరీసొత్తు, మద్యం జైల్లోపలికి నిరాఘాటంగా తీసుకెళ్ళవచ్చు. దాన్ని జైలుసిబ్బంది పంచుకుని దోచుకోనూవచ్చు. కానీ అక్షరం మీదే ఆంక్షలన్నీ. ఈ రకంగా జైలు సిబ్బంది ఇటు రాజకీయ ఖైదీలను, అటు సాధారణ ఖైదీలను కూడా బాధిస్తున్నారు.

జైల్లో వైద్యం అందక చనిపోయేవారి సంఖ్య రోజు రోజుకి పెరిగిపోతోంది. కానీ ఇదే జైలులో వున్న అధికార పార్టీ ఎం.ఎల్.ఎ గండి బాబ్జి అనుచరుడు మాయరోగంతో హాస్పటల్లో చేరవచ్చు. రోజూ దర్జాగా ఇంటికి వెళ్ళవచ్చు. కాపలా సిబ్బందే దగ్గరుండి సాగనంపుతారు. పత్రికలు ఎత్తి చూపించినా కనీసం స్పందనుండదు. నిజమైన అనారోగ్యాన్ని పట్టించుకునే నాథుడు లేడిక్కడ. ఇదే జైల్లో ఐ.ఎస్.ఐ కేసులో శిక్షనుభవిస్తున్నాడు ఖురేషీ. తన అనారోగ్యానికి వైద్యున్ని అడిగాడు. కనీస సౌకార్యాలడిగాడు. తన పేరు మీద పంపుతున్న పత్రికను అనుమతించకపోవడాన్ని ప్రశ్నించాడు. ఈ నిరసనలో జైలుసిబ్బందితో జరిగిన ఘర్షణలో వార్డర్‌ని కొట్టాడు. దీంతో ఖురేషీని ఒక రాత్రంతా అతి తీవ్రంగా చిత్రహింసలు పెట్టారు. వ్యక్తిగత సెల్‌లో వేసి ఇంటర్వ్యూలు లేకుండా నిర్బంధంలో ఉంచారు. కానీ ఖురేషీ తీవ్రవాది, సహచర ఖైదీలను అకారణంగా కొట్టాడంటూ వాస్తవాన్ని వక్రీకరిస్తూ పత్రికల్లో ప్రచారం చేస్తున్నారు.

జైలు యంత్రాంగం అనేక రకాలుగా అవినీతికి, నిర్లక్ష్యానికి పాల్పడుతున్నారు. ఖైదీలను బలిపశువులను చేస్తున్నారు. వీరిని మానసిక క్షోభకు, అనారోగ్యానికి గురిచేస్తున్నారు. కనీస సౌకర్యాలు, మంచి ఆహారం, వైద్యం అసలేలేవు. ఇలాంటి వాతావరణంలో ఎక్కువకాలం శిక్షనుభవించిన ఖైదీలంతా 'కాయ పండింది ఎప్పుడు రాలుతుందో?' అంటూ తమ విడుదల కోసం యెదలు కొటుకులాడుతున్నాయంటుంటే విన్న మనసులు ద్రవిస్తాయి. ఎన్ని జి.ఒ.లు వచ్చినా, అవకాశాలున్నా జీవిత ఖైదీల విడుదల అగమ్యగోచరం. బతుకు మీద ఆశ చచ్చినా చావలేక బతుకుతున్నారు. ఎవరిని కదిలించినా ఆవేదనే.

ఈ సెంట్రల్‌జైల్లో కేవలం అధికారం, జులుం, పెత్తనం తప్ప మానవత్వం లేదు. విధులు, నియమాలు, నిబంధనలు లేవు. అజమాయిషీ లేదు. జైళ్ల పనితీరుపై విచారణ ఉండదు. మహిళా కమిషన్, మానవహక్కుల కమిషన్, లీగల్ సెల్ సర్వీసెస్ అథారిటీ ఇలా ఎవరొచ్చినా ఖైదీలు తమ సమస్యలు చెప్పుకోడానికి ఉండదు. వీరిచ్చే వినతిపత్రాలపై చర్యలూ ఉండవు. ఇదంతా ఒక మొక్కుబడిగా మిగులుతోంది. జైలే ఒక నిర్బంధం అయితే అందులో మరింకెన్నో నిర్బంధాలు చవిచూడాల్సిందే. అసలు సిసలు హంతకులూ, దొంగలు స్వేచ్ఛగా ఐశ్వర్యంలో, పదవుల్లో తులతూగుతున్నారు. నిరుపేదలు ఆకలి, ఆవేశం, అన్యాయాలకుగురై నేరాలు చేస్తున్నారు. ఒక్కోసారి చేయని నేరాన్ని నెత్తినేసుకుని జైళ్లపాలవుతున్నారు. ఇవన్నీ నిప్పులాంటి నిజాలే. జైళ్లలో ఎదుక్కొంటున్న వీరి ఆవేదనను అర్థం చేసుకోవాలి. జైళ్లలో మగ్గుతున్న వారి బాధలను, వారి ఆవేదనను ప్రపంచానికీ వినిపించడం మనందరి బాధ్యత. వీ

*బ్రిటిష్ కాలంనుండి రోశయ్య కమిటీ వరకు చేనేతకు మనుగడ లేదంటున్న నేపథ్యంలో చేనేత రంగానికి మౌలిక వసతులు కల్పించి, సహకారం అందించడం అవసరమంటున్నారు* **పులుగుజ్జు సురేష్**

# చేనేత చచ్చిపోతుందా?

హరప్పా, మొహంజదరోలలో ఉద్భవించి, మొఘల్ పరిపాలనలో వికసించి, బ్రిటిష్ పరిపాలనలో అనేక ఎదురుదెబ్బలు తట్టుకుని నిలబడిన భారత చేనేత పరిశ్రమకు వస్త్ర ప్రపంచంలో ఒక ప్రత్యేక స్థానం ఉంది. ఎన్నో సవాళ్లు, మరెన్నో సంక్షోభాలనెదుర్కొంటూ తమ ఉనికిని కాపాడుకుంటూ ఎదురొడ్డి నిలిచిన చేనేత పరిశ్రమ మన సొంత పాలకుల నిరాదణ, వ్యూహాత్మక ప్రణాళికలు, దేశీయ చేనేత పరిశ్రమను నిర్లక్ష్యం చేశాయి. ప్రణాళికలు చేసేవారు, పాలించేవారు విదేశీ మారకద్రవ్యం వ్యామోహంలో ఉన్నందున మన గ్రామీణ ప్రజలను రెండవ తరగతి పౌరులుగా చూస్తున్నారు. గ్రామీణ ఉపాధి కల్పనా పరిశ్రమలకు గుర్తింపు కూడా లేకుండా పోయింది. బడ్జెట్ వనరులను పెద్ద కంపెనీలు పంచుకోగా మిగిలిన కొసరుతో ఇచ్చే రాయితీలు, విరాళాల మీద బతకవలసిన దుస్థితి చేనేత, ఇతర ప్రజల జీవనోపాధయ్యింది. వ్యాపారం కోసం వచ్చిన బ్రిటిష్ పాలకులకు వస్త్ర వాణిజ్యమే ప్రధానమయ్యింది. భారత చేనేత పరిశ్రమను దెబ్బతీయడం ద్వారా నైతికంగా బలహీనం చెయ్యొచ్చు అనుకున్నారు. బ్రిటన్‌లో తయారయిన మిల్లు వస్త్రాలను దేశంలో ప్రవేశపెట్టడం ద్వారా స్వదేశీ చేనేత పరిశ్రమను నాశనం చేయవచ్చు అని అనుకున్నారు.

అయితే నాటి మన స్వాతంత్ర్య సమరయోధులు, దేశభక్తులు నిర్ద్వందంగా ఈ చర్యలను అడ్డుకున్నారు. దాదాబాయి నౌరోజీలాంటి వారు ప్రజాకంటకంగా మారిన బ్రిటిష్ విధానాన్ని ప్రతిఘటించారు. 1905లో బాలగంగాధర్ తిలక్ ఆధ్వర్యంలో విదేశీ వస్త్రాలను బహిష్కరించి చేనేత వస్త్రాలను ధరించాలని పిలుపునిచ్చారు. కార్మికుల్లో కోల్పోయిన ఆత్మస్థైర్యాన్ని నింపడానికి, అసంఖ్యాక ప్రజల జీవనోపాధి, మనుగడ ప్రశ్నార్థకం కాకుండా ఉండేందుకు 'చరఖా' ఉద్యమం చేపడితే ప్రజల మద్దతు విశేషంగా లభించింది. అయితే గాంధీ వారసులమని చెప్పుకుంటున్న మన పాలకులు మాత్రం చేనేత - నేత కార్మికుల ఆకలిచావులు, ఆత్మహత్యలు జరిగినప్పుడు రాజకీయ పర్యటనలు చేయడం, మీడియా ముందు నిలబడి, శుష్క వాగ్దానాలు చేయడం, ఏమో చేస్తున్నట్లు భ్రమలు కల్పించడం సాధారణంగా మారింది.

ఈ విధంగా మన దేశ చేనేత పరిశ్రమకు బ్రిటిష్ వారికంటే ఎక్కువగా మన పాలకులే నష్టం చేసారు. వర్తమాన కాలంలో చేనేత ఒక ప్రాచీన అవశేషంగా మిగిలిపోతుందని 'మన ద్రవ్య విధానం' అనే గ్రంథంలో తెల్ల జాతీయుడైన సి.ఎస్. వకీలు రాస్తే, ఒకడుగు ముందుకేసిన బ్రిటిష్ ప్రభుత్వం కేంద్ర సలహాదారు సర్ జార్జ్ వాట్సన్ గారు 1905-15 నాటికి చేనేత అంతరించిపోతుందని జోస్యం చెప్పారు. ఇదే బాటలో నడిచిన రాష్ట్రాన్ని పాలిస్తున్న మంత్రులలో ఒక ముఖ్యమంత్రి 31 డిసెంబర్ 2004 తో చేనేతకు కాలం చెల్లుతుందని ఆయనను కలిసిన చేనేత బృందంతో అన్నారు. ఆంధ్రప్రదేశ్ చరిత్రలో ప్రత్యేకంగా 2004లో నేతకారుల సమస్యలపై నియమించిన నిపుణుల కమిటీ (అధికార పార్టీ ఎం.ఎల్.ఎ.ల కమిటీగా ప్రసిద్ధి చెందింది. ఎం.ఎల్.ఎ.లు, అధికారులు తప్ప ఆ కమిటీలో ఇంకొకరు లేరు) 22 ఆగస్ట్ 2005న ప్రభుత్వానికి నివేదిక సమర్పించింది. ఈ నివేదికలో మిల్లు, పవర్‌లూం రంగాల పోటీకి చేనేత తట్టుకోలేదు. కాబట్టి ఈ రంగంలోని యువకులు, మహిళలను వేరే రంగాలవైపు మార్చాలని తెలిపారు. ఈ మహానుభావులు తెలిపిన వాటిలో వాస్తవమెంత ఉందో పరిశీలించాలి.

వందేళ్ల క్రితం బ్రిటిష్ వారి అభిప్రాయానికి వందేళ్ల తరువాత రోశయ్య కమిటీ నివేదికకు దగ్గర సారూప్యం ఉంది. ఇద్దరూ కూడా చేనేతకు భవిష్యత్ లేదనే చెప్పారు. వాస్తవమెంత ఉందో వందేళ్లలో జరిగిన పరిణామాలను పరిశీలిస్తే అవగతమవుతుంది. వీరు తెలిపిన వాటికి ఆధారాలు తెలపలేదు. అధ్యయనాలు చేయలేదు. కానీ చేనేతకు భవిష్యత్ లేదు అనే అభిప్రాయాన్ని చాలా వేగంగా, నిస్సిగ్గుగా ప్రజల్లోకి తీసుకు వెళ్లగలిగారు. ఫలితంగా రాష్ట్రంలోని చేనేత కార్మికులు తీవ్రమైన ఆందోళనకు గురయ్యారు. పరిశ్రమ మనుగడే లేకపోతే, బతుకు ప్రశ్నార్థకమవుతుందేమోననే భయం నెలకొంది. అందువల్ల మా పిల్లలను ఈ వృత్తిలోకి దించమని కొందరు కార్మికులు అన్నారు. ఈ మాటలను అదునుగా తీసుకున్న పాలకులు చేనేత కార్మికులు వారి పిల్లలను ఈ వృత్తిలోకి రానివ్వమంటున్నారని, ఈ వృత్తిని కొనసాగించడం వారికి ఇష్టం లేదని ప్రచారం చేశారు. ఈ అభిప్రాయంలో ఉన్న నిజమెంత? రోజువారి కూలీలు తమ బిడ్డల్ని కూలీ పని చేయించాలని ఎవరూ కోరుకోరు. సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు, డాక్టర్లు, మేస్త్రీలు, గ్యాంగ్‌మెన్‌లు, పోలీస్ కానిస్టేబుళ్లు, వ్యవసాయ కూలీలు, ఎయిర్‌హోస్టెస్‌లు, వ్యవసాయదారులతో సహా అందరూ వారి సంతతిని వారు చేస్తున్న వృత్తులలో ఉంచడానికి ఇష్టపడటంలేదు. వారి బతుకులే చాలీ చాలకుండా ఉంటున్నాయి. గౌరవప్రదంగా ఉండటం లేదు. దళారులు, రాజకీయ పైరవీకారులు ఆర్థికంగా బలపడుతున్నారు తప్ప మిగిలినవారెవ్వరి జీవితాల్లో సంతోషం లేదు.

ఇకపోతే మనుషులు సహజంగానే మార్పును కోరుకుంటారు. ఇపుడున్న స్థితి కంటే మెరుగైన, ఉన్నతమైన బతుకు కావాలనే కోరుకుంటారు. అందుకనే ఇండ్లల్లో పనిచేసే తల్లి ప్రసవించిన రోజున నా బిడ్డను 'కలెక్టర్' చేస్తానని సంబరపడుతోంది. అంటే ఆమె దృష్టిలో కలెక్టర్ జీవితం ఎంతో ఉన్నతంగా కనబడుతోంది. అసంఖ్యాక ప్రజల జీవితం అసంతృప్తితో సాగుతున్నదని ప్రభుత్వం గుర్తించాలి. వారి అసంతృప్తికి కారణం ప్రభుత్వ వైఫల్యంగా భావించాలి. కానీ ప్రభుత్వ వైఫల్యాలను ప్రజల అసమర్థతగా భావించడం సబబుగా లేదు. అభివృద్ధి చెందిన యూరప్ దేశాలలో ఐదు లక్షల కళాశాలల్లో 3000 రకాల వృత్తి విద్యా కోర్సులు ఉన్నాయి. అత్యధిక మానవ వనరులు కలిగిన భారతదేశంలో 3200 కళాశాలల్లో కేవలం పదుల సంఖ్యలో మాత్రమే ఉన్నాయి. 1940 నాటికి భారత జనాభాలో నలభై శాతం మంది చేతి వృత్తులపై ఆధారపడితే నేడు రెండు శాతానికి తగ్గిపోయింది. దీనినిబట్టి చేతివృత్తుల పట్ల పాలకులకు ఉన్న ప్రేమ ఎంతో తేటతెల్లమవుతుంది. ప్రభుత్వాల పుణ్యమా అని దేశంలోని అనేక వృత్తులు కనుమరుగ వుతున్నాయి. ఈ నేపథ్యంలో కూడా చేనేతరంగం ఆధునిక పోకడలకు ఎదురొడ్డి నిలబడింది. ఇటువంటి కళా నైపుణ్యం, వ్యాపార సామర్థ్యం కలిగి 1.24 కోట్ల మందికి జీవనోపాధి అయిన చేనేత పరిశ్రమపై పాలకులు శాపనార్థాలు పెడుతున్నారు. నైతికంగా దెబ్బతీస్తున్నారు. వారి వాదనలో బలం లేదనడానికి అనేక ఆధారాలు మన మధ్య ఉన్నాయి.

1904-05లో భారతదేశంలో ఇరవై అయిదు కోట్ల జనాభా ఉంది. అరవై లక్షల చేనేత మగ్గాలు ఉండేవి. అరవై లక్షల చేమగ్గాలపై 93.5 కోట్ల చదరపు మీటర్ల వస్త్రం ఉత్పత్తి జరిగింది. ఏడాదికి ఒక మగ్గంపైన సగటున 155.83 చదరపు మీటర్ల రంగు వస్త్రాలు, సాదా డిజైన్‌లు, ముతక బట్టలను ఉత్పత్తి చేసాయి. ఆనాటి 25 కోట్ల జనాభాకు సగటున మనిషికి 3.74 చదరపు మీటర్ల చేనేత వస్త్రం అందుబాటులో ఉండింది. అంటే ఒక మనిషికి ఒక జత బట్టలు కూడా రావు. ఆనాడు తయారైన మొత్తం వస్త్రం 160.16 కోట్ల చదరపు మీటర్లు. దీనిలో మిల్లు వాటా 41.5 శాతం కాగా చేనేత వాటా 58.5 శాతం ఉంది. 2004-05 ఆర్థిక సంవత్సరం తరువాత భారత జనాభా నాలుగు రెట్లు పెరిగింది. సుమారుగా 108 కోట్లు. ఈ రోజు వరకు కూడా దేశంలో 38.91 లక్షల చేమగ్గాలు ఉన్నాయి. చేమగ్గాలపై తయారైన వస్త్రం 626.3 కోట్ల చదరపు మీటర్లు. సగటున ఒక మనిషికి 5.79 చదరపు మీటర్ల వస్త్రం అందుబాటులో ఉంటుంది. భారతదేశంలోని జనాభా ఒకరు ఒక జత చేనేత వస్త్రాలు ధరిస్తే, చేనేతకు మార్కెట్ సమస్య ఉండదు.

వందేళ్ల క్రితం సగటున ఒక చేమగ్గంపైన అర మీటరు ఉత్పత్తి చేయగలిగితే, నేడు రోజుకు సగటున అయిదు నుంచి ఆరు మీటర్లు తయారవుతోంది. నాడు ఒక మగ్గంపైన ఏడాదికి సగటున 155.83 చదరపు మీటర్లు తయారైతే నేడు 1565.75 చదరపు మీటర్లు తయారవుతోంది. ఉత్పాదక సామర్థ్యం 1004.78 శాతం పెరిగింది. ప్రభుత్వం, జౌళిరంగ నిపుణులలో కొందరు ఉత్పాదక సామర్థ్యం అధికంగా ఉన్న ఆధునిక పవర్‌లూంలకు ప్రాధాన్యతనిస్తున్నారు. అత్యాధునిక పవర్‌లూం ఖరీదు ఒక కోటి రూపాయలు ఉంటే, దీనిపైన ప్రత్యక్షంగా, పరోక్షంగా ఇద్దరికీ మాత్రమే ఉపాధి దొరుకుతుంది. ఒక రోజుకు 1500 చదరపు మీటర్ల వస్త్రం ఉత్పత్తవుతుంది. అదే కోటి రూపాయలకు చేనేతపై పెట్టుబడి పెడితే వెయ్యి చేమగ్గాలు ఏర్పాటు చేయవచ్చు. ప్రత్యక్షంగా, పరోక్షంగా కనీసం మూడువేల మందికి ఉపాధి కల్పించవచ్చు. రోజుకు ఆరు వేల చదరపు మీటర్ల వస్త్రం ఉత్పత్తి చెయ్యొచ్చు. ఆధునిక మరమగ్గాల కంటే చేమగ్గాలపైన నాలుగు రెట్లు అధికంగా ఉత్పాదక సామర్థ్యం ఉంది. మన రాష్ట్రంలో తాజా లెక్కల ప్రకారం 77,000 మరమగ్గాలు ఉన్నాయి. 184.8 కోట్ల చదరపు మీటర్ల ఉత్పత్తి జరుగుతోంది. ఉత్పత్తి విలువ తొమ్మిది వేల కోట్ల రూపాయలు. సుమారుగా 30-40 వేల మంది ఉపాధి పొందుతున్నారు. అయినా ఎప్పుడూ సంక్షోభమే. ఇదే ఆంధ్రప్రదేశ్‌లో 4.5 లక్షల చేమగ్గాలు ఉన్నాయి. 15 లక్షల వరకు ఉపాధి పొందుతున్నారు. సుమారు 50-60 కోట్ల చదరపు మీటర్ల వస్త్రం తయారవుతోంది. వందేళ్ల క్రితం ఆంధ్రప్రదేశ్‌లో 4.75 లక్షల చేనేత మగ్గాలు ఉంటే నేడు 4.5 లక్షల చేమగ్గాలు ఉన్నాయి. నాడు కేవలం సాదా మగ్గాలపైన వస్త్రం తయారైతే, నేడు సాదా మగ్గానికి డాబీ, చైన్ డాబీ, 3 జాకార్డులు అమర్చి ప్రతి అరమీటరుకు ఒక సరికొత్త డిజైన్ చేయగల సామర్థ్యం ఉంది. డిజైనర్ వస్త్రాలు నేయగల అవకాశం చేనేతకు మాత్రమే ఉందని, తక్కువ ధరకు అందించవచ్చని ఫ్యాషన్ డిజైనర్లు పదే పదే చెప్పడం జరుగుతోంది.

ధర్మవరంలో 1812లో అయిదు వందల చేమగ్గాలు ఉండగా నేడు రెండు లక్షల మగ్గాలపైన ఆరు లక్షల మంది బతుకుతున్నారు. స్వేచ్ఛా వాణిజ్యం ప్రారంభమైన తరువాత 1.5 లక్షల మగ్గాలు ఈ ప్రాంతంలో పెరిగాయి. స్వేచ్ఛా వాణిజ్యం వచ్చిన తరువాత కూడా భారత జౌళి ఎగుమతులలో చేనేత వాటా 15 శాతం ఉంది. 2007-08లో 4,800 కోట్ల రూపాయల విలువైన వస్త్రాల ఎగుమతి జరిగింది. జౌళిరంగం వస్త్రోత్పత్తిలో 13 శాతం, ఉపాధిలో 30 శాతం, అత్యధిక గ్రామీణులు ఆధారపడిన ఏకైక రంగంగా చేనేత నిలబడింది. అయితే ప్రభుత్వం ఈ వాస్తవాన్ని గుర్తించకుండా చేనేత నిలబడదనే నిర్ణయానికి వచ్చింది. ఈ దిశగా అనేక చేనేత వ్యతిరేక విధానాలు అమలు చేశారు. మిల్లు ఉత్పత్తులపై ఉన్న గరిష్ఠ పరిమితిని ఎత్తివేశారు. నూతన జౌళి విధానం 1985 ను ఉత్పాదకతే లక్ష్యంగా రూపొందించారు. 1995లో ఏర్పడిన ప్రపంచ వాణిజ్య సంస్థతో వాణిజ్య సంబంధాలు ఏర్పరచుకున్నారు. 2000లో జాతీయ జౌళి విధానం రూపొందించి వాయు వేగంతో అమలు చేస్తున్నారు. ఎగుమతుల కోసం ఉన్న ఎచ్.ఎస్. కోడ్‌కు 2003లో తిలోదకాలిచ్చారు. ఇప్పటి వరకు అమలు చేస్తున్న పథకాలలో పన్నెండును 2006-07 ఆర్థిక సంవత్సరం నుండి ఎత్తివేసారు. 1981 వరకు చేనేత రక్షణ కోసం తీసుకున్న చర్యలకు స్వస్తి పలికారు. 1983లో తిరుపతిలో జరిగిన జాతీయ సైన్స్ కాంగ్రెస్‌లో సాంకేతిక విధానాలను భారీగా ప్రకటించారు. చేనేత, ఇతర సంప్రదాయ వృత్తులకు భంగం కలగకుండా చూస్తామని గట్టిగా నమ్మబలికారు. కానీ సైన్స్ కాంగ్రెస్ తరువాత మిల్లు, పవర్‌లూంలకు మద్దతునిచ్చి చేనేతను పూర్తిగా నిర్లక్ష్యం చేశారు. ఈ విధంగా మూసపద్ధతిన కాకుండా చేనేతకు ఉన్న బలాలు, అవకాశాలు శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించి ప్రత్యేక చేనేత విధానం ప్రకటించి చేనేత రంగాన్ని అభివృద్ధి చేయడం ద్వారా చేనేత కార్మికుల జీవన ప్రమాణాల పెరుగుదలకు కృషి చేయవచ్చు. వీ

*దండోరా ఉద్యమ స్ఫూర్తితో ప్రారంభమైన మాదిగ సాహిత్యం మొత్తంగా తెలుగు సాహిత్యానికే కొత్త నడకలు నేర్పింతుటున్నారు* **సాంబయ్య గుండిమెడ**

# మాదిగ సాహిత్యం : తెలుగు సాహితీ ఫలకంపై కొత్త దరువు

*"మాదిగ దండోరా భారతీయ సామాజిక ఉద్యమాల్లో ఒక మార్పు. సాహిత్య, సాంస్కృతిక రంగాల్లో సైద్ధాంతిక విషయాల్లో అది తెచ్చిన మార్పు గణనీయం. కొందరి ద్వారా తిట్టు పదంగా వాడబడే మాదిగ అనే పదాన్ని వాళ్లు రావు, రెడ్డి, శాస్త్రి, శర్మ లాగా గౌరవవాచకంగా మార్చారు. విలువలు మార్చబడ్డాయి. మాదిగ భాష మానవీయమైంది. మాదిగ సాహిత్యం ఉధృతమై పాట, ప్రసంగం, వ్యాసం, కథ, నవల ప్రకియలన్నిటిలో విస్తరించింది. మాదిగ దండోరా శ్రామిక కుల సంఘాలలో కొత్త చైతన్యాన్ని తెచ్చింది."*

– *బి.ఎస్. రాములు*[1]

దళితుల విద్య – ఉపాధికై కల్పించిన రిజర్వేషన్ వసతులలో అగ్రభాగాన్ని ఆ కూటమిలో అప్పటికే సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా ఎదిగిన మాలలు, ఆది–ఆంధ్రులు చేజిక్కించుకుంటున్న కారణాన మాదిగలు, రెల్లి ఇత్యాది దళిత కులాలు ఆ వసతుల నుండి దూరంగా నెట్టివేయబడ్డారు. సామాజిక న్యాయం పేర రాజ్యాంగబద్ధంగా కల్పించిన అవకాశాలు దళిత కూటమిలోని కులాలన్నిటికీ చెందుతాయి. అలాగాక కూటమిలోని కేవలం రెండు కులాలే వినియోగించుకోవడం అనేది ఆ కూటమిలోని మిగిలిన కులాలకు జరుగుతున్న సామాజిక అన్యాయం. రిజర్వేషన్ వసతులను కులపర విభజన చేసి దళిత కూటమిలో అభివృద్ధికి నోచుకోని కులాలకు సామాజిక న్యాయం చేకూర్చమంటూ మాదిగలు, రెల్లిలు ఇంకా ఇతర దళిత కులాలు ఒక కూటమిగా ఏర్పడి, 'మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి' (ఎంఆర్‌పిఎస్) పేర 'వర్గీకరణ' డిమాండ్‌తో దండోరా ఉద్యమానికి పూనుకున్నారు. వర్గీకరణ ఉద్యమానికి వ్యతిరేకంగా మాలలు, ఆది–ఆంధ్రులు ఒక కూటమిగా 'మాల మహానాడు' ను ఏర్పాటు చేసుకుని వర్గీకరణతో సామాజిక న్యాయం జరగదని, పైపెచ్చు అది దళితుల ఐక్యతకు గొడ్డలిపెట్టు అంటూ ప్రతికూల ఉద్యమంతో మాదిగలను ప్రతిఘటించారు. కులం, సామాజిక న్యాయం, ఐక్యత అనే మూడు అంశాలు ప్రధానంగా దండోరా – మాల మహానాడు ఉద్యమ వేదికల పై ముందుగా మాదిగ, మాలల మధ్య ఒక గొప్ప చర్చ జరిగింది. ఆ ఉద్యమాలు, అవి లేవనెత్తిన ప్రశ్నలు ప్రధాన వస్తువులుగా పరిగణించి ఈ రెండు కులాలకు చెందిన రచయితలు, వ్యాసకర్తలు, కవులు, కథకులు తమదైన రీతిలో స్పందించి దళిత సాహిత్యంలో ఒక నూతన అధ్యాయాన్ని ఆరంభించారు. దండోరా ఉద్యమ నేపథ్యంలో, ఆ ఉద్యమ స్ఫూర్తితో ఎందరో మాదిగ విద్యావంతులు తమ కలాలకు పదునుపెట్టి కరపత్రాలతో, పాటలతో ప్రారంభించి కవిత, కథానిక, వ్యాసం, నవల మొదలైన ప్రక్రియలతో తెలుగు సాహిత్య నాట్య రమణికి కొత్త నడకలు నేర్పారు. ఆరంభంలో కేవలం మాదిగోడి గోడు వినిపించడానికే పట్టిన కలం క్రమేపి తమ కుల సమస్యల ఎల్లలు దాటి తమలాగే సామాజిక గుర్తింపు కోల్పోయి, సామాజిక అన్యాయానికి గురయిన ఎన్నో దళిత దళితేతర కులాల సమస్యలను కూడా తట్టింది, మానవత్వంతో వారి పక్షాన నిలిచింది. దండోరా లేవనెత్తిన చర్చను, సృష్టించిన సాహిత్యాన్ని ఆమూలాగ్రం పరిశీలించీ భగీరథ ప్రయత్నాన్ని వెంకటేశ్వరరావు దార్ల తన వ్యాస సంకలనంలో చేపట్టి, ఆణిముత్యాల్లాంటి అయిదు వ్యాసాల సమాహారాన్ని 'దళిత సాహిత్యం: మాదిగ దృక్పథం' పుస్తకంగా ప్రచురిస్తున్నాడు.[2] ఆ అయిదు వ్యాసాలను నాలుగు స్వతంత్ర విభాగాలలో పరిశీలించే ప్రయత్నమే ఈ వ్యాసం.

**తెలుగు దళిత కథా పరిణామం**

తెలుగు దళిత కథా పరిణామాన్ని వివరిస్తూ దళిత కథకు తెలుగు సాహిత్యంలో ఒక విశిష్ట స్థానాన్ని కల్పించే ప్రయత్నాన్ని 'తెలుగు దళిత కథా పరిణామం' వ్యాసంలో దార్ల చేశారు. సాధారణంగా ఒక వ్యవస్థనో లేదా ఒక రంగాన్నో శాసిస్తున్నవారు కొత్తదనాన్ని ఆహ్వానించరు. ముఖ్యంగా ఆ కొత్తదనం తమ పీఠాలను కదిలించేటట్లుంటే ఆరంభంలోనే దాన్ని భూస్థాపితం చేసేందుకు ఎన్నో సామ, దాన, భేద, దండోపాయాలు ఆచరిస్తారు. ఎన్ని చేసినప్పటికీ ఆ కొత్త శక్తిని ఆపడం తమ తరం కానప్పుడు జీవంలేని వాదాలతో దాని ప్రభావాన్ని తగ్గించేందుకు శతవిధాలా ప్రయత్నిస్తారు. ఇట్టి ప్రయత్నాలు వారి మూర్ఖత్వాన్ని, వితండవాద బుద్ధిని బట్టబయలు చేస్తాయే కాని ఆ నవ్యతలోని శక్తిని ఏ మాత్రం తగ్గింపజాలవు. కవిత్వం, కథ, నాటకం, పాట, విమర్శ తదితర సాహిత్య ప్రక్రియలతో దళిత సాహిత్యం తెలుగు సాహిత్యాన్ని పరిపుష్టం చేస్తున్నప్పటికీ అట్టి సాహిత్యం ఉద్యమం కాదు, అది వాదమేనని సంప్రదాయవాదులు, మార్క్సిస్టులు వాదించడం వారి వితండవాద బుద్ధికి పరాకాష్ఠ. వితండవాదుల వాదాలకు సమాధానాలు ఇవ్వవలసిన అవసరం ఉండదు, అసలు వాటిగురించి పట్టించుకోవలసిన పనే లేదు. అయితే ఈ వితండవాదుల నోర్లు మూయించకుంటే వారు మరలా మరలా అటువంటి వాదాలను చెయ్యడానికి అవకాశం ఉంది. పైగా వీరు తెలుగు సాహితీ రంగాన్ని ఇంకా శాసిస్తూనే ఉన్నారు, కాబట్టి కొత్తదనం ముందుకు సాగాలంటే ఈ ముదితల నణుగుడిని ఆపింపజేయడం తప్పనిసరి అవుతుంది. దళిత కథా పరిణామాన్ని పరిశీలించే ముందు ఈ పనికే దార్ల నడుం బిగించారు. వాదానికి తాత్విక దృక్పథం కంటే ఆ వాదాన్ని వినిపించేవారి ఆశలను – ఆశయాలను వినిపించడమే ప్రధానంగా ఉంటుంది. పైపెచ్చు వాదం

చాలాసార్లు కొన్ని తాత్కాలిక ప్రయోజనాలను మాత్రమే ఆశిస్తుంది. అయితే ఉద్యమం అలాకాదు. దానికి 'స్పష్టమైన ప్రణాళిక, లక్ష్యం, తాత్విక నేపథ్యం, దృక్పథం మొదలైనవి ఉంటాయి' అని ఉద్యమాన్ని నిర్వచించి దళిత సాహిత్యం ఉద్యమేనని స్పష్టంగా చెబుతాడు. ఆ విషయాన్ని నా మాటలలో కంటే దార్ల మాటలలో పేర్కొంటేనే అందులోని స్పష్టత తెలుస్తుంది:

'దళిత సాహిత్యానికి 'దళిత పాంథర్స్' నుండే ఒక ప్రణాళిక ఉంది. కుల నిర్మూలన లక్ష్యం ఉంది. వర్ణాశ్రమ ధర్మాలపై నిర్మితమైన భారతీయ సమాజం, వివిధ మతాల ప్రభావాలు వంటి వాటి నుండి శారీరక, మానసిక, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక క్షోభలను, అవమానాలను ఎదుర్కొన్న జాతుల ప్రధాన జీవన స్రవంతిలోకి రావాలనే నేపథ్యం ఉంది. డా.బి.ఆర్.అంబేద్కర్, జ్యోతిబా పూలే, పెరియార్ రామస్వామి నాయకర్ మొదలైన వారి భావజాలాన్ని అర్థం చేసుకుంటే గాని ఇవన్నీ అవగాహనలోకి రావు. ఆ దృక్పథంతో తెలుగు దళిత సాహిత్యాన్ని చూస్తేగాని తెలియదు'.

అలా చూడగలిగినప్పుడు దళిత సాహిత్యం ఉద్యమేనన్న విషయం స్పష్టమవుతుందని దళిత సాహిత్యానికి ఒక పటిష్టమైన దీప శిఖరాన్ని అతను నిర్మిస్తాడు. ఆ దీప శిఖరం పై నుండి దళిత కథా కట్టడాన్ని పర్యవేక్షిస్తాడు.

తెలుగు దళిత కథా పరిణామం రెండు దశలలో జరిగింది. అవి స్వాతంత్ర్యానికి పూర్వం ఒక దశ అయితే స్వాతంత్ర్యం తరువాత రెండవ దశ. స్వాతంత్ర్యానంతరం తెలుగు రాష్ట్ర రాజకీయాలను, దళితుల (వీరితో పాటు దళితేతరులలో సామాజికంగా, ఆర్థికంగా వెనుకబడిన అణగారిన వర్గాలవారి) జీవన స్థితిగతులను వివిధ రాజకీయ-తాత్విక ఉద్యమాలు, సంఘటనలు, సమస్యలు ప్రభావితం చేస్తాయి. అట్టి వానిలో ముఖ్యమైనవి, కమ్యూనిస్టు తాత్విక ఉద్యమం - రాజకీయాలు, నక్సల్బరీ-శ్రీకాకుళ పోరాటాలు, స్త్రీవాద ఉద్యమం, కారంచేడు-చుండూరు దురాగతాలు, మాదిగ దండోరా వర్గీకరణ డిమాండ్. వీటి ఆధారంగా స్వాతంత్ర్యానంతర తెలుగు కథా పరిణామాన్ని మూడు దశలలో దార్ల వీక్షిస్తాడు. దళితవాదానికి ప్రాతినిధ్యమనదగిన కొన్ని కథలను పరిశీలించడం ద్వారా దళిత కథా స్వరూప స్వభావాలను, పరిణామాన్ని తెలియజేయడం జరిగింది. కాల ప్రాతిపదికన దళిత కథా పరిణామాన్ని వీక్షించినప్పటికీ వామపక్ష, స్త్రీవాద, దళిత, మాదిగ ఉద్యమాల నేపథ్యంలో ఆయా కాలాల దళిత సమస్యల వస్తుపరంగా ఈ పరిణామాన్ని తెలియ జేయడం ఈ వ్యాస విశిష్టత.

స్వాతంత్ర్యానికి పూర్వం వచ్చిన దళిత కథల్లో దళితేతరులు ముఖ్యంగా బ్రాహ్మణ కులానికి చెందినవారు రాశారు. అలా రాసిన వారు మహాత్మాగాంధీ, 'హరిజనోద్ధరణ' పిలుపుకి ప్రభావితులై రాయడం జరిగింది. వీరిలో 'పుల్లం రాజు', 'సాగర సంగం' లాంటి కథలు రాసిన శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, 'నరసన్నపాపాయి' కథకుడు అడవి బాపిరాజు ముఖ్యులు. వీరి కథలలో ప్రధానంగా కనిపించేవి మూడు విషయాలు/సమస్యలు: 1) దళితుల మధ్య అనైక్యత; 2) దళితుల దేవాలయ ప్రవేశం; 3) దళితుల మతాంతీకరణ. వీరు తమ కథానికలలో హరిజన సమస్యలను చెప్పడంతోటే సరిపెట్టుకోక ఏ హరిజనోద్ధరణ పిలుపుతో తాము ప్రభావితులయ్యారో, ఆచరణలో ఆ హరిజనోద్ధరణలోని డొల్లను నిజాయితీతో స్పష్టం చేశారు. ఉదాహరణకు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి 'ఇలాంటి తవ్వాయి వస్తే' కథ అసలు హరిజన సమస్యను అగ్రకులాలు ఎంత చాకచక్యంగా తప్పుదారి పట్టిస్తున్నారో స్పష్టం చేస్తుంది. వీరితో పాటు చలం లాంటి సాహితీవేత్తలు 'హరిజన సమస్య', 'మాదిగమ్మాయి' లాంటి కథలను రాసినప్పటికీ హరిజన 'సమస్య' లోతులు తెలియకుండా రాసిన కథలని దార్ల వ్యాఖ్యానిస్తారు. ఈ విషయాన్నే బి.ఎస్.రాములు వేరొక సందర్భంలో: 'చలం రాసిన 'హరిజన విద్యార్థి' కథ అతనిలో గల బ్రాహ్మణ స్వభావాన్ని పట్టిస్తుంది. హరిజనులంటే మొగోల్లే అన్నట్టు, హరిజనుల్లో స్త్రీలుంటారని మతికిరాని చలం కదుపుమంటతో రాసిన కథ ఇది,'[3] అని స్పష్టపరుస్తారు.

స్వాతంత్ర్యం తరువాత, కారంచేడు సంఘటనకు ముందు ఉన్న కాలం దళిత ఉద్యమ - రాజకీయాలకు సంధి కాలమైనట్లే దళిత కథకు కూడా సంధి కాలం అవుతుంది. ఈ కాలంలో అటు దళిత కూటమిలో, ఇటు హిందూ కూటమిలో గాంధీ హరిజనోద్ధరణ ఉద్యమం, రాజ్యాంగం ద్వారా దళితుల సామాజిక, ఆర్థిక, రాజకీయ అభివృద్ధికై చేపట్టిన వివిధ పాలసీ - పథకాల రూపేణా ఎన్నో మార్పులు - చేర్పులు జరుగుతాయి. ఈ మార్పు-చేర్పుల సమస్యలే స్వాతంత్ర్యానంతరం వచ్చిన దళిత కథకు ప్రధాన వస్తువులయ్యాయి. అస్పృశ్యత, నీటి సమస్య, రాజకీయాధికారం, వృత్తి వల్ల వచ్చే అనారోగ్యం, వృత్తులు మారి చదువుకున్నా వీడని కుల పీడన, గ్రామాల్లో భూస్వామ్య పెత్తందారీ రాబందుల విధానాలవల్ల దళితులు పడిన ఇబ్బందులు ప్రధానమైనవిగా దార్ల గుర్తిస్తాడు. ఈ సంధి కాలంలో దళిత కథను సుసంపన్నం చేసిన వారు ముఖ్యంగా రెండు కూటములకు చెందినవారు. ఒకరు వామపక్ష కూటమికి చెందిన వారైతే (వీరిలో అధికులు దళితేతరులు), మరొకరు దళిత కూటమికి చెందినవారు. దళిత కూటమికి చెంది దళిత వస్తువు ప్రధానంగా కథలు రాసిన వారిపై అంబేద్కర్ భావజాల ప్రభావం కనిపిస్తుంది. ఈ కూటమికి చెందిన వారిలో అగ్రజుడు కొలకలూరి ఇనాక్. అతను రాసిన 'ఊరబావి' కథ కేవలం దళిత కథలలోనేగాక మొత్తం తెలుగు కథానికలలో ఒక కోహినూర్ వజ్రం లాంటిది. అందుకే ఆ కథ 'స్వాతంత్ర్యానంతర తెలుగు ఆధునిక కథ', అని, 'కొలకలూరి ఇనాక్ స్వాతంత్ర్యానంతర ఆధునిక తొలి తెలుగు కథకుడు' అని బి.ఎస్. రాములు తన '50 ఏళ్ల తెలుగు కథ తీరు తెన్నులు' వ్యాసంలో ప్రతిపాదిస్తారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 1970వ దశకం చివరాంకంలో ఆరంభమై 1980వ దశకం ప్రథమాంకానికే జాగృతి ఉద్యమాల జాబితాలో ప్రథమ స్థానంలో నిలబడిన స్త్రీవాద ఉద్యమం, 1980వ దశకం చివరాంకంలో మొలకెత్తి 1990వ దశకం ప్రథమాంకానికల్లా మహావృక్షమైన దళిత ఉద్యమం మన సమాజంలోని పురుషాహంకారాన్ని, అగ్రకులతత్వాన్ని జూలు పట్టుకుని నడివీధిలోకి లాక్కొచ్చి ఆ పురుషాహంకారం, ఆ అగ్రకులతత్వం ఇక పైన చెల్లవంటూ నిష్కర్షగా తేల్చి చెప్పాయి. ఈ రెండు ఉద్యమాల స్ఫూర్తితో ఆవిర్భవించిన దళిత స్త్రీవాద ఉద్యమం  తమ మగపుంగవుల పెత్తనం; ఆడది, పేదది అందులోనూ అంటరాని కులానికి చెందినదని అలుసు తీసుకుని తమ బలుపును తీర్చుకోవాలని చూచే అగ్రకుల సైంధవుల ఆటలను కట్టి పెట్టమని, లేకుంటే చెప్పు తెగుతుందని తూటాలవంటి మాటలతో గట్టిగానే హెచ్చరించింది. ఈ ఉద్యమాల నేపథ్యంలో 'దళిత కథలు' పేరుతో కె.లక్ష్మీనారాయణ సంపాదకత్వంలో వచ్చిన ఎనిమిది సంపుటాలు; వాటితోపాటు 'ఉప్పునీళ్లు', 'ఎచ్. సరస్వతి', 'నలుపు' లాంటి అనేక కథలు; జూపాక సుభద్ర, గోగు శ్యామల సంపాదకత్వంలో వెలువడిన 'నల్ల రేగడిసాల్లు' లాంటి కథానిక సంపుటాలు దళిత కథను సుసంపన్నం చేశాయని తెలుగు దళిత కథా పరిణామంలో ఈ కథల ప్రాముఖ్యతను దార్ల గుర్తిస్తాడు. వీనితోపాటు దండోరా ఉద్యమ

నేపథ్యంలో మాదిగల జీవితం ప్రధాన వస్తువుగా వచ్చిన కథలను గురించి కూడా ఈ వ్యాసంలో ప్రస్తావించడం జరిగింది.

### కరపత్రాల నుండి కక్క నవల వరకు

ఎండిన చెరుకాకులతో మంటపెట్టి ఆ మంటలో కాపిన తప్పెటలతో మాదిగలు వేసే పదునైన దరువుకి, చేసే లయబద్ధమైన తాండవానికి ఊరంతా ఒక్కొక్కమారు వెర్రెత్తిపోతే ఒక్కొక్కమారు భయకంపితులై గుండెలు పట్టుకుంటారు. వచ్చీ రావడంతోనే వివిధ ప్రక్రియలతో సాహిత్య ఫలకంపై మాదిగలు వేసిన దరువుకి, చేసిన తాండవానికి తెలుగు సాహితీరంగం వెర్రెత్తిపోతే, ఉమ్మడి రిజర్వేషన్లలో దళితుల పేర తమ వారు తిష్ట వేసినట్లే దళిత సాహిత్యం పేర తమ కుల జీవితాన్ని, తమ కుల అజెండాను ముందుకు నెడుతున్న మాల సాహితీకారులు ఒక్కసారిగా భయభ్రాంతులయ్యారు, బిక్కచచ్చిపోయ్యారు. మాదిగ సాహిత్య సూర్య కిరణాలను చేవలేని మూడువాద చేతులతో అడ్డుకోవడానికి ప్రయత్నించారు. అవి: 1) సాహిత్యం పేర మాదిగలు రాస్తున్న రాతలు సాహిత్యమేకాదు. వారి కవిత్వం శిల్పపరంగా లోపభూయిష్టంగా ఉంది; 2) దళిత రిజర్వేషన్ల వర్గీకరణ డిమాండ్ ప్రచారం చేయడానికే మాదిగ సాహిత్యం పుట్టుకొచ్చింది; 3) మాదిగ సాహిత్యం పేరుతో ప్రత్యేక సాహిత్యంగాని, ప్రత్యేక వాదంగాని రావలసిన అవసరంలేదు. ఆ సాహిత్యం, ఆ వాదం దళిత సాహిత్యంలో, దళిత వాదంలో అంతర్భాగాలే. ఈ మూడు వాదాలను మనం జాగ్రత్తగా పరిశీలిస్తే ఒక్క విషయం స్పష్టంగా అవగతమవుతుంది. ఒక రంగంలో తిష్టవేసి దానిని శాసిస్తున్న పాతతరం కొత్తతరం తెచ్చే నవ్యతనుగాని మార్పును గాని హర్షించలేదు, ఆహ్వానించలేదు. దళిత ఉద్యమ నేపథ్యంలో వచ్చిన దళిత సాహిత్యాన్ని సంప్రదాయ, మార్క్సిస్టు సాహితీకారులు ఆహ్వానించకపోగా దానిని ఆదిలోనే అంతమొందించడానికి శతవిధాలా ప్రయత్నాలు చేశారు. అలా చేసిన ఏ ప్రయత్నమూ ఫలవంతం కాకపోగా, దళిత సాహిత్య ప్రవాహం పరవళ్లు తొక్కుకుంటూ ముందుకు దూసుకుపోయింది. అప్పటికీ తమ ప్రయత్నాలు వీడక ప్రవాహాన్ని ఆపడం సాధ్యం కాకపోతే పోయింది కనీసం దాని వేగాన్నయినా ఆపలేమా అని కొన్ని చొప్పదంటు వాదాలు అడ్డుపెట్టడం చేశారు. సరే, దళిత సాహిత్య ప్రవాహ ఒరవడిలో ఆ అడ్డులన్నీ కొట్టుకుపోయిన సంగతి సాహితీకారులందరూ ఎరిగిన విషయమే.

ఇప్పుడు రంగం మారింది. అప్పటి సంప్రదాయ, మార్క్సిస్టు సాహితీకారుల స్థానాలలో దళిత సాహితీకారులుగా చెలామణీ అవుతున్న మాల సాహితీకారులు నిలబడితే, అప్పటి దళిత సాహితీకారుల స్థానాలలో మాదిగ సాహితీకారులు నిలబడటం జరిగింది. అయితే, ఈ సమరానికి సానపట్టిన వాదకత్తులు, యుద్ధ తంత్రాలు మాత్రం పాతవే, పూర్వపు రంగానికి చెందినవే. అందుకే ముందుగా మాదిగ సాహిత్యాన్ని అసలు సాహిత్యమే కాదంటూ ప్రసేన్ పేర్కొన్నట్లుగా 'మాల దళిత కవులు ఎంచక్కా బ్రాహ్మణ భావజాల కన్యక చేలాంచలాల వెనుక కుంటుకుంటూ వెళ్లిపోయారు'.[4] భూమిపై బీజం పడినాక మొలకెత్తక మాననట్లే మాదిగ సాహిత్య బీజానికి మాల సాహితీకారులు పాదులు తీయనంత మాత్రాన దాని పెరుగుదల ఆగిపోలేదు. పైపెచ్చు వివిధ సాహితీ ప్రక్రియల సంతులిత ఎరువుతో రోజురోజుకీ ఏపుగా ఎదగడం ఆరంభించింది. మాదిగ సాహిత్యాన్ని తాము గుర్తించినా గుర్తించకపోయినా దాని ఎదుగుదల ఆపటం సాధ్యం కాదని నిర్ధారణకు వచ్చినా మాలలు, అలా ఆపలేకపోయినా కనీసం దాని పటుత్వాన్నైనా ఏదోక రూపంలో బలహీనపరచాలనే దురుద్దేశంతో కేవలం దండోరా ఉద్యమ ప్రచారమే మాదిగ సాహిత్య ఆశయ - లక్ష్య ఆద్యంతాలు అని ప్రచారం చేసి ఆ సాహిత్య పరిధిని కుదించే ప్రయత్నం చేశారు. అయితే మాదిగ కలం గూడెంలో పుట్టినప్పటికీ గూడెపు హద్దులు దాటి అణచివేతకు, అన్యాయానికి గురైన వారందరి పక్షానా కులాతీతంగా, మతాతీతంగా నిలబడటం సాహితీకారులందరికీ తెలిసిన విషయమే. తాము వెర్రి మొర్రి అనుకున్నదే ఏ రంపానికీ తెగని మర్రి వృక్షమవడంతో ఇక చేసేదేమిలేక ఆ వృక్షం కూడా దళిత సాహితీ వనంలోదే అని మాదిగ సాహిత్యాన్ని స్వంతం చేసుకోవడం మొదలుపెట్టారు దళిత సాహితీకారులమని చెప్పుకునే కొంతమంది మాల సాహితీకారులు.

మాదిగ సాహిత్యాన్ని ఇలా స్వంతం చేసుకోవడాన్ని ఆ సాహిత్యాన్ని వారు గుర్తించినట్లుగా చాలామంది భావించడానికి అవకాశముంది. అయితే నా దృష్టిలో ఇలా స్వంతం చేసుకోవడం అనేది మాల సాహితీకారులు పన్నిన మరో పన్నాగం. వృక్షం మర్రి వృక్షమైనా అది దళిత వనంలోనిదే. దళిత వనంలో మర్రి వృక్షంతోపాటు పలు వృక్షాలు ఉంటాయి. కాబట్టి ఒక్కదాని గురించి ప్రత్యేకంగా చెప్పుకోనవసరం లేదు. అయితే గియితే ఏదైనా చెప్పుకోవాలంటే ఆ వృక్షాలన్నీ ఉన్న వనం గురించి సార్వజనికంగా చెప్పుకుంటే సరిపోతుంది. వివరణలో మాదిగ సాహిత్యం దళిత సాహిత్యంలో అంతర్భాగం అని చెప్పడం ఆ సాహిత్యానికున్న ప్రత్యేకత, విశిష్టతలను కొల్లగొట్టడం లేదా తగ్గించడానికి చేసిన ప్రయత్నమే.. ఈ విషయాలన్నింటిని సవిస్తరంగా చెబుతూ మాదిగ సాహిత్య చారిత్రక పరిణామాన్ని, ఆ సాహిత్య లక్ష్య దృక్పథాలను, దాని ప్రత్యేకతలను 'దళిత సాహిత్యం: మాదిగ సాహిత్యం' అన్న వ్యాసంలో దార్ల విశ్లేషణ చేశారు.

ఈ వ్యాసంలో మూడు ముఖ్యమైన అంశాలపై దార్ల తన దృష్టిని కేంద్రీకరిస్తాడు. అవి, 1) మాదిగ సాహిత్య చారిత్రక పరిణామం; 2) మాదిగ సాహిత్య ఆశయ - లక్ష్యాలు; 3) మాదిగ సాహిత్య ప్రక్రియలు - వస్తు విషయాలు. మాదిగ సాహిత్య పరిణామం మూడు దశలలో జరిగింది. దండోరా ఉద్యమ ఆరంభంతో ఆ ఉద్యమవాదాన్ని వినిపించడమనే ఏకైక ఉద్దేశ్యంతో కరపత్రాలు, పాటల రూపంలో ప్రారంభమైన మాదిగ సాహిత్యం కవిత్వంతో ఒక కొత్త మలుపు తిరగటం ప్రాథమిక దశ. ఈ తొలి దశలో వచ్చిన సాహిత్యంలో పదునైన ఆలోచనలతో పాటు చిక్కనైన ఆవేశం కూడా ఉంది. దళిత రిజర్వేషన్ వసతులతో అధిక శాతాన్ని తమకంటే తక్కువ జనాభా కలిగిన మాలలు ఎక్కువగా వినియోగించుకోవటం ఈ ఆవేశానికి ఆధారం. కొత్తగా పట్టిన కలం కావడంతో అది ఆవేశ కట్టను తెంచి ఆలోచన పంటను ముంచెయ్యడం ఈ దశలో జరిగిన ఒక వైపరీత్యమని దార్ల నిజాయితీగా ఒప్పుకుంటారు. అయితే దళిత సాహిత్యం తొలినాళ్లల్లో దళిత కలం దళితేతరులపైనా, ఇప్పుడు మాదిగ కలం మాల కలంపై విరుచుకుపడిన దానికంటే ఎన్నో రెట్లు అధికంగా, తీవ్రస్థాయిలో ఆవేశంతో ఊగిపోయినప్పటికీ దళిత ఉద్యమాన్ని దాని కులాన్ని సమర్థించే ఒక వర్గం అప్పటికే ఏర్పడి ఉండడం, అట్టి వర్గపందిరి మాదిగ కలల మల్లెమొగ్గకు లేకపోవడంతో అది ఎదుర్కొన్న ఒడిదుడుకులను కూడా గుర్తించాలని దార్ల గుర్తుచేస్తారు. మాదిగ ఉద్యమానికి అవసరమైన భావజాలాన్ని అందిస్తూనే తమ ప్రాచీనులు తమకు అందించిన జానపద, మౌఖిక సాహిత్య వారసత్వ సంపదను తిరిగి దొరకబుచ్చుకునే ప్రయత్నంలో మాదిగ సాహితీకారులు నిమగ్నులవ్వడం వారి సాహిత్య

పరిణామంలోని రెండవ దశ. ఇక మూడవ దశ మాదిగ సాహిత్య వ్యవస్థీకృత దశ. 'మాదిగ సాహిత్య వేదిక ఏర్పడి, మాదిగలకు ఒక ప్రత్యేక సంస్కృతి ఉందని చాటి చెప్తూ, ఆత్మగౌరవంతో ప్రత్యేక సాహిత్య వాదంతో నిలబడాలనుకోవడం' ఈ దశలోని ప్రత్యేకత అని దార్ల పేర్కొంటారు.

రెండవ అంశమైన మాదిగ సాహిత్య ఆశయ – లక్ష్యాలలో, కులం పేరుతో కారంచేడు కమ్మలు జరిపిన మాదిగ మేధానికి వ్యతిరేకంగా దళిత ఆత్మ గౌరవ ఉద్యమం ఆరంభమైతే, దళిత కూటమిలో తమనే ప్రధాన కేంద్రంగా చేసుకుని మాలలు సాగిస్తున్న వివక్షకు వ్యతిరేకంగా వచ్చిందే మాదిగ ఆత్మగౌరవ ఉద్యమం. కుల నిర్మూలన, రాజ్యాధికారం అనే రెండు ప్రధానమైన అంశాల అజెండా సాధన దళిత ఉద్యమ – సాహిత్యాల ఉమ్మడి ఆశయ–లక్ష్యాలైతే; కుల వివక్ష నిర్మూలన, దళిత రిజర్వేషన్లను దళిత కులాలన్నింటికి సమ పంపిణీ, రాజ్యాధికారంలో అందరికి సమాన భాగస్వామ్యం అనే మూడు ప్రధానమైన, ప్రజాస్వామికమైన అంశాల అజెండా సాధనే మాదిగ ఉద్యమ – సాహిత్యాల ఉమ్మడి ఆశయ–లక్ష్యాలని దార్ల స్పష్టంగా ప్రకటిస్తారు. ఈ విస్పష్ట ప్రకటనతో మాదిగ సాహిత్యం దళిత సాహిత్యంలో అంతర్భాగమని సనిగే నోళ్లకు గొళ్లాలు వేసి, మాదిగ సాహిత్య స్వతంత్రతను, ప్రత్యేకతలను చాటుతారు.

మాదిగ సాహిత్య స్వతంత్రతను కేవలం ప్రకటించడంతోనే సరిపెట్టుకోక అట్టి స్వతంత్రతను చాటుకునే శక్తి ఆ సాహిత్యానికి ఏ విధంగా ఉందన్న విషయాన్ని ఈ వ్యాసంలో మాదిగ సాహిత్య ప్రక్రియలు – వస్తు విషయాలు అనే మూడవ అంశంలో దార్ల సమన్వయించి చూపారు. దీన్ని బట్టి నిజానికి దళిత సాహిత్యం అని ఇంతవరకూ పిలవబడుతున్నదంతా మాదిగ సాహిత్యమే అని స్పష్టం చేస్తున్నారు. ఈ ప్రతిపాదన చాలా ముఖ్యమైంది. లోతుగా దీన్ని చూస్తే మాదిగ సాహిత్యంలో అంతర్భాగంగానే దళిత సాహిత్యం ఉండవలసి వస్తుంది. ఇది యావత్తు తెలుగు సాహిత్య విభజననే మార్చే ప్రతిపాదన. దీన్ని దార్ల చాలా జాగ్రత్తగా ప్రతిపాదించి సమన్వయించారు. దళిత సాహిత్యం పేరుతో ఎవరు రాసినా మాదిగల జీవితం, మాదిగల వృత్తులు, మాదిగ పనిముట్లే కనిపిస్తాయనేది దార్ల ప్రతిపాదన. ఇది నిజం. ఇప్పటికే ప్రాచుర్యంలోకి వచ్చిన వాటిని ఇక్కడ మాదిగ సాహిత్యంలోని నాలుగు ప్రధానమైన ప్రక్రియల ఆధారంతో ఆ సాహిత్య శక్తి ప్రదర్శన చేయడం జరిగింది. అవి – కవిత, కథానిక, నవల, వ్యాసం. వీటిలో మొదటి ప్రక్రియ అయిన మాదిగ కవిత్వాన్ని తీసుకుంటే, కవితలలో వ్యక్తమైన వస్తువు ఆధారంగా మాదిగ కవితను మూడు రకాలుగా విభజింప వచ్చును. వర్గీకరణ డిమాండ్ చేసే కవితలు మొదటివి. 'మాదిగోడు', 'మాదిగ మానిఫెస్టో' 'వర్గీకరణీయం', 'దండోరా' లాంటి కవితలు ఈ కోవకు చెందుతాయి. మాదిగల వర్గీకరణ డిమాండ్‌ని వ్యతిరేకిస్తూ, మాదిగ మల్లె మొగ్గలను దళిత వనంలో పూసిన గంజాయి మొక్కలుగా తులనాడుతూ 'ఏకీకరణీయం', 'నీలి పతాక' లాంటి మాలలు రాసిన కవితా రాతలకు సమాధానంగా మాదిగలు రాసిన కవితలు రెండవ కోవకు చెందుతాయి. 'నల్లద్రాక్ష పందిరి', 'మాకొద్దు ఈ మాల దొరతనం' లాంటి కవితలు ఈ రెండవ కోవలో ప్రధానమైనవి. మాదిగ సంస్కృతిని, ఆ సంస్కృతి ఔన్నత్యాన్ని చాటిచెప్పే కవితలు మూడవ కోవకు చెందుతాయి. ఈ కోవలో 'చండాల చాటింపు', 'చెప్పులకు నమస్కరిస్తున్నాను', 'గూటెం దెబ్బ', 'ఎర్కోషి' లాంటి కవితలను ముఖ్యంగా చెప్పుకోవచ్చు.

మాదిగ సాహిత్య కవిత మాదిరి మాదిగ సాహిత్య కథానికలను కూడా రెండు రకాలుగా విభజింపవచ్చును. గత, వర్తమాన మాదిగ జీవితాన్ని, ఆ జీవన సంఘర్షణను ప్రతిఫలించే కథనాలు ఒక కోవకి చెందగా, మాదిగ కుల పౌరాణిక వారసత్వాన్ని, ఆ వారసత్వంలో గల కుట్రను కూడా విప్పి చెప్పే కథానికలు రెండవ కోవకి చెందుతాయి. 'మాదిగోడు', 'మల్లెమొగ్గల గొడుగు (మాదిగ కథలు)', 'కులవృత్తి', 'నల్లరేగడి సాల్లు' – లాంటి కథలు మొదటి రకానికి ఉదాహరణలు కాగా, 'జాంబవంతుడు – పిచ్చిమామ', 'ఆరంజోతి' లాంటివి రెండవ కోవకు ఉదాహరణలు. మాదిగ సాహిత్యం సృష్టించిన నవలలో 'జాతర', 'గద్దలాడతాండాయి', 'కక్క', నవలలు ముఖ్యంగా పేర్కొనదగినవి.[5] కరువు కాటకాలు, రెడ్ల సామాజిక, ఆర్థిక, రాజకీయాధిపత్యాల రాయలసీమలో మాదిగ జీవితాన్ని వారి సంఘర్షణలను చిత్రించిన నవల 'గద్దలాడతాండాయి'. అయితే తెలంగాణ మాదిగల జీవన సంస్కృతి, ఆచార వ్యవహారాలు, దళితుల్లోని అనైక్యత, దళిత ఆత్మగౌరవ పోరాటంలో భాగంగా పురివిప్పిన మాదిగ చైతన్యాన్ని చిత్రించిన నవల 'కక్క'.[6] మాదిగ అస్తిత్వాన్ని స్థిరీకరించే ప్రయత్నం ఈ నవలల్లో చాలా వరకూ జరిగిందని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఈ విధంగా మాదిగ సాహిత్యం దళిత సాహిత్యంలో అంతర్భాగంగా ఆరంభమైనప్పటికీ, ఆ సాహిత్యం తడిమిన పలు ప్రక్రియల, వస్తు వైవిధ్యాల దృష్ట్యా చూచినప్పుడు దానికంటూ ఒక స్వంత అస్తిత్వం, ప్రత్యేకతలు ఉన్నాయని ఈ వ్యాసంలో దార్ల మాదిగ సాహిత్య స్వతంత్ర బావుటాను దశదిశాంతాలలో ఎగురవేస్తారు.

మాదిగ సాహిత్యంలోని మరొక ప్రక్రియ వ్యాసం. మాదిగల భావాలను స్పష్టంగా, సరళంగా చెప్పడానికి అత్యవసరంగా కావలసిన ప్రక్రియగా వ్యాసాన్ని మాదిగ సాహితీకారులు గుర్తించారు. దానిలో భాగంగానే వ్యాసాన్ని బలమైన ఆయుధంగా వాడుకున్నారు. దళిత రిజర్వేషన్‌లలో మాదిగలకు జరిగిన సామాజిక అన్యాయాన్ని వివరిస్తూ, రిజర్వేషన్‌ల వర్గీకరణ దళిత కూటమిలోని కులాలన్నిటికి ఏ విధంగా సామాజిక న్యాయానికి తొలి అడుగు కాగలదోనన్న విషయం ప్రధానంగా మాదిగ సాహితీకారులు, మేధావులు పత్రికలలో, వివిధ మేగజైన్‌లలో, ఇంకా బుక్‌లెట్ల రూపంలో ఎన్నో వ్యాసాలను ప్రచురించారు. అలా ప్రచురించిన వారిలో చింతాడ గౌరీ వరప్రసాద్ ('మాదిగలు మేల్కొన్నారు', 'మాదిగలకేం కావాలి', 'మాదిగల ఆత్మగౌరవ పోరాటం'), కృపాకర్ మాదిగ ('మాదిగ దండోరా – ఏడు వ్యాసాలు'), పోలుపొంగు ముత్తయ్య ('ఎస్సీలలో వర్గీకరణ ఎందుకు?') కొలకలూరి ఇనాక్ ('ఎస్.సి.ల వర్గీకరణ రాజ్యాంగబద్ధమే') మున్నగువారు ముఖ్యులు. మాదిగ దండోర – మాల మహానాడు వర్గీకరణ వాద–వివాదాలను ఒక చోటచేర్చి వర్గీకరణ అంబేద్కర్ దృక్పథానికి వ్యతిరేకమంటూ మాలలు, మాల మహానాడు సభ్యులు వాదించిన వాదనలన్నీ వాస్తవానికి అంబేద్కర్ దృక్పథానికి వ్యతిరేకమని, నిజమైన అంబేద్కర్ దృక్పథం వర్గీకరణను కోరుకుంటుందని 'బ్రాహ్మణత్వ మాలత్వమా...? మానవత్వ అంబేద్కరత్వమా..? (వర్గీకరణ సమస్యపై చర్చ)' పేరు ఒక సంక్షిప్త పుస్తకాన్ని నేను రాశాను. ఆ పుస్తకాన్ని విశ్లేషిస్తూ దార్ల రాసిన వ్యాసమే 'వర్గీకరణ వాదానికి శాస్త్రీయ దృక్పథం'.

దార్ల వ్యాసంలోని విషయాలను ప్రస్తావించే ముందు ఇక్కడ ఒక్క విషయాన్ని చెప్పాలి. సి.ఆర్. శేఖర్ రాసిన 'దళిత శక్తిని అంతమొందించే రాజకీయ కుట్రే వర్గీకరణ: పావులుగా మారిన మాదిగ దండోరా నాయకులు' అనే ఒక సంక్షిప్త పుస్తకాన్ని లండన్‌లో ఉన్న నాకు నా

మిత్రుడు శ్రీధర్ మోదుగు హైదరాబాద్ నుండి పోస్టు చేశాడు. దళిత కూటమికి ఉమ్మడిగా ఇచ్చిన కోటా కుండలోని నీళ్లను మాలలు, ఆది-ఆంధ్రులే తాగడం సరికాదని, ఆ కుండలోని నీళ్లను కూటమిలో భాగమైన వారందరికీ భాగం పంచాలని మాదిగలు, రెల్లిలు అడిగారన్న ఉక్రోషంతో రాసిన బూతుల దండకమే కాని విషయం శూన్యమని ఆ పుస్తకాన్ని చదివిన వారెవరైనా అంగీకరించే సత్యం. అంతవరకు మాలల ఆగడాలను మౌన మునులై భరించిన మాదిగలు ఈ పుస్తకం వచ్చిన తరువాత రాతపూర్వకంగా కాకపోయినా మాట పూర్వకంగా మాలలకు వ్యతిరేకంగా పరుష పదజాలాన్ని వాడారని తెలిసి నేను చాలా బాధ పడ్డాను. వీరు వారు పరస్పరం వాదులాడుకుంటూ గడిపితే ఇక వీరిరువురి కథ ఒక కోతి, రెండు పిల్లులు ఒక అట్టుముక్క కథ అవుతుందని నా పి.ఎచ్‌డి. పనిని తాత్కాలికంగా పక్కన పెట్టి నా పుస్తకాన్ని రాసాను. హైదరాబాద్‌లో ఉన్న నా మిత్రులు కోటేశ్వరరావు మన్నం, మోదుగు ఈ పుస్తకాన్ని బయటకు తీసుకురావడానికి చివరి వరకు తోడుగా ఉన్నారు. పుస్తక ఆవిష్కరణ కోసం ఆంధ్ర వచ్చి అది అయిన వెంటనే నేను తిరిగి లండన్ వెళ్లిపోయాను. ఈ పుస్తకం మార్కెట్టులోకి వచ్చిన తరువాత మన్నానికి, ముందుమాట రాసిన దార్లకు ఎంతోమంది ఫోన్లు చేసి పేర్లు చెప్పకుండా బూతులు తిట్టడంతోపాటు చంపేస్తామని కూడా ఎన్నోసార్లు బెదిరించారు. అక్కడికీ దార్ల కొంత సమన్వయంతో తమ వాదనలను పుస్తకంగానో, వ్యాసంగానో రాసుకోవచ్చని చెప్పినా వినకుండా దాదాపుగా ఆరు నెలలపాటు అతనిని మానసికంగా హింసించారు. ఈ మొత్తం ప్రహసనంలో వర్గీకరణ వ్యతిరేకుల బారిన పడనిది లండన్‌లో ఉన్న నేను, కోమటి కులానికి చెందిన మా మోదుగు.

ఇక దార్ల వ్యాస విషయానికి వస్తే, మాల మహానాడు వర్గీకరణ వ్యతిరేక వాదనలలో ప్రధానమైన తొమ్మిది వాదనలు తీసుకుని అంబేద్కర్ దృక్పథ వెలుగులో వాటిని నేను తిప్పి కొట్టడం చేశాను. ఆ తిప్పికొట్టడంతో పాటు మాదిగలు, వీరితోపాటు ఇతర దళిత కులాల సమగ్రాభివృద్ధికి, కుల నిర్మూలనకు కొన్ని ప్రతిపాదనలు కూడా నేనా పుస్తకంలో చేశాను. పుస్తక అసాంతం విస్తరించుకున్న ఆ ప్రతిపాదనలను ఏరి అయిదింటిని మరింత లోతుగా గుర్తించవలసిన అంశాలుగా దార్ల వివరించారు. అవి :

1) దండోరా ఉద్యమ స్ఫూర్తితో తమ పేర్ల చివరన పై నాలుగు వర్ణాల మాదిరే తమ కులం పేరు పెట్టుకొనడాన్ని హిందూత్వం తమపై రుద్దిన మాదిగ కులాన్ని అంగీకరించడమని, అది కుల నిర్మూలనకు అమరణాంతం పోరాటం చేసిన అంబేద్కర్‌ను అవమానించడమేనని మాల మహానాడు వారు ఆక్షేపిస్తారు. వర్గీకరణ వ్యతిరేకోద్యమానికి 'మాల' మహానాడు అని తమ కులం పేరును స్వయంగా వారే పెట్టుకుని మాదిగలు అంబేద్కర్‌ని అవమానిస్తున్నారు అని మాలలు అనడం వెగటు కలిగించే ఆక్షేపణ. సరే, వీరి ఆక్షేపణ ఎలా ఉన్నా, కుల నిర్మూలన జరగాలంటే ముందు కుల బాధితులు కులం నుండి బయటపడాలి. అలా బయటపడాలంటే ముందు కూరుకున్న కుల ఊబి అనే సమస్యలో నుండి బయటపడాలి. పేరు చివరన మాదిగను చేర్చుకోవడం అనేది కులతత్వంపై తిరుగుబాటుకు సూచన, కుల ఊబినుండి బయట పడేందుకు వేసిన తొలి అడుగు.

2) వర్గీకరణతో దళితుల సమస్యలన్నీ తీరిపోవు. అయితే వారి సమస్యల పరిష్కారంలో అది మొదటి మెట్టు. రాజ్యాంగం దళితులకు కల్పించిన అవకాశాలను దళితులలోని దళితులు అందుకోవాలంటే అవసరమైతే క్రీమిలేయర్ విధానాన్ని కూడా పాటించాలి.

3) విద్యారంగంలో సంస్కరణలు తెచ్చి ఆధునిక విద్యను అందరికి అందించాలి. అది జరగనంతవరకు అగ్రకులాల మధ్య అణచివేతకు గురికాబడిన కులాల మధ్య ప్రతిభాపాటవాల అంతరాల దొంతరలు కొనసాగుతూనే ఉంటాయి గాని వాటికి అంతం ఉండదు. పైగా దళితులకు సామాజికంగా వెనుకబడిన ఇతర వెనుకబడిన వర్గాలకు రిజర్వేషన్‌ల రూపంలో ఎన్ని రాయితీలు కల్పించినా వారి లక్ష్యం నెరవేరదు.

4) ప్రభుత్వ రంగంలో ఉపాధి అవకాశాలు అడుగంటి కేవలం ప్రైవేటు రంగంలోనే ఆ అవకాశాలు ఉన్న దరిమిలా ప్రైవేటు రంగంలో రిజర్వేషన్‌ల డిమాండ్ సాధనకై దళితులంతా ఉమ్మడిపోరాటం చేపట్టాలంటే వర్గీకరణ సమస్యను పరిష్కరించుకున్నప్పుడే అది సాధ్యమవుతుంది. ఒకవేళ వర్గీకరణ సమస్య పరిష్కారం జరగకుండానే దళితులకు ప్రైవేటు రంగంలో రిజర్వేషన్‌లు కల్పిస్తే అది మాదిగ ఇత్యాది దళితులలోని దళితులకు సామాజిక అన్యాయ కొనసాగింపే అవుతుంది.

5) రాజ్యాధికారంలో జనాభా నిష్పత్తి ప్రకారం ప్రతి కులానికి భాగస్వామ్యం కల్పించినప్పుడే ఇప్పుడున్న కుల రాజ్యం స్థానంలో ప్రజారాజ్యం అవతరించేది.

ఈ విధంగా మాదిగ సాహిత్యం సృజించిన ప్రతి సాహితీ ప్రక్రియను తక్కెడలో తూచినట్లుగా ఒక నిబద్ధతతో విశ్లేషించి, తెలుగు సాహితీ ఫలకంపై మాదిగ సాహిత్యానిది ఒక కొత్త దరువుగా మాదిగ సాహిత్య స్వతంత్ర ప్రత్యేకతల జెండాను దార్ల ఎగురవేస్తారు.

*(మిగతా వచ్చే సంచికలో)*

**పాదసూచికలు**

1. రాములు, బి.ఎస్. 2003, 50 ఏళ్ల తెలుగు కథ తీరుతెన్నులు, హైదరాబాద్, విశాల సాహిత్య అకాడమి, పే. 86
2. వెంకటేశ్వరరావు, దార్ల, 2009, దళిత సాహిత్యం, మాదిక దృక్పథం (సాహిత్య విమర్శ వ్యాసాలు), హైదరాబాద్, దండోర ప్రచురణలు.
3. రాములు, బి.ఎస్. 2003, 50 ఏళ్ల తెలుగు కథ తీరుతెన్నులు, పే. 163
4. ప్రసేన్. 1996. 'మాల బ్రాహ్మల దళితదాష్టీకం!', ఆంధ్రభూమి, 6 అక్టోబర్
5. దండోరా నేపథ్యంలో మాలల దృష్టికోణం నుండి మాదిగ చైతన్యాన్ని చెప్పిన నవల 'మాదిగ పల్లె'. అయితే ఈ నవలకు మాదిగ పల్లె అనే పేరు కంటే మాల పల్లె అని పేరు పెడితే చక్కగా సరిపోయేది. కథా నాయకుడు మాల కులానికి చెందినవాడు, కథనం అంతా ఆ నాయకుడు, అతని కుటుంబం చుట్టూ పరిభ్రమిస్తూ, మాలల పోరాట పటిమ, సాహసాల గురించి చెప్పిన నవల. మాదిగలలో అటువంటి నాయకత్వం, దీక్ష దక్షతలు ఉన్నట్లు మచ్చుకైనా చెప్పదు ఈ నవల. రాయుడు చెప్పినట్లుగా మాల కులానికి చెందిన నరసయ్య మాదిగ పల్లె నవల రాసి తెలిసో, తెలియకో తమ కులానికి మాదిగల పై గల అభిప్రాయాన్ని వెల్లడించారు. చూడండి, రాయుడు, కె.ఎం. 2003. స్వైర కల్పనగా మారిన 'మాదిగ పల్లె', చంద్రశేఖరరెడ్డి, రాచపాళెం, కె. లక్ష్మీనారాయణ (సం.) 1980 తర్వాత తెలుగు దళిత నవల (వ్యాస సంకలనం), అనంతపురం, లక్ష్మీ గ్రాఫిక్స్, పే. 73
6. 'కక్క' నవలపై చక్కని విశ్లేషణ కొరకు చూదండి, ననూమాసస్వామి, 2003, 'దళిత సాంస్కృతిక నేపథ్య ప్రతిబింబం కక్క', చంద్రశేఖరరెడ్డి, రాచపాళెం, కె. లక్ష్మీనారాయణ (సం.) 1980 తర్వాత తెలుగు దళిత నవల (వ్యాస సంకలనం), అనంతపురం, లక్ష్మీ గ్రాఫిక్స్, పే. 82-97

వ్యవసాయాన్ని కుంటుపరిచే పరిశ్రమలు కాకుండా వ్యవసాయేతర భూములలో, వెనుకబడిన ప్రాంతాలలో పరిశ్రమలూ, సెజ్‌లూ నెలకొల్పాలని అంటున్నారు **లింగబత్తిని మల్లేష్, పిట్ట నర్సింగం**

# పంట పొలాల్లో పరిశ్రమలా?

మన రాష్ట్ర ప్రభుత్వం డెబ్బై ఏడు ప్రత్యేక ఆర్థిక మండలాలకు లక్షల ఎకరాల భూమిని సేకరిస్తోంది. వీటితో పాటుగా మెగా కెమికల్ పార్కులు, థీంపార్కులూ, ఇండస్ట్రియల్ పార్కుల పేరుతో లక్షలాది ఎకరాల భూమిని లాక్కుంటోంది. ఇప్పుడు కొత్తగా శ్రీకాకుళం నుంచి నెల్లూరు వరకు ఉన్న తొమ్మిది జిల్లాల్లో 1585 చదరపు కిలోమీటర్ల తీర ప్రాంతంలో కోస్టల్ ఇండస్ట్రియల్ కారిడార్‌ను ఏర్పాటు చేసే ఉద్దేశంతో జి.ఒ. నెం. 34ను విడుదల చేసింది.

అయితే కోస్తా ప్రాంతాల ప్రజలకు కారిడార్ అంటే ఏమిటో తెలియదు. ప్రత్యేక ఆర్థిక మండలాలు అంటే ఏమిటో తెలియదు. ప్రభుత్వానికి భూమి కావాలట. భూమి ఇస్తే మేం ఎలా బతకాలి? ఇవ్వకుంటే బలవంతంగా లాక్కుంటారట. తాత ముత్తాతలు సంపాదించి పెట్టిన భూములను, ఇళ్లను వదిలిపెట్టి మేం ఇతర ప్రాంతాలకు వలస వెళ్లేందుకు ఒప్పుకోం అంటున్నారు. సారవంతమైన భూములు, నీటి పారుదల సౌకర్యాలు ఉన్న భూములనే కారిడార్‌ల ఏర్పాటుకు ప్రభుత్వం ఎందుకు ఎంచుకున్నట్లో అర్థం కావడం లేదని కోస్తా వాసులు వాపోతున్నారు.

గ్రామీణ రైతుల, రైతు కూలీల జీవితాలను ఛిద్రం చేసి, వారి సహజ హక్కులను కాలరాచి, వారి భూములను కైవసం చేసుకొని, గుత్త పెట్టుబడిదారులకు వాటిని కట్టబెట్టడం మన పాలకులకు పరిపాటి అయింది. కారిడార్‌ల కోసం భూమి సేకరణ, మౌలిక వసతుల కల్పన, పెట్టుబడుల సేకరణ, అవసరమైన అనుమతుల సాధనను పూర్తి చేసేందుకు ఒక ప్రత్యేక సంస్థను ప్రభుత్వమే ఏర్పాటు చేసి దాని నిర్వహణకు రెండు వేల కోట్ల రూపాయలను కేటాయించింది. ప్రత్యేక ఆర్థిక మండలాలను ప్రభుత్వ, ప్రైవేట్ భాగస్వామ్యంతో నిర్వహిస్తున్నట్లు చెపుతున్నప్పటికీ లాభాలు గుత్తపెట్టుబడిదారులకు చెందుతాయి. కాని ప్రభుత్వాలకు లాభాల్లో వాటా ఉండదు. ప్రభుత్వ ఆదాయ మార్గాలు మూసుకుపోయి ఆర్థిక సంక్షోభం ఏర్పడే ప్రమాదం కూడా ఉంటుంది.

కోస్తా కారిడార్ మొదటి దశలో విశాఖపట్నం నుంచి తూర్పు గోదావరి వరకు 613 చదరపు కిలోమీటర్ల ప్రాంతంలో 1,50,000 ఎకరాల భూమిని సేకరించి పెట్రోలియం, కెమికల్స్, పెట్రోకెమికల్స్ ఇన్వెస్ట్‌మెంట్ రీజియన్‌లను ఏర్పాటు చేస్తారు. ఇదే విధంగా బందరు ఓడరేవు నిర్మాణం పేరిట మైటాస్ కంపెనీకి 6,200 ఎకరాలు, గాయత్రి పవర్ కార్పొరేషన్ కు 3,000 ఎకరాలు, అంబానీ పవర్ కార్పొరేషన్, ఎన్.టి.పి.సి. కాగితపు పరిశ్రమ, సోడాయాష్ పరిశ్రమలకు సెజ్‌ల పేరుతో వేల ఎకరాల భూములను కేటాయిస్తున్నారు. నిజాంపట్నం పోర్టు పారిశ్రామిక కారిడార్ పేరిట 28 వేల ఎకరాలను సేకరించడానికి పథకాలు రూపొందించారు.

ప్రపంచ బ్యాంక్ ఆదేశాల అమలులో భాగంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మన వ్యవసాయాన్ని విధ్వంసం చేయదలచుకున్నాయి. రెండు మూడు పంటలు పండే సారవంతమైన భూములను, నీటి వనరులు, రవాణా సౌకర్యాలు ఉండే భూములను స్వాధీనం చేసుకొని రైతులను గెంటివేసే పథకాలు రూపొందించారు.

రియల్ ఎస్టేట్ వ్యాపారస్తులు ఔటర్ రింగ్ రోడ్, బైపాస్ రోడ్‌ల పేరుతో నగరాలు, పట్టణాల చుట్టూ ఉన్న గ్రామాలలో సుమారు ఐదు లక్షల ఎకరాలను అత్యంత తక్కువ ధరకు స్వీకరించారు. కోస్టల్ కారిడార్ పేరుతో ఐదు లక్షల ఎకరాలను పాలకులు స్వాధీనం చేసుకుంటున్నారు.

ప్రత్యేక ఆర్థిక మండలాల పేరుతో మరొక ఆరు లక్షల ఎకరాలను సేకరించబోతున్నారని తెలిసింది. ఇప్పటికే 28 లక్షల ఎకరాల భూములను రకరకాల పేర్లతో వ్యవసాయం నుంచి దూరం చేశారు. ఇంతే కాకుండా ఇంకా కొన్ని నష్టాలు ఉన్నాయి.

1. ప్రత్యేక ఆర్థిక మండలాలలో గానీ, కారిడార్‌లలో గానీ పనిచేసే కార్మికులకు, ఉద్యోగులకు 'సంఘాలు' పెట్టుకొనే హక్కు ఉండదు. సమ్మెలు చేసే హక్కు కూడా ఉండదు.
2. ఈ పరిశ్రమలలో ఏర్పర్చే సాంకేతిక పరిజ్ఞానం దృష్ట్యా ఉన్నత సాంకేతిక చదువులు చదువుకొన్న వారికి మాత్రమే ఉద్యోగ అవకాశాలు వస్తాయి.
3. మాజీ సైనికోద్యోగుల పిల్లలకుగానీ, పోలీసులకు గానీ, సెజ్‌లలోకి, పరిశ్రమలలోకి ప్రవేశం లేదు.
4. ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లు కావాలనే డిమాండ్ వీటికి వర్తించదు.
5. ఈ పరిశ్రమల్లో యాజమాన్యాల ఇష్టాయిష్టాలపై ఆధారపడి ఉద్యోగాలివ్వటం తీసివేయటం జరుగుతుంది.
6. కార్మిక చట్టాలుగానీ, కార్మిక శాఖగానీ, కార్మిక కోర్టులు లాంటివి ప్రేక్షకపాత్ర వహించే అవకాశం ఉంటుంది.
7. ఈ పరిశ్రమల్లో ఉద్యోగం ఇప్పించే అధికారం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు లేదు. ప్రభుత్వాల జోక్యం చాలా పరిమితంగా ఉంటుంది.
8. కార్మికులకు, ఉద్యోగస్తులకు మెరుగైన వేతనాలు, సౌకర్యాలు, వసతులు వంటి పరిస్థితుల గురించి అడిగే హక్కు ఉండదు.

వ్యవసాయ రంగాన్ని పటిష్టం చేయడానికి సహకారాన్ని పెంపొందించడమే కాక వైద్యనాథన్ కమిటీ సిఫార్సులు అమలు చేయాలంటున్నారు **దాసరి సత్యనారాయణ**

# రాష్ట్ర వ్యవసాయాభివృద్ధి - ఒక పరిశీలన

దేశ ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయరంగానికి చాలా ప్రాముఖ్యత ఉంది. దేశ పురోగతికి పారిశ్రామికీకరణ ముఖ్యమైనదే అయినా పారిశ్రామిక గతిని నిర్ణయించేది వ్యవసాయరంగపు మిగులేనని చెప్పవచ్చు. ముఖ్యంగా దేశం దీర్ఘకాలికాభివృద్ధి సాధించటానికి వ్యవసాయాభివృద్ధి చాలా అవసరం. ఏ దేశమైన ఒకప్పుడు వ్యవసాయ ప్రాధాన్యత ఉన్న దేశమే. అవి పారిశ్రామికంగా అభివృద్ధి చెందాలన్నా, ఆర్థికాభివృద్ధి సాధించాలన్నా, మొదట వ్యవసాయరంగంలో అభివృద్ధి సాధించడం తప్పనిసరి అని చెప్పవచ్చు. నేడు అభివృద్ధి చెందుతున్న దేశాలలో ముఖ్యంగా దక్షిణాసియా దేశాలలో దీర్ఘకాలిక ఆర్థికాభివృద్ధి జరగాలంటే అక్కడ ఉండే వ్యవసాయరంగం అభివృద్ధిపైనే ఆధారపడి ఉంటుందని 'గున్నార్ మిర్డాల్' వాఖ్యానించడం అతియోశక్తి కాదేమో! మన భారత ప్రభుత్వం మొదటి పంచవర్ష ప్రణాళికా కాలం (1951-56) నుండి వ్యవసాయరంగానికి ప్రాధాన్యత ఇస్తూ వస్తోంది.

ఆహార ధాన్యాలు, పప్పుధాన్యాలు, నూనె విత్తనాలు మనదేశ అవసరాలకు అనుగుణంగా మనం ఉత్పత్తి చేసుకోవాలని భారత ప్రభుత్వం భావిస్తోంది. ప్రధానమంత్రి డా. మన్మోహన్‌సింగ్ అధ్యక్షతన ఢిల్లీలో 2007 మే 29న జరిగిన జాతీయ అభివృద్ధి మండలి సమావేశంలో తీసుకొన్న నిర్ణయం మేరకు వ్యవసాయ ప్రధానమైన రాష్ట్రాల్లో పంటల ఉత్పత్తిని పెంచేందుకు కేంద్రం సహకరించాలని నిర్ణయించారు. ఇందుకోసం వ్యవసాయ ఉత్పత్తులు గణనీయంగా పెంచేందుకు అవకాశం ఉన్న రాష్ట్రాల్లో ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్, కేంద్ర వ్యవసాయ శాఖామంత్రి శరద్‌పవార్, ప్రణాళికా సంఘం డిప్యూటీ ఛైర్మన్ మాంటెక్‌సింగ్ అహ్లూవాలియాలతో పాటు వ్యవసాయ, అనుబంధ శాఖల అధికారులు పర్యటించాలని నిర్ణయించారు. ఈ నిర్ణయాన్ని అమలు చేయడంలో భాగంగా మొట్టమొదట జూలై 31న వీరు ఆంధ్రప్రదేశ్ పర్యటించారు. హైదరాబాద్‌లో జరిగిన సమీక్షా

---

9. వ్యవస్థాపక నియంతృత్వం ఏర్పడుతుంది. సెజ్‌లు స్వతంత్ర సంస్థానాలుగా చెలామణి అయ్యే అవకాశం ఉంటుంది. ఆర్థిక స్వాతంత్ర్యం సెజ్‌ల చేతుల్లో ఉంటుంది.

భూములిచ్చి డబ్బు తీసుకున్నవారి జీవితాలు బ్రహ్మాండంగా ఉన్నాయని మనలను పాలకులు ప్రలోభ పరుస్తున్నారు. ప్రస్తుతానికి ఆకర్షితులవుతున్నా భవిష్యత్తుకు భరోసాలేదు. భూ సంస్కరణలు గనుక అమలు జరిపితే భూములు కోల్పోవలసి వస్తుందని కొంతమంది భూస్వాములు కారిడార్‌ల ఏర్పాటును స్వాగతిస్తున్నారు. మేధావులు ఆర్థికవేత్తలు, సారవంతమైన భూములను, నీటిపారుదల సౌకర్యం ఉన్న భూములను పరిశ్రమలకు అంటగట్టకూడదని ప్రభుత్వానికి సూచిస్తున్నారు.

- ఇటీవల మహారాష్ట్ర ప్రభుత్వం రిలయన్స్ కంపెనీకి 35 వేల ఎకరాల భూమిని కేటాయించడానికి ప్రయత్నించగా రైతాంగం ప్రతిఘటించింది.
- బెంగాల్‌లో నందిగ్రాం ప్రజలు ఐక్యంగా నిలబడి స్థానిక పాలకుల మెడలు వంచి ప్రత్యేక ఆర్థిక మండలాలను రద్దు చేయించుకున్నారు.
- గోవా రాష్ట్రంలో రైతాంగం, ప్రజానీకం ఒక్క తాటిపై నిలబడి ఐదు వందల కోట్లతో చేపట్టిన కంపెనీ పనులను నిలుపుదల చేసి సెజ్‌లను రద్దు చేయించుకున్నారు.
- తూర్పు గోదావరి జిల్లా కొత్తపల్లి మండలం శ్రీరాంపురం గ్రామంలో ప్రభుత్వ అధికారులు అక్రమంగా రైతుల భూములలోకి చొరబడి పంటలు నాశనం చేసి ఆ భూమిని కంపెనీ యజమానికి అప్పజెప్పటానికి వస్తే ఆ గ్రామ ప్రజలందరూ ఐక్యంగా నిలబడి అధికారులను నిర్బంధించారు. పాడు చేసిన పంటకు పరిహారం పొందిన తరువాతనే వారిని వదిలివేశారు.

పశ్చిమ బెంగాల్ నుండి గుజరాత్‌కు వెళ్లిన టాటా నానో కార్ల కంపెనీకి అక్కడా చుక్కెదురే అయింది. కనుక పాలకులు, అధికారులు, దళారులు పచ్చని పంటలు, పాడి పరిశ్రమను అందించే భూములను వ్యవసాయరంగానికి వదిలిపెట్టి ఎడారి భూములను, పీఠ భూములను, మెట్ట ప్రాంతాలను, బీడు భూములను పారిశ్రామిక రంగానికి అప్పజెప్పే ప్రయత్నం చేయాలి. కాని వ్యవసాయ భూములను 'కారిడార్'ల పేరిట నాశనం చేయడం సమంజసం కాదు.

ఈ దేశానికి పారిశ్రామికీకరణ అవసరమే. నిరుద్యోగులకు ఉద్యోగ అవకాశాలు కావాల్సిందే. ఆర్థిక పరిపుష్టి కోసం వ్యవసాయ పారిశ్రామిక రంగాలకు ప్రభుత్వాలు ప్రాధాన్యత ఇవ్వాలి. కాని వ్యవసాయ భూములను 'సెజ్'లకు అప్పగించకూడదు. ప్రత్యామ్నాయ మార్గాలను కనిపెట్టి ఆర్థిక మండలాలను ఏర్పాటు చేయాలి. ఈ విషయంలో వెనుకబడిన ప్రాంతాలను పారిశ్రామిక మండలాల ద్వారా అభివృద్ధి పరిచే ప్రయత్నం ప్రభుత్వం చేయాలి. ప్రపంచబ్యాంక్ ఆలోచననే అమలుపరచడం ముఖ్యం కాదు. మన బుర్రలకు పదునుపెట్టి మన ఆలోచనలను అమలు జరపాలి. వీ

సమావేశంలో ఈ అంశంపై ముఖ్యమంత్రి డాక్టర్ వై.యస్.రాజశేఖర్‌రెడ్డి గారితో పాటు సంబంధిత మంత్రులు, అధికారులతో కూలంకుషంగా చర్చించారు. పదకొండో పంచవర్ష ప్రణాళికలో (2007-12) వ్యవసాయరంగానికి అత్యంత ప్రాధాన్యత ఇవ్వాలని కేంద్రప్రభుత్వం నిర్ణయించింది. రెండు అంశాలపై ప్రధానంగా దృష్టి కేంద్రీకరించారు. జాతీయ ఆహార భద్రత మిషన్ ఏర్పాటు చేయడంతో పాటు వరి, గోధుమ, పప్పుధాన్యాల ఉత్పత్తులను పెంచేందుకు 25,000 కోట్ల రూపాయలు అదనపు కేంద్ర సహాయంగా ఇవ్వాలన్నవి అందులో అంశాలు.

గ్రామీణ ప్రాంత ప్రజల జీవన ప్రమాణాలను పెంచడంతో పాటు ఆహార ధాన్యాల ఉత్పత్తిని గణనీయంగా పెంచాలన్నది జాతీయ ఆహార భద్రతా మిషన్ ప్రధాన లక్ష్యం. ఈ పథకం కింద వరి, గోధుమ, పప్పుధాన్యాల ఉత్పత్తిపై దృష్టి సారిస్తారు. 1970-80 సంవత్సరాల్లో ఆహారధాన్యాల వార్షిక వృద్ధిరేటు రెండు శాతం ఉండగా, 1995-2007 మధ్యకాలానికి ఇది ఒక శాతానికి పడిపోయింది. పెరుగుతున్న జనాభాతో పోలిస్తే ఇది చాలా తక్కువ. నూనె విత్తనాల ఉత్పత్తి చాలా తక్కువగా ఉండడంతో వంటనూనెను విదేశాల నుండి దిగుమతి చేసుకోవాల్సి వస్తోంది. ఈ పరిస్థితిని చక్కదిద్దేందుకు కేంద్రప్రభుత్వం నడుం బిగించింది. దేశంలో ఇప్పుడున్న వ్యవసాయ ఉత్పత్తికి తోడుగా 11వ పంచవర్ష ప్రణాళిక చివరికి 25 మిలియన్ టన్నుల ఆహార ధాన్యాలను అదనంగా ఉత్పత్తి చేయాలన్నది ప్రధాన లక్ష్యం. వరి 10 మిలియన్ టన్నులు, గోధుమ 8 మిలియన్ టన్నులు, పప్పుధాన్యాలు 2 మిలియన్ టన్నులను ఉత్పత్తి చేయాలని నిర్ణయించారు. ఇందుకోసం 5వేల కోట్ల రూపాయలు కేటాయించాలని నిర్ణయించారు. ఇతర పంటలు 5 మిలియన్ టన్నులు అధికంగా ఉత్పత్తి చేస్తే విదేశాల నుండి దిగుమతి తగ్గించుకోవచ్చున్నది ప్రభుత్వ ఉద్దేశం. 2006-07లో ప్రభుత్వం నిర్ణయించిన లక్ష్యం కన్నా ఆహార ధాన్యాల ఉత్పత్తి ఎక్కువగానే జరిగింది. మనదేశంలోని ముఖ్యమైన రాష్ట్రాలలోని వరిపంట సాగు వివరాలు పట్టిక ద్వారా తెలుసుకోవచ్చు.

రాష్ట్రంలో సాధారణ వరిసాగు విస్తీర్ణం సుమారు 30.86 లక్షల హెక్టార్లు ఉంది. ఇందులో 20 లక్షల హెక్టార్లు ఖరీఫ్ సీజన్ సాగు విస్తీర్ణం కాగా, మరో 10 లక్షల హెక్టార్ల విస్తీర్ణం రబీలో సాగు అవుతోంది. అయితే అనావృష్టి వంటి కారణాలరీత్యా రెండు మూడు సంవత్సరాల క్రితం వరకు పూర్తిస్థాయి విస్తీర్ణం సాగులోకి రాలేదు. రెండు సంవత్సరాల నుండి కురుస్తున్న భారీ వర్షాల కారణంగా సాగు విస్తీర్ణం కొంత మేరకు పెరిగింది. అలాగే ప్రభుత్వం నిర్మిస్తున్న ప్రాజెక్టుల్లో కొన్ని పూర్తికావడం వల్ల కూడా కొత్త ఆయకట్టు అందుబాటులోకి వస్తున్నది. ఉత్పత్తి విషయానికి వస్తే సాలీనా 96 లక్షల టన్నుల వరకు వస్తున్నది. సీజన్ సరిగ్గా లేని సమయాల్లో 80 నుంచి 90 లక్షల టన్నులు, సీజన్ బాగుంటే 120 నుంచి 135 టన్నుల వరి ధాన్యం ఉత్పత్తి వస్తున్నది. అలాగే ఉత్పాదకతను పరిశీలిస్తే హెక్టారుకు సుమారు మూడు వేల కిలోల వరకు వస్తున్నది. కాగా జాతీయస్థాయిలో వరిపంట సాగు విషయాన్ని పరిశీలిస్తే రాష్ట్రం విస్తీర్ణపరంగా ఆరవ స్థానంలో ఉంది. మొదటి స్థానంలో పశ్చిమబెంగాల్ ఉండగా, రెండవ స్థానంలో ఉత్తరప్రదేశ్, ఒరిస్సా, చత్తీస్‌ఘడ్, బీహార్ రాష్ట్రాలున్నాయి. పంజాబ్, అస్సాం, తమిళనాడు, మధ్యప్రదేశ్ రాష్ట్రాలున్నాయి. దేశంలో సుమారు 11 రాష్ట్రాల్లో వరిపంటను ఎక్కువగా పండిస్తున్నారు. ఉత్పత్తి విషయంలో పశ్చిమబెంగాల్ రాష్ట్రం మొదటిస్థానంలో ఉండగా, రెండవస్థానంలో పంజాబ్, మూడవస్థానంలో మనరాష్ట్రం ఉంది. ఉత్పాదకతలో పంజాబ్ రాష్ట్రం అందరికంటే ముందు ఉంది. అక్కడి రైతులు హెక్టారుకు సుమారు 3,943 కిలోల ఉత్పత్తిని సాధిస్తున్నారు. రెండవస్థానంలో మనం నిలిచాం.

**దేశంలో వరిపంట సాగు వివరాలు**

| రాష్ట్రం | విస్తీర్ణం (లక్షల హెక్టార్లు) | దిగుబడి (లక్షల టన్నులు) |
|---|---|---|
| పశ్చిమబెంగాల్ | 57.83 | 148.85 |
| ఉత్తరప్రదేశ్ | 53.39 | 95.56 |
| ఒరిస్సా | 44.72 | 64.66 |
| ఛత్తీస్‌ఘడ్ | 37.47 | 43.83 |
| బీహార్ | 31.23 | 24.72 |
| ఆంధ్రప్రదేశ్ | 30.86 | 96.01 |
| పంజాబ్ | 26.47 | 104.37 |
| అస్సాం | 23.77 | 50.62 |
| తమిళనాడు | 18.73 | 50.62 |
| మధ్యప్రదేశ్ | 16.22 | 11.69 |

మన రాష్ట్రంలో జాతీయ ఆహార భద్రత-వరిధాన్యం పథకంలో ఆంధ్రప్రదేశ్‌కి చెందిన 11 జిల్లాలను, జాతీయ ఆహార భద్రత-పప్పుధాన్యాలు పథకంలో 14 జిల్లాలను చేర్చాలని ప్రతిపాదించారు. జాతీయ ఆహార భద్రత పథకం అమలు కోసం కేంద్రం ఇచ్చే అదనపు సాయం సక్రమంగా వినియోగించేందుకు రాష్ట్ర ప్రభుత్వాలు జిల్లాస్థాయి, రాష్ట్రస్థాయి వ్యవసాయ ప్రణాళికలను రూపొందించుకోవాలని కేంద్రం ఆదేశించింది. పంటలకోసం రైతులకు ఇచ్చే రుణ సదుపాయం పెంచాలని భావిస్తున్నారు. బ్యాంకుల నుండి రుణాలు తీసుకొనే రైతుల సంఖ్య గణనీయంగా పడిపోతుండడం పట్ల కేంద్రం ఆందోళన వ్యక్తం చేస్తోంది. 2004-05 లో జాతీయ స్థాయిలో పంట రుణాలు పొందిన రైతుల సంఖ్య 413 లక్షలు ఉండగా, ఇది 2006-07 సంవత్సరానికి 397 లక్షలకు పడిపోయింది. మొత్తం రైతులు కేవలం 26% శాతం మంది మాత్రమే బ్యాంకుల నుండి రుణాలను తీసుకుంటున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఇదే పరిస్థితి నెలకొని ఉంది. ఆంధ్రప్రదేశ్‌లో 2004-05 68 లక్షలు మంది రైతులు రుణాలు తీసుకొని ఉంటే 2006-07లో ఈ సంఖ్య 48 లక్షలకు పడిపోయింది. సహకార బ్యాంకులు ఇచ్చే రుణాలు తగ్గిపోతుండడం పట్ల కేంద్రం ఆందోళన వ్యక్తం చేసింది. ఒక్కో రైతుకు సరాసరిన వాణిజ్య బ్యాంకులు లక్ష రూపాయల వరకు రుణం సమకూరుస్తుండగా, సహకార బ్యాంకులు 24వేల రూపాయల రుణాన్ని మాత్రమే సమకూరుస్తున్నాయి. వాణిజ్య బ్యాంకులు పెద్ద రైతులకు ఎక్కువగా రుణాలు ఇస్తుండగా సహకార

బ్యాంకులు మాత్రమే చిన్న, సన్నకారు రైతులకు ఎక్కువగా రుణాలను ఇస్తున్నాయి. వ్యవసాయ రుణాల్లో 1970 దశకం వరకు సహకార బ్యాంకులు 80 శాతం సమకూర్చగా, 2006-07 ఇది 21 శాతానికి పడిపోయింది. ఈ పరిస్థితిని పరిశీలించి వైద్యనాథన్ కమిటీ సిఫార్సులకు అనుగుణంగా సహకార బ్యాంకులు ఇచ్చే స్వల్పకాలిక రుణాలను పెంచేందుకు కేంద్రం ఒక ప్యాకేజీని ఇటీవల ఆమోదించింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడా సహకార బ్యాంకుల ద్వారా రైతులకు ఎక్కువ మొత్తంలో రుణాలను అందించేందుకు వీలుగా జాతీయ వ్యవసాయ గ్రామీణ అభివృద్ధి బ్యాంకు నాబార్డ్‌తో ఒక ఒప్పందాన్ని కుదుర్చుకుంది. బ్యాంకుల్లో ఒక పర్యాయం పంట రుణాలు, టర్మ్‌లోన్స్ తీసుకుంటున్న వాటిని సకాలంలో తిరిగి చెల్లించకపోవడంతో రుణ ఎగవేత దారుల జాబితాలో చేరుతున్నారు. ఈ విషయంలో రాష్ట్రప్రభుత్వం ప్రత్యేకశ్రద్ధ తీసుకోవాలని కేంద్రం హెచ్చరించింది.

తమిళనాడుకి చెందిన వైద్యనాథన్ సహకార రంగంలో నిపుణులు. ఈ కమిటీ రెండేళ్లపాటు సహకార వ్యవస్థను సంపూర్ణంగా పరిశీలించి ప్రభుత్వానికి నివేదిక సమర్పించింది. ఈ కమిటీ సిఫార్సులను ఆంధ్రప్రదేశ్ అన్ని రాష్ట్రాల కంటే ముందే ఆమోదించింది. సిఫార్సుల అమలుకోసం నాబార్డ్ ఉదారంగా నిధులు మంజూరు చేసింది. ఇందులో భాగంగానే మన రాష్ట్రానికి రు. 2200 కోట్లు మంజూరయ్యాయి. అయితే ఏప్రిల్ 1 నుండి వైద్యనాథన్ కమిటీ సిఫార్సులను అమలు చేయాలని నిర్ణయించారు. కాగా డిసిసిబి సహకార పరపతి సంఘాల ఆడిటింగ్ నిర్వహించడంలో జాప్యం జరగడంతో సిఫార్సుల అమలును వాయిదా వేయడం జరిగింది. ప్రస్తుతం సిబ్బందికి శిక్షణా కార్యక్రమాన్ని కొనసాగిస్తున్నాయి. మొదటి విడత నాబార్డ్ రు. 260 కోట్లు, రెండవ విడత రు. 240 కోట్లు విడుదల చేసింది. ప్రస్తుతం ఈ నిధులు ఆయా సహకార సంఘాల పేరుతో డిపాజిట్ అయ్యాయి. శిక్షణ పూర్తయిన తర్వాత సంపూర్ణంగా వీటిని పంపిణీ చేస్తామని అధికారులు చెబుతున్నారు. వైద్యనాథన్ కమిటీ సిఫార్సుల ప్రకారం వాణిజ్య బ్యాంకుల మాదిరిగానే సహకార సంఘాలు పనిచేయాలి. సుశిక్షితులైన సిబ్బందిని నియమించుకోవాలి. నిధులను పంపిణీ చేయడంలో జరుగుతున్న జాప్యం వల్ల గ్రామీణ వ్యవసాయదారులు అనేక నష్టాలకు గురవుతున్నారు. వైద్యనాథన్ సిఫార్సుల అమలులో జరుగుతున్న ఆలస్యం వల్ల గ్రామీణరంగం నష్టాలకు గురవుతున్నది. కనీసం రబీ ప్రారంభంలోనైన సహకార రుణాలు అందించాలని రైతులు కోరుతున్నారు.

రైతులు ఎక్కువగా ఆత్మహత్యలు చేసుకొన్న ఆంధ్రప్రదేశ్‌లోని పదహారు జిల్లాల్లో మూడేళ్ళలో అమలు చేసేందుకు వీలుగా కేంద్రప్రభుత్వం 9,650.55 కోట్ల రూపాయలతో ఒక ప్యాకేజీని గత ఏడాది ప్రకటించింది. ఈ ప్యాకేజీ అమలు తీరుపట్ల కూడా ప్రధాని మన్మోహన్‌సింగ్ సంతృప్తి వ్యక్తం చేశారు. ప్రధానమంత్రి ప్రత్యేక ప్యాకేజీ కింద నీటిపారుదల, వాటర్‌షెడ్ల అభివృద్ధి, ఉద్యాన పంటల అభివృద్ధి కూడా చేరి ఉన్నాయి. ఈ ప్యాకేజీలోకి వచ్చే ఉద్యాన పంటలకు 2005-06లో ప్రకటించిన జాతీయ ఉద్యాన మిషన్ (నేషనల్ హార్టికల్చర్ మిషన్) కింద కూడా సాయం లభిస్తుంది. ఆంధ్రప్రదేశ్‌లోని 18 జిల్లాలో ఉద్యాన పంటలు అభివృద్ధి కొనసాగుతోంది. వ్యవసాయంతో పాటు అనుబంధ రంగాల్లో కూడా రైతులు శ్రద్ధ చూపిస్తే వారికి అదనపు ఆదాయం లభిస్తుందని ప్రభుత్వ ఉద్దేశ్యం.

## ఆంధ్రప్రదేశ్ తీర్మానం

2007 జూలై 31న హైదరాబాద్‌లో ప్రధాన మంత్రి డాక్టర్ మన్మోహన్‌సింగ్ సమక్షంలో జరిగిన సమీక్షా సమావేశంలో ఆంధ్రప్రదేశ్ రిజిస్ట్రేషన్ పేరుతో ఒక తీర్మానం ఆమోదించారు. ఈ సందర్భంగా జాతీయ ఆహార భద్రత ప్రారంభించినట్లు ప్రధాని ప్రకటించారు. 11వ పంచవర్షప్రణాళికలో ఆంధ్రప్రదేశ్ వ్యవసాయరంగంలో నాలుగు శాతం వృద్ధిరేటు సాధించాలన్నది ప్రధాన లక్ష్యంగా నిర్ణయించారు. ఈ తీర్మానంలో ప్రధానమైన అంశాలు ఈ విధంగా ఉన్నాయి.

ఎ) రాష్ట్రంలో వరిధాన్యం 30లక్షల టన్నులు, పప్పుధాన్యాలు 3.5 లక్షల టన్నులు, నూనె విత్తనాలు 5 లక్షల టన్నులు అదనంగా ఉత్పత్తి చేయాలి.

బి) వచ్చే మూడునెలల్లో జిల్లాస్థాయి, రాష్ట్రస్థాయి వ్యవసాయ ప్రణాళికలను రూపొందించాలి. కేంద్రం ప్రకటించిన 25వేల కోట్ల అదనపు సహాయం నుండి ఎక్కువ నిధులు రాబట్టుకొనే విధంగా కార్యక్రమాలు చేపట్టాలి.

సి) 32 లక్షల టన్నుల అదనపు ఉత్పత్తి సాధించాలి. మాంసం ఉత్పత్తి మూడు లక్షల టన్నులు అదనంగా సాధించాలి. అలాగే 500 కోట్ల కోడిగుడ్లు అదనంగా ఉత్పత్తి అయ్యేలా చూడాలి. మంచి నీటి మత్స్య సంపద అదనంగా 16 లక్షల టన్నులు పెరిగేలా చూడాలి.

డి) పోస్ట్ హార్వెస్ట్ యాజమాన్యం సమర్థవంతంగా ఉండేందుకు అవసరమైన మౌలిక సదుపాయాలను కల్పించాలి. ఉద్యాన పంటలకు సరైన మార్కెట్ సదుపాయాలు కల్పించాలి.

ఇ) అగ్రికల్చరల్ టెక్నాలజీ మేనేజ్‌మెంట్ ఏజన్సీ (ఆత్మా) కార్యాక్రమాలన్ని ఉపయోగించుకొని వ్యవసాయ విస్తరణ, పరిశోధన విస్తరణ విభాగాలను పటిష్టం చేయాలి.

ఎఫ్) వైద్యనాథన్ కమిటీ సిఫార్సులు ప్రకారం సహకార రంగాన్ని పటిష్టం చేస్తే ఈ రంగం ద్వారా అదనంగా 18 లక్షల మంది రైతులకు రుణ సదుపాయం కల్పించాలి.

జి) విత్తనాభివృద్ధికి అత్యధిక ప్రాధాన్యం ఇవ్వాలి. కేంద్రం ఇస్తున్న అదనపు సాయాన్ని ఉపయోగించుకొని, ప్రైవేటురంగం కూడా విత్తనాభివృద్ధిలో భాగస్వామ్యం అయ్యేలా చూడాలి. ఈ విషయంలో జాతీయ విత్తన సంస్థ సహకారం తీసుకోవచ్చును. రసాయన పురుగు మందులు వాడకాన్ని తగ్గించేందుకు విస్తృతంగా ప్రచారం చేయాలి.

విత్తనాలు, ఎరువులు, పురుగు మందులు, సేంద్రీయ ఎరువుల నాణ్యతలను పరీక్షించేందుకు ప్రస్తుతం ఉన్న 38 ప్రయోగశాలలకు తోడుగా 11వ పంచవర్ష ప్రణాళిక కాలంలో మరో 37 ప్రయోగశాలలను ఏర్పాటు చేయాలి. సేంద్రీయ ఎరువులు, పచ్చిరొట్టె ఎరువులను వాడుతూ భూసారాన్ని పెంపొందించేందుకు అయిదువేల గ్రామాల్లో 25 లక్షల ఎకరాల్లో సేంద్రీయ వ్యవసాయం చేపట్టేలా చర్యలు తీసుకోవాలి. వి

*మురికివాడల సమస్యలకు మౌలిక కారణాలు పరిశీలించి వలసలు నివారించే దిశగా సామాజికాభివృద్ధి జరగాలంటున్నారు* **దొమ్మట రాజయ్య, మాడరాజు అంజయ్య, గంధమల్ల రామయ్య**

# మురికివాడల ముఖచిత్రం

**ముం**బయి మురికివాడల్లోని దుర్భర స్థితిగతుల్ని వెండితెరమీద ఆవిష్కరించిన 'స్లమ్‌డాగ్ మిలియనీర్' చిత్రానికి అవార్డుల పంట పండింది. కానీ, మురికివాడల పిల్లలకు ఆ నరకకూపం నుంచి విముక్తి కల్పించడానికి ప్రభుత్వాలు చిత్తశుద్ధితో కృషి చేయడం లేదన్నది వాస్తవిక దృశ్యం. గుండెను విచలితం చేసే విషాదకర సన్నివేశం. మురికివాడల జీవన నేపథ్యంతో తీసిన ఈ చిత్రం 'ఆస్కార్ అవార్డుల'కు నామినేషన్ దక్కించుకొని సంచలనం సృష్టించింది. ఓ భారతీయ కథాంశం ఇన్ని ఆస్కార్ బహుమతులకు నామినేట్ కావడం ఇది మొదటిసారి కావడం విశేషం.

మురికివాడల్లో నివసించే లక్షలమంది పిల్లల సంక్షేమాన్ని విస్మరించడం తగదని ఈ చలనచిత్రం కథాంశం సూటిగా గుర్తిస్తోంది. లేకుంటే, అక్కడి బాలల భవిష్యత్తు అంధకారంలోనే మగ్గిపోనుందని ఎలుగెత్తి చాటుతోంది. గణతంత్ర రాజ్యంగా అవతరించి అరవై ఏళ్లు దాటినా పరిస్థితి ఎక్కడ వేసిన గొంగడి అక్కడే అన్న చందంగా ఉందని గుర్తించమంటోంది.

దేశంలో మురికివాడలు నానాటికీ విస్తరిస్తున్నాయి. మహా మురికివాడల రేసులో 'ముంబయి'ది ప్రథమ స్థానం కాగా, తరువాత స్థానంలో కోల్‌కత, చెన్నై, ఢిల్లీ లు ఉన్నాయి. ఈ విషయాన్ని కేంద్ర ప్రభుత్వమే లోక్‌సభలో ఓ లిఖితపూర్వక ప్రశ్నకు సమాధానంగా వెల్లడించింది. సమస్య తీవ్రత దృష్ట్యా మురికివాడల అభివృద్ధి, సౌకర్యాల పెంపునకు పట్టణ పేదల కనీస సేవల (బిఎస్‌యుపి) పథకం కింద సుమారు 116 ప్రాజెక్టులను ఆమోదించినట్లు వివరించింది. ఈ పనులను ముంబయి, కోల్‌కత, చెన్నై, ఢిల్లీ నగరాలలో చేపట్టనున్నట్లు తెలిపింది. కేంద్రం తెలిపిన గణాంకాల ప్రకారం 1981లో దేశంలో మురికివాడల జనాభా 2.6 కోట్లు. ఇది 2001 కల్లా 6.18 కోట్లకు చేరింది. మురికివాడల జనాభాలో 'స్లమ్‌డాగ్ మిలియనీర్' నగరం ముంబయి తొలిస్థానంలో నిలిచింది. ఈ నగరంలో మొత్తం జనాభాలో సుమారు 54 శాతం మంది మురికివాడల్లోనే నివసిస్తున్నారు. కోల్‌కతాలో 32.5 శాతం, చెన్నైలో 18.9 శాతం, ఢిల్లీలో 18.7 శాతం ప్రజలు మురికివాడల్లోనే నివసిస్తున్నారు.

ప్రపంచ వ్యాప్తంగా పట్టణ జనాభా శరవేగంతో పెరిగిపోతోంది. మన దేశంలో 2030 నాటికి మొత్తం జనాభాలో సగం మంది పట్టణాల్లోనే నివసిస్తారని అంచనా. ఇలా ఏటికేడాది పట్టణవాసుల సంఖ్య విపరీతంగా పెరిగిపోవటానికి ముఖ్యకారణం వలసలే అన్నది జగమెరిగిన సత్యం. ఆర్థికాభివృద్ధి, పట్టణ జనాభా పెరుగుదలకు మధ్య ఉన్న అవినాభావ సంబంధం ఈనాటిది కాదు. పారిశ్రామిక యుగంలో పట్టణీకరణ జరగకుండా ఏ దేశమూ ఆర్థికాభివృద్ధి సాధించలేదని చరిత్ర స్పష్టంచేస్తోంది. పట్టణ ప్రాంతాలలో పరిశ్రమలు, వాణిజ్య కార్యకలాపాలు కేంద్రీకృతమవుతున్న కొద్ది ఉపాధి అవకాశాలు పుట్టుకురావడం, వాటిని వెతుక్కుంటూ గ్రామీణ ప్రజల వలసలు పెరిగిపోవడం నిరంతరాయంగా సాగుతూ వస్తోంది. ప్రపంచవ్యాప్తంగా పదిలక్షలకు పైబడిన జనాభా కలిగిన నగరాలు 1950లో 86 ఉంటే ఇప్పుడు అవి 400కు పెరిగాయి. 2015 నాటికి వీటి సంఖ్య 550కి చేరుతుందని ఐక్యరాజ్య సమితి అంచనా.

ఎంతోమంది నిరుపేదలు పొట్టచేత పట్టుకొని పట్టణాలకు తరలివస్తూ, పేదరికాన్ని కూడా గ్రామాల సరిహద్దులు దాటించి నగరాలకు విస్తరిస్తున్నారు. పట్టణీకరణతో పాటే మురికివాడలు ఇబ్బడిముబ్బడిగా పుట్టుకొస్తున్నాయి. చాలీచాలని కూలీతో కడుపునిండా తిండిలేని నిస్సహాయ స్థితిలో వారు దొరికిన చోట తలదాచుకోవడం పరిపాటి అవుతోంది. పట్టణావసరాలు, పరిశ్రమలు, కర్మాగారాలకు కావలసిన సేవలను చౌకగా అందించడంలో మురికివాడల వాసులదే కీలకస్థానం. కానీ, వీరి సంక్షేమం పట్ల ప్రభుత్వాలు అంతగా శ్రద్ధ చూపకపోవడం విషాదకరమే కాదు, అమానుషం కూడా. మురికివాడల పేదలంటే ప్రభుత్వాలకు ఎప్పుడూ చులకనే. మనదేశంలో 2001 జనగణన వరకు వారి సంఖ్యను సమగ్రంగా లెక్కకట్టిన దాఖలాలు లేవు. ఈ గణనలో వెల్లడైనా వివరాలు ఆలోచింపజేసేవిగానే ఉన్నా, ఆచరణాత్మకమైన సమగ్ర పథకాలేవి రూపొందలేదు. మురికివాడల్లో నివసిస్తున్న మొత్తం పిల్లలలో అరవై లక్షలకు పైగా ఆరేళ్లలోపు వారే కావటం గమనార్హం. పట్టణాల్లో మొత్తం ఆరేళ్లలోపు ప్రతి ఆరుగురిలో ఒకరు మురికివాడలోనే నివసిస్తున్నారు. అపరిశుభ్ర పరిసరాలు, పోషకాహార లోపం, అవిద్య వీరి భవిష్యత్తును నానాటికీ ప్రశ్నార్థకం చేస్తున్నాయి.

అక్షరాస్యతను పెంపొందించకుండా అభివృద్ధి సాధ్యం కాదనడం లో సందేహమే లేదు. మెరుగైన జీవితాన్ని గడుపుతున్నామనటానికి అక్షరాస్యతను కూడా ప్రముఖమైన కొలమానంగా భావించవచ్చు.

మురికివాడల వాసులలో సగానికి సగం మంది వీటికి నోచుకోనివారే. కేవలం 2.67 కోట్లమంది మాత్రమే అక్షరాస్యులని జనగణన ద్వారా తెలుస్తోంది. ఇందులో మహిళల సంఖ్య చాలా తక్కువ. బాలకార్మిక వ్యవస్థ నిర్మూలన చట్టాలు, నిర్బంధ విద్యా పథకాలు ఎన్ని పుట్టుకొచ్చినా మురికివాడల పిల్లల పరిస్థితుల్లో మార్పు రావడంలేదు. ఉదయం లేస్తూనే చెత్త ఏరుకోవటానికో, పనులకో బయలుదేరే పిల్లలు ఎందరో. వీరు రోజులో అత్యధిక సమయం అపరిశుభ్ర పరిసరాల్లోనే గడుపుతుండటం వల్ల అనారోగ్యం కొరల్లో చిక్కుకుంటున్నారు. ప్రమాదకరమైన పరిశ్రమల్లో పని చేస్తూ అనుక్షణం బిక్కుబిక్కుమని గడిపేవారు ఇంకెందరో. బడిబాట పట్టకుండా వీరిని రకరకాల పనులవైపు నడిపిస్తున్నది ఆయా కుటుంబాల పేదరికం, దయనీయ స్థితులే. ఢిల్లీలోని స్వచ్ఛంద సంస్థ 'సామాజిక సువిధా సంగం సొసైటీ' ఇటీవల ఒక సర్వేచేసింది. సాక్షాత్తు దేశరాజధాని ఢిల్లీలోని మురికివాడల్లో 25 లక్షల మంది పిల్లలు పాఠశాల విద్యకు దూరంగా ఉంటున్నారని వెల్లడించింది. కేవలం చెత్త ఏరుకోవడం మీదనే ఆధారపడి జీవించే 35,597 మందిలో ఎక్కువమంది పోషకాహార లోపం బారిన పడటం కూడా మురికివాడల పిల్లలను దారుణంగా దెబ్బతీస్తోంది. మురికివాడల్లో నివసిస్తున్న ఆరేళ్లలోపు పిల్లల్లో సగానికి సగం మంది ఇలాంటివారే. ముంబయి మురికివాడల్లో నివసించే మొత్తం పిల్లల్లో ఆరేళ్లలోపు వయస్సు గల 1,26,497 మంది పిల్లల్ని పరిశీలించగా 62,485 మంది మాత్రమే సాధారణ బరువు కలిగి ఉన్నారని ప్రభుత్వం నిర్వహించిన అధ్యయనంలో తేలింది.

స్లమ్‌డాగ్ మిలీయనీర్ సినిమాలో జమాల్ పెరిగిన పరిసరాలు, ఎదుర్కొన్న పరిస్థితులు చూసిన వారందరికి గగుర్పాటు కలిగిస్తాయి. ఆ నరకకూపం నుంచి బయటపడటానికి అతడు చేసిన ప్రయత్నాలు ఫలించడం ఒకింత ఆనందాన్ని కలిగిస్తుంది. కల్పిత కథలో ఏదైనా సాధించవచ్చు. కానీ, వాస్తవ జీవనంలో ఎందరు జమాల్‌లు సమిధలవుతున్నారో గుర్తిస్తున్నామా? పరిష్కారాలు ఆలోచిస్తున్నామా? ఇప్పటిదాకా వలసల నివారణ మురికివాడల పెరుగుదలను అడ్డుకుంటుందనే ధోరణిలో పథకాలు రూపొందుతున్నాయి. అలాంటివి ఏవీ సత్ఫలితాలను ఇచ్చిన దాఖలాలు లేవు. నిరంతరం ఏ ఏడాదికి ఆ ఏడాది పెరుగుతున్న వలసలే అందుకు నిదర్శనం. కొన్ని రాష్ట్రాలలో మురికివాడలను తొలిగించే ప్రయత్నాలు కూడా చేసారు. కాని సమస్య జటిలం అవుతోందే తప్ప పరిష్కారం కావడం లేదు. కాబట్టి ప్రభుత్వాల ఆలోచన, చూసే దృష్టిలో సంక్షేమ భావన మొగ్గతొడగాలి. పసిపిల్లల్ని పేదరికంలోకి నెడుతున్న పరిస్థితుల్ని అధ్యయనం చేసి, వారిని వాటినుంచి బయటపడేసే మార్గం చూపించాలి. లేదంటే తల్లిదండ్రుల పేదరికమే పెనుశాపంగా మారుతున్న ఆ పిల్లలకు 'స్లమ్‌డాగ్' అన్న పేరే చిరస్థాయిగా మిగిలిపోతుంది. వీ

## పరిశోధనా ఫలాలు సమాజానికి అందజేయండి !

సామాజిక, ఆర్థిక, రాజకీయ అంశాలలో మీరు ఎంతో పరిశోధన చేసి ఉంటారు. అధ్యాపకులుగా మీ విద్యార్థులకు ఎన్నో పరిశోధనలలో ప్రత్యక్ష పరోక్ష సహకారాలు అందిస్తూ ఉంటారు. అయితే సమాజానికి ఎంతో ఉపయోగపడాల్సిన పరిశోధనా పత్రాలు ఏ సెమినార్‌లోనో ప్రస్తావించి వదిలేస్తే సరిపోదు. మీ పరిశోధనా ఫలాలు తెలుగు సమాజంలో నలుగురికీ చేరాలి. కొత్త ఆలోచనలకు ప్రేరణ కావాలి, కొత్త మార్గాలను ఆవిష్కరించాలి. అందుకు మీకు వేదికగా నిలిచేందుకు వీక్షణం ముందుకు వస్తోంది.

తెలుగులో పాప్‌కార్న్ పత్రికలే కానీ సీరియస్ పత్రికలు లేవన్న అభిప్రాయాన్ని పటాపంచలు చేస్తూ విజయవంతంగా రెండున్నరేళ్ల ప్రస్థానం సాగించి, 50 సంచికలు పూర్తి చేసుకుంది వీక్షణం.

ఎటువంటి డబ్బు మూటల దన్ను లేకుండా గుప్పెడు పాత్రికేయులు, సామాజిక శాస్త్రవేత్తలు కలిసి నడుపుతున్న ఈ పత్రికకు ఎందరో మేధావులు, అధ్యాపకులు, ఆలోచనాపరులు చందాదారులుగా ఉన్నారు. తెలుగు సమాజం గర్వించదగ్గ పాత్రికేయులు, సామాజిక శాస్త్రవేత్తలు, ఉద్యమకారులు, నిపుణులు అనేకుల రచనలు వీక్షణం ప్రచురిస్తోంది.

రండి, ఈ బృహత్‌కార్యంలో మీరూ పాలుపంచుకోండి. మీరు చేసిన పరిశోధనా ఫలితాలను వీక్షణంలో ప్రకటించండి. అది ఏ సామాజిక, ఆర్థిక, రాజకీయ అంశం అయినా ఫర్వాలేదు. తెలుగు ప్రజలకు ఆ అంశం ఆసక్తిగొల్పేదీ, ఉపయోగకరమైనదీ అని మీరు భావిస్తే చాలు. మీరే కాదు పి.హెచ్.డి చేసిన, చేస్తున్న మీ విద్యార్థులు కూడా తమ పరిశోధనా పత్రాలను (ఒక వ్యాసరూపంలో) పంపవచ్చు. రచనతో పాటు దానికి సంబంధించిన చిత్రాలు, గణాంకాలు కూడా జతపరిస్తే మరీ మంచిది.

*ఎంతో శ్రమించి మీరు చేస్తున్న పరిశోధనలు నలుగురికీ ఉపయోగపడేలా చేయండి.*
*వీక్షణం మీ రచనల కోసం ఎదురుచూస్తుంది ! మీదే ఆలస్యం !!*

*రచనలు పంపాల్సిన చిరునామా :*

ఎడిటర్, వీక్షణం, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్
3-6-394, 301, మైత్రీ రెసిడెన్సీ, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040 - 66843495

*విజ్ఞాన శాస్త్రంలో లాగ సామాజిక చలనంలో ఫలితాలను ముందే ఊహించడం కష్టమనీ, అయితే గడిచిన చరిత్ర ఆధారంగా భవిష్యత్తును కొంత ఊహించవచ్చుననీ విశ్లేషిస్తున్నారు* **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# చరిత్ర కూడా విజ్ఞాన శాస్త్రమా?

చరిత్ర అంటే ఏమిటి? మనలో చాలామందికి స్కూలు రోజుల నుంచీ హిస్టరీ అంటే అయిష్టత ఏర్పడుతుంది. ఎందుకంటే చరిత్ర అంతా ఎప్పుడో జరిగిపోయిన సంఘటనల చిట్టాలాగా అనిపిస్తుంది. కాని అది నిజం కాదు. జరిగిన విషయాలను సకారణంగా వైజ్ఞానిక పద్ధతుల్లో విశ్లేషించవచ్చు. ప్రాచీన నాగరికతలు ప్రపంచంలో కొన్ని స్థలాల్లోనే ఎందుకు మొదలయ్యాయో, వేటవంటివి మానుకుని పొలం సాగు చెయ్యగలిగిన అవకాశాలు అక్కడే ఎందుకు వీలయిందో శాస్త్రవేత్తలు చెప్పగలరు. అంటే హిస్టరీకి మూలకారణం జాగ్రఫీయే. పంటమొక్కల్లోని జన్యుజాతులూ, అవి ఏపుగా పెరగగలిగేందుకు అవసరమైన పరిస్థితులూ శాస్త్రీయంగా వివరించబడ్డాయి. భౌగోళికంగా ఒక్కొక్క ప్రాంతంలోనూ ఎటువంటి వన్య ప్రాణులుండేవో, వాటిలో గొర్రెలూ, మేకలూ, పశువుల వంటివి ఇతరులకన్నా ముందుగా పశ్చిమాసియా వాసులకు మచ్చికకు ఎలా పనికొచ్చాయో మనకు తెలుసు. అలాగే తూర్పు పడమరలుగా ఎక్కువ వైశాల్యం కలిగిన ఆసియా–యూరప్ ఖండాల్లో నాగరికతలు విస్తరించిన పద్ధతిలో అమెరికా, ఆఫ్రికా ఖండాల్లో జరగకపోవడానికి వాటి స్వరూపం, వాతావరణ పరిస్థితులే కారణం. నాగరిక దశకు ముందుగా చేరుకున్న ప్రజలు ఇతర 'ఆదిమ' తెగలను లోబరుచుకోవడం కష్టం అనిపించలేదు. వివిధ నగరాలూ, సామ్రాజ్యాలూ, సైన్యాలూ, యుద్ధాలూ తప్పనిసరిగా తలెత్తుతూ వచ్చాయి. ఇదంతా చరిత్రకు భూమిక.

తరువాతి కాలంలో కూడా ప్రతి సంఘటనకూ భౌతిక ఆధారాలు కనబడతాయి. బాబర్ వంటి ఫలానా రాజు మనదేశం మీదికి దండెత్తి వచ్చాడని చరిత్ర చెపుతుంది. ఎంత గొప్పగా వర్ణించినప్పటికీ యుద్ధాలన్నీ పెద్ద ఎత్తున జరిగిన సాయుధ దోపిడీలే. ఇలాంటివన్నీ కేవలం 'పుర్రెకో బుద్ధి' అన్న పద్ధతిలో జరిగి ఉండకపోవచ్చు. మనం గుర్తుంచుకోవలసినదేమిటంటే బాబర్ అయినా, చెంఘిజ్‌ఖాన్ అయినా తన ప్రాంతంలో తలెత్తిన సామాజిక పరిస్థితులవల్లనే దండయాత్రలు చెయ్యవలసి వచ్చింది. వీటికి సామాన్యంగా వ్యక్తిగత కారణాలు ఉండవు. ఉన్న పరిస్థితులు అసంతృప్తికి దారితీసినప్పుడే మార్పులు అవసరమౌతాయి. కూడూ, గుడ్డా వగైరాలకు లోటు కలిగితే తప్ప ప్రాణాలకు తెగించి ఎవరూ పోరాడరు. ప్రజలను కదిలించటానికి మతవైషమ్యాలూ, జాతివైరాలూ పనికొచ్చినప్పటికీ నిజమైన కారణాలన్నీ భౌతిక అవసరాలకు సంబంధించినవే. భౌగోళిక ప్రతికూలతల వల్లనే వనరుల్లో ఇబ్బందులు కలిగేవి. జనాభా పెరిగి, అంతకంతకూ పరిమితమైపోతున్న వనరుల కోసం ఎన్నో యుద్ధాలు జరుగుతూ ఉండేవి. ట్రోయ్ నగరాన్ని గ్రీకులు ముట్టడించడానికి కేవలం ఒక 'రాణి ప్రేమ పురాణం' కారణం కాకపోవచ్చు. ఏ కాలంలోనైనా, ఏ ప్రాంతంలోనైనా ఆహారోత్పత్తి తగినంతగా జరగకపోవడం, జనాభా పెరగడం మొదలైనవన్నీ భౌగోళిక కారణాలవల్లనూ, వాతావరణంలో కలిగిన మార్పులవల్లనూ తలెత్తుతాయి. ఆధునిక విజ్ఞానం ద్వారా అప్పటి భౌతిక పరిస్థితులను మనం అంచనా వేసుకోవచ్చు. ప్రజల మధ్య జరిగిన (జరగనటువంటివి కూడా) సంఘర్షణల వల్లనే చరిత్ర రూపొందుతూ వచ్చింది. అలాంటప్పుడు చరిత్ర అనేదాన్ని కూడా విజ్ఞానశాస్త్ర పద్ధతిలోనే విశ్లేషించాలని జారెడ్ డయమండ్ అనే పరిశోధకుడి అభిప్రాయం.

చరిత్ర అంటే గతాన్ని గురించే కదా అనుకోవచ్చు కాని సామాజిక శాస్త్ర దృక్పథంతో పరిశీలిస్తే ఉన్న పరిస్థితులను బట్టి భవిష్యత్తులో ఏమవుతుందో ఊహించబుద్ధి అవుతుంది. ప్రపంచపు షేర్ మార్కెట్లలో పెట్టుబడి పెట్టదలచుకున్నవారు ఏ దేశం పరిస్థితి ఎలా మారబోతోందో వీలున్నంత కచ్చితంగా అంచనా వేసేందుకు ప్రయత్నిస్తారు. ఆర్థిక, వ్యవసాయ, పారిశ్రామిక అంశాలన్నీ పరిగణనలోకి తీసుకున్నప్పటికీ ఒక్కొక్కప్పుడు స్థానిక ఎన్నికల ఫలితాలు అనుకున్నట్టుగా రాకపోవడం, అధికారంలోకి వచ్చిన వ్యక్తి అనూహ్యమైన పద్ధతిలో ప్రభుత్వాన్ని నడపడం జరుగుతూ ఉంటుంది. బంగ్లాదేశ్ ఆవిర్భావానికి ముందు జరిగిన భారత–పాకిస్థాన్ యుద్ధ కాలంలో ఇందిరాగాంధీ రాజకీయ వైఖరీ, ఆ తరువాత ఆమె హత్యా చరిత్రని ఎలా మార్చాయో మనకు తెలిసిందే. మరొకవంక పశ్చిమదేశాల ఉద్యోగాలు కొన్ని మనదేశానికీ, ఇతర ప్రాచ్యదేశాలకూ రెక్కలుకట్టుకు వెళుతున్న ధోరణిని బట్టి ఎటువంటి మార్పులు కలుగుతాయో కొంతవరకూ చెప్పవచ్చు.

ప్రాచీన అవశేషాలను గురించిన పరిశోధనల్లో శాస్త్రవిజ్ఞానం అనేకరకాలుగా పనికొస్తుంది. ఉదాహరణకు హిమయుగాలలో కలిగిన మార్పులు భూమిమీది ప్రాణులనూ, తొలి



హిమయుగాలలో యూరప్

మానవులనూ అనేక ప్రభావాలకు గురిచేశాయని పరిశోధనల వల్ల తెలిసింది. గత హిమయుగం పదివేల ఏళ్ల క్రితం ముగిసినట్టుగా తెలుస్తోంది. అప్పట్లో సముద్రజలాలన్నీ ధ్రువాల్లో మంచుగా పేరుకోవడం వల్ల సముద్రమట్టాలన్నీ పడిపోయాయి. యూరప్ ఉత్తర ప్రాంతాలన్నీ మంచుతో కప్పబడటంతో మనుషుల, జంతువుల సంచారం సులువుగా జరిగి ఉంటుంది. ఈ వలసల వల్ల అనేక ప్రాంతాలు మనుషులకూ, జంతువులకూ కూడా నివాసయోగ్యం అయ్యాయి. ఆ తరవాత మంచు కరిగి, మధ్యనున్న ప్రాంతాలు జలమయం కావడంతో కొన్ని సందర్భాల్లో తిరుగు ప్రయాణాలు వీలవలేదు. ఇటువంటి సంఘటనలన్నీ తరువాత చరిత్రను కొంతవరకూ మార్చగలిగాయి.

సముద్రాలు అడుగంటటంతో ఈనాడు ఆస్ట్రేలియాకు ఉత్తరాన ఉన్న న్యూగినీ ద్వీపాలూ, దక్షిణాన ఉన్న టాజ్మేనియా అన్నీ ఒకే విస్తృత భూఖండంగా ఉండేవి. ఇప్పటిలాగా మధ్యలో సముద్రాలుండేవికావు. అటు తూర్పు ఆసియాలో వియత్నాం, చైనా తూర్పు తీరప్రాంతాలూ, బోర్నియో అన్నీ ఒకే విస్తృత భూఖండంగా ఉండేవి. విస్తృత ఆసియా తూర్పుకొసకూ విస్తృత ఆస్ట్రేలియా పడమటి ప్రాంతాలకూ మధ్య సముద్రం చిన్నదిగా ఉండేది.



హిమయుగాలలో ఆస్ట్రేలియా

అలాగే ఆసియా ఈశాన్య ప్రాంతపు కొసకూ అలాస్కాకూ మధ్య బెరింగ్ జలసంధి ఉండేదికాదు. ఈ కారణంగా కొన్ని ప్రాంతాలకు ప్రజలు కాలినడకన వలసపోగలిగారు. మరికొన్ని చోట్ల పడవల తయారీ జరిగిన దాకా సంపర్కం ఏర్పడలేదు. ఇవన్నీ నాగరికత అభివృద్ధినీ, వ్యాప్తినీ చాలా ప్రభావితం చేశాయి.



బెరింగ్ జలసంధి - నాడు, నేడు

చరిత్రను విజ్ఞానంగా పరిగణించగలమా? అసలు శాస్త్రవిజ్ఞానానికీ చరిత్రకూ తేడాలేమిటి? విజ్ఞాన శాస్త్రాలకు కొన్ని సూత్రాలుంటాయి. అవి సర్వత్రా వర్తిస్తాయి; లేదా పరిస్థితులని బట్టి కొన్ని మినహాయింపులుంటాయి. అందువల్ల ప్రయోగ ఫలితాలను నిక్కచ్చిగా ఊహించి చెప్పవచ్చు. పైకెగరేసిన బంతి భూమిమీదా, చంద్రుడిమీదా ఎంత వేగంతో వచ్చిపడుతుందో లెక్కకట్టవచ్చు. భౌతిక, రసాయన శాస్త్రాలకిది వర్తిస్తుంది కాని, జీవశాస్త్రం వంటి వాటిలో పెద్ద ఎత్తున సేకరించిన సమాచారాన్ని బట్టి స్థూలంగా మాత్రమే అంచనా వెయ్యవచ్చు. ఎందుకంటే అటువంటి నమూనాల్లో మార్పు చెందగలిగిన అంశాలు ఎక్కువగా ఉంటాయి. అలాంటప్పుడు మూల భౌతిక ప్రేరణల్లోని స్వల్ప వ్యత్యాసాలు విభిన్న ఫలితాలని కలిగిస్తూ ఉంటాయి. చరిత్ర వంటి విషయాల్లో ఇది మరీ అసాధ్యం అనిపిస్తుంది. వీటిలో సామాన్యంగా గడిచిపోయిన విషయాలని శాస్త్రీయంగా వివరించడం సులువుగా అనిపిస్తుందిగాని, ముందుగా ఊహించి చెప్పడం కష్టమే. జరిగిన సంఘటనల్లో వ్యక్తుల పాత్ర లేదని కాదు. ఉదాహరణకు దండయాత్రలు ఏ కారణం వల్ల జరిగినప్పటికీ వాటిని ముందుండి నడిపిన అలెగ్జాండర్, చెంఘిజ్‌ఖాన్, నెపోలియన్, హిట్లర్ తదితరుల సాహసం, స్వభావం, శక్తి సామర్థ్యాలూ మొదలైనవన్నీ చరిత్రని తీవ్రంగా ప్రభావితం చేసిన మాట నిజమే. వీ

*ఢిల్లీ జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలో ఆర్థిక శాస్త్ర శాఖలో అధ్యాపకురాలిగా పనిచేసిన ప్రఖ్యాత అర్థశాస్త్రవేత్త* **కృష్ణా భరద్వాజ్** *మైసూర్ విశ్వవిద్యాలయంలో శ్రీ కృష్ణరాజేంద్ర రజతోత్సవ ప్రత్యేక ఉపన్యాసాల వరుసలో 'ఆన్ సమ్ ఇష్యూస్ ఆఫ్ మెథడ్ ఇన్ ది ఎనాలిసిస్ ఆఫ్ సోషల్ ఛేంజ్' అనే అంశంపై 1977లో మూడు ఉపన్యాసాలు చేశారు. ఆ ఉపన్యాసాలలో సామాజిక మార్పుల గురించీ, ఆ మార్పులను అధ్యయనం చేసేటప్పుడు అనుసరించవలసిన సంవిధానం గురించీ సవివరంగా విశ్లేషించారు. మార్క్సిస్టు చారిత్రక భౌతికవాద దృక్పథం సామాజిక మార్పులను అర్థం చేసుకోవడంలో ఎలా మార్గదర్శకంగా ఉంటుందో మొదటి ఉపన్యాసంలో, ఆర్థిక శాస్త్ర సిద్ధాంతాలను అర్థం చేసుకోవడంలో పాటించవలసిన పద్ధతి ఏమిటో రెండో ఉపన్యాసంలో, భారత ఆర్థిక వ్యవస్థలో మార్పులను అర్థం చేసుకునే పద్ధతిని మూడో ఉపన్యాసంలో ఆమె వివరించారు. మొదటి ఉపన్యాసానికి స్వేచ్ఛానువాదం ఇది. – సం.*

# సామాజిక మార్పును విశ్లేషించడం ఎలా?

ఈ రజతోత్సవ ప్రత్యేక ఉపన్యాసాలు ఇవ్వవలసిందిగా నన్ను ఆహ్వానించి మైసూర్ విశ్వవిద్యాలయం నాకు గౌరవం ఇచ్చినందుకు కృతజ్ఞతలు. ఇక్కడ నన్ను మాట్లాడమని ప్రతిపాదించిన అంశం 'సమాజ పునర్నిర్మాణంలో జ్ఞానం పాత్ర' ప్రస్తుత ఉదాత్త సందర్భానికి సరిపోతుంది. ఇంత గంభీరమైన, లోతైన విషయం మీద మాట్లాడమని వచ్చిన ఆహ్వానాన్ని అంగీకరిస్తున్నప్పుడు నాకు నా పరిమితులు స్పష్టంగా తెలుసు. జ్ఞాన విజ్ఞానాల మీద ఆలోచనలు చేసే తత్వవేత్తల ప్రత్యేక బృందంతో నాకేమీ సంబంధం లేదు. అలాగే నేను సామాజిక ఆచరణలో ఉండి, అనుభవం ద్వారా కఠినమైన శిక్షణను పొందే కార్యకర్తనూ కాను. అయినా ఈ విషయం మీద మాట్లాడడానికి నేనెందుకు సాహసించానంటే, దీన్ని ఒప్పుకోకపోవడమంటే ఒక తప్పుడు అవగాహనను బలపరచినట్టే అవుతుంది. పరిశోధకులెవరైనా తమకు తెలిసినా తెలియకపోయినా తమ విద్యా కృషిని మొత్తాన్ని ఏదో ఒక సంవిధానపు పునాదిమీద, తాత్విక పునాది మీద మాత్రమే కొనసాగిస్తారనే ఆలోచనను పక్కన పెట్టడమే అవుతుంది. తాత్విక సమస్యలను తత్వశాస్త్ర నిపుణులకే వదిలేయాలని, 'ఆచరణాత్మక' వైఖరిని మాత్రమే పరిశోధకులు చేపట్టాలని కొందరు పండితులు అంటూ ఉంటారు. అట్లాగే ప్రతి విషయంలోనూ 'మౌలిక అంశాల' పట్ల శ్రద్ధ వహించడం నిర్దిష్టమైన, నిర్మాణాత్మకమైన, సృజనాత్మకమైన పనికి ఆటంకమవుతుందనీ, లేదా అవసరం లేదనీ అనే పండితులు కూడా ఉన్నారు. మొత్తం మీద అందరూ కలిసి తేల్చిందేమంటే సంవిధానానికి సంబంధించిన సమస్యలను చర్చించే పనిని జీవిత చరమాంకంలో, చేయవలసిన పనులన్నీ అయిపోయాక, ఒంటరిగా వృద్ధాప్యంలో కాలయాపన కోసం చేయవలసిందే అని. కాని ఫ్రెంచ్ నాటకకర్త మోలియర్ నాటకంలో ఒక పాత్ర అన్నట్టు 'తెలిసినా తెలియక పోయినా ప్రతి మనిషీ వచనంలోనే మాట్లాడతాడు'. తాత్విక అవగాహనలు కూడా ప్రతి పరిశోధనలోకి ప్రవేశిస్తాయి. వాటిని బయటికి గుర్తించవచ్చు, గుర్తించకుండా ఉండవచ్చు. గతకాలంలో పోగుపడిన జ్ఞానం మీద ఆధారపడిన, లేదా దానిని అభివృద్ధి చేయడానికి ఆకాంక్షిస్తున్న సైద్ధాంతిక పరిశోధన ఏదైనా తనను తాను సిద్ధాంతం నుంచి దూరం చేసుకోజాలదు. కనీసం లోలోపలనైనా అసలు అంగీకార యోగ్యమైన జ్ఞానం అంటే ఏమిటి? దాని పునాది ఏమిటి? దాన్ని సముపార్జించే ప్రక్రియ ఏమిటి? దాన్ని అంగీకరించడానికో, తిరస్కరించడానికో ఆధారాలేమిటి? అనే విషయాల గురించిన సిద్ధాంతమైనా ఉండవలసి ఉంటుంది.

సామాజిక శాస్త్రాల మౌలిక కర్తవ్యం జరుగుతున్న సామాజిక మార్పును అర్థం చేసుకోవడమూ, ఆ ప్రక్రియను వ్యాఖ్యానించడమూ అని చాలా మంది అంగీకరిస్తారు. ఆ ప్రక్రియను ప్రభావితం చేయడానికి ఆ జ్ఞానాన్ని వాడుకోవడం కూడా అవసరమని కొందరు భావిస్తారు. అటువంటప్పుడు ఆ సిద్ధాంత వేత్త ఎంత ఎత్తైన ఏకాంత దంత ప్రాకారం మీద కూర్చుని ఉన్నప్పటికీ, అతని వాదనా పద్ధతి ఎంత అమూర్తమైనదప్పటికీ సామాజిక సంబంధాల స్వభావం గురించి, నిర్మాణం గురించి, అవి పనిచేసే పద్ధతి గురించి ఒక దృక్పథం లేకుండా పని చేయజాలడు. అందువల్ల ఆ సామాజిక నిర్మాణం లోపల ఉన్న దృక్పథాన్ని బహిరంగంగానే ఎదుర్కోక తప్పని స్థితి వస్తుంది. నా పరిమితుల గురించి నాకు స్పష్టమైన అవగాహన ఉన్నప్పటికీ, ఈ తప్పనిస్థితి వల్లనే ఇవాళ ఈ విషయం మీద మాట్లాడడానికి సిద్ధపడుతున్నాను. తాత్విక భాషణ చేయడం కన్నా పైకి బహిరంగంగా ఆలోచిస్తూ కొన్ని ప్రశ్నలు లేవనెత్తడం ముఖ్యమని అనుకుంటున్నాను.

కొన్ని ప్రాతిపదికలమీద ఆధారపడి భావనీకరించడం, ఆ భావనలను ఆచరణలో అన్వయించడం, ఆ ఆచరణ ద్వారా ఆ భావనలను పునర్నిర్మించడం అనే నిరంతర ప్రక్రియ ద్వారా మాత్రమే పరిశోధన ముందుకు సాగుతుంది. అందువల్ల ఏ పరిశోధనలోనైనా దాగి ఉన్న ప్రాతిపదిక అవగాహనలేమిటో వెలికితీసి చూపడం పరిశోధకుల అనివార్య బాధ్యత అవుతుంది. ఈ కర్తవ్యం మన సమాజాలవంటి సమాజాల అధ్యయనంలో మరింత ముఖ్యమైనదీ, అవసరమైనదీ అవుతుంది. ఎందుకంటే మన దగ్గర సైద్ధాంతిక అవగాహన ఇంకా ప్రాథమిక దశలోనే ఉంది. ఇప్పటికీ పూర్తిగా భిన్నమైన చారిత్రక సందర్భాలలో, మరెక్కడో అభివృద్ధి అయిన ప్రాతిపదిక అవగాహనలను అరువు తెచ్చుకుని ఆధారపడే ధోరణే ఎక్కువగా ఉంది.

ఈ మూడు ఉపన్యాసాలలో నా ప్రయత్నమంతా సామాజిక మార్పును విశ్లేషించడంలో ఎదురయ్యే సమస్యల గురించి చర్చించడమే. నా సొంత అధ్యయన శాఖ అయిన అర్థశాస్త్రానికి సంబంధించిన

సంవిధాన సమస్యల మీద నా దృష్టి ఎక్కువగా ఉంటుంది. ఇవాళ చరిత్ర పొడవునా సామాజిక ప్రక్రియలను వ్యాఖ్యానించడానికి సంబంధించిన సాధారణ సమస్యల మీద కేంద్రీకరిస్తాను. ఆ వ్యాఖ్యానాలకూ జ్ఞాన సిద్ధాంతానికీ, ఆ వ్యాఖ్యానాలకూ సామాజిక విధానాలు రూపొందడానికీ ఉన్న సంబంధాన్ని కూడా పరిశీలిస్తాను. ఇక్కడ నేను ప్రధానంగా మార్క్స్, ఆయన సహచరులు అభివృద్ధి చేసిన భౌతిక వాద గతి తార్కిక వ్యాఖ్యానాల మీద ఆధారపడతాను. ఈ వాఖ్యానాలు విభిన్న చారిత్రిక పరిస్థితులలో సామాజిక మార్పును అధ్యయనం చేసేందుకు అర్థవంతమైన అవకాశాలను ఇస్తాయని నాకనిపిస్తుంది...

**2**

## జ్ఞానానికి ఉండే పరిశీలనా పునాది

తన చుట్టూ ఉన్న భౌతిక వాతావరణం గురించి, తాను కూడా భాగమైన సామాజిక సంబంధాల గురించి జ్ఞానాన్ని మనిషి ఎలా సముపార్జిస్తాడు? అవి ఏదో లోకాతీత శక్తి ఇచ్చే వరప్రసాదం వల్ల అందుతాయా? కేవలం తపస్సు ద్వారా మనుషులు సాధించే నిగూఢ అధ్యాత్మిక శక్తి ద్వారా మాత్రమే ఆ జ్ఞానం అందుతుందా? ప్రాచీన సమాజాలలో అమలులో ఉండిన అధిభౌతిక నిగూఢ సిద్ధాంతాలు జ్ఞానాన్ని ఇటువంటి ఇంద్రియాతీత వనరులకు ఆపాదించాయి. ఆ జ్ఞానం మనిషికి బయట మాత్రమే కాదు, మనిషికీ ప్రకృతికీ అతీతంగా ఉంటుందని కూడా చెప్పాయి. ఇటువంటి మానవాతీత, ప్రకృతి అతీత పాలనా శక్తుల గురించిన నమ్మకాలు బహుశా ఆదిమ సమాజాలలో ప్రకృతి శక్తులను అధిగమించలేమనుకుంటూ, భయపడుతూ వాటిని ఆరాధించడానికి ఏర్పాటు చేసుకున్న మంత్ర తంత్రాల నిగూఢ నిర్మాణాల ఫలితమే అయి ఉంటాయి. మతం ప్రాబల్యం వహించే సమాజాలలో జ్ఞానం అనేది కేవలం తపస్సు వల్ల, ధ్యానం వల్ల మాత్రమే వికసిస్తుందనే నమ్మకం ఉండేది. క్రమంగా ఆ పనులు చేసే మతాచార వర్గానికి సామాజిక అధికారం చేజిక్కడానికి అది ఒక సాధనం అయింది. తద్వారానే ఏర్పడిన ఒక పకడ్బందీ ఆచారపర అంతస్తుల నిర్మాణాన్ని అది సమర్థించింది.

మన సమాజమే చూస్తే, సైనిక శక్తి ఎంతమాత్రమూ లేని, భౌతిక సంపదను పోగు చేసుకోవడంలో భాగం పంచుకోని బ్రాహ్మణులు స్పష్టంగా అత్యల్ప సంఖ్యాకులై ఉండికూడా సమాజాన్ని పాలించారు. సైనిక శక్తి క్షత్రియుల సొంతం. భౌతిక సంపద వైశ్యుల విధి. బ్రాహ్మణుల కర్తవ్యం తామే రాసిన మత గ్రంథాలు చదవడం, వ్యాఖ్యానించడం మాత్రమే. సామాజిక అంతరాల వ్యవస్థలో అగ్రభాగాన ఉన్న తమ స్థానాన్ని కాపాడుకునే ఉద్దేశంతో వారు దైవభీతి అనే ఆలోచన ప్రవేశపెట్టారు. అంతకన్నా ఎక్కువగా అమాయకుల మనసులలో శబ్దం పట్ల భీతిని కూడా ప్రవేశపెట్టారు. ఎన్నో మత గ్రంథాలలో శబ్దమూ, సృష్టీ కలగలసి ఉండడం గమనార్హమైన విషయం. పాశ్చాత్య సమాజాలలో కూడా సరిగ్గా ఈ విధంగానే మతాచార వర్గం జ్ఞాన మూలాలు తమకు మాత్రమే అందుబాటులో ఉన్నాయనే పునాది మీదనే తమ ఆధ్యాత్మిక ఆధిక్యతను చూపుకున్నాయి. కాగా, మానవజాతి ఉత్పాదక శక్తులు పెరిగిన కొద్దీ, భౌతిక పరిస్థితుల గురించి జ్ఞానం పెరిగిన కొద్దీ, ఈ నిగూఢ అధిభౌతిక పునాది క్రమక్రమంగా తరిగిపోతూ వచ్చింది. జ్ఞానేంద్రియాల ద్వారా పరిసరాలను గ్రహించడం మీద ఆధారపడడం పెరిగింది. అంటే, ప్రత్యక్ష అనుభవం ద్వారా గ్రహించిన ఇంద్రియానుభూతులు, అవగాహనలు ముఖ్యమైనవనే అవగాహన పెరిగింది.

## ఇంద్రియగ్రహణంలో వ్యక్తి – భౌతికవస్తువుల ద్వంద్వం

అయితే ఇంద్రియ గ్రహణానికి పునాది ఏమిటి అనేదే అనేక రకాలుగా వ్యాఖ్యానానికి గురయింది. కొందరి దృష్టిలో మనిషి స్వీయ మానసిక ప్రపంచానికీ, మనిషికి బయట ఉన్న భౌతిక, వస్తుగత, బాహ్య ప్రపంచానికీ మధ్య కచ్చితమైన విభజన రేఖ ఉంది. మరికొందరి దృష్టిలో ఈ రెండూ ఒకదానికి మరొకటి ప్రతిఫలనం మాత్రమేనని, అందువల్ల ఒకదాన్ని మరొకదానిగా కుదించవచ్చునని ఆలోచన ఉంది. ఫ్రాన్స్‌లో హెల్విషియస్, సిస్మోండీ, గిజో, థెయిరీ, మిగ్నే వంటి వారు అభివృద్ధి చేసిన, లేదా ఇంగ్లండ్‌లో లాక్, మాంటెస్క్యూల అనుచరులు, డేవిడ్ హ్యూం, ఆడమ్ స్మిత్, జాన్ మిల్లర్ వంటి స్కాటిష్ ఆలోచనాపరులు అభివృద్ధి చేసిన పద్దెనిమిదో శతాబ్ది భౌతికవాదం మనుషుల ఆలోచనాపూర్వకమైన కార్యాచరణ అంతా కేవలం 'ఇంద్రియానుభూతుల పరివర్తన రూపమే' అని భావించారు. అంటే, మనిషికి ఉండే అన్ని ఆలోచనలు, భావాలు, అనుభూతులు కూడా అతని మీద పరిసరాలు చూపే ప్రభావపు ఫలితాలే అని అర్థం. అంటే, మనిషి ప్రధానంగా తన పరిసరాల ఉత్పత్తే అని వాళ్లు భావించారు. ఉదాహరణకు, మనిషి తనతో పాటు తన సహజాతమైన 'ఆచరణాత్మక భావాల' నిలువను తీసుకురాడని లాక్ నొక్కి చెప్పాడు. మనిషిలోని సుగుణమనేది ఎందుకు గౌరవించబడుతుందంటే అది ఆ మనిషిలో సహజంగా ఉన్నందువల్ల కాదనీ, ఆ సమాజ మనుగడకు అది ఉపయోగకరంగానూ, అనువుగానూ ఉన్నందువల్లనేననీ లాక్ అన్నాడు.

ఈ భౌతికవాద ఆలోచనా ధోరణికి చెందిన వారు ప్రధానంగానూ, మొత్తంగా ఆ కాలపు చరిత్రకారులందరూ రాజకీయ, చట్టపర నిర్మాణాలూ, ఆస్తి రూపాలూ ఒక సమాజపు అభివృద్ధిలో ఆ ప్రత్యేక దశకు అనుగుణంగానే రూపొందుతాయని వాదించారు. అంటే, ఒక ప్రత్యేక వ్యక్తి భావాలు అతని పరిసరాల వల్ల నిర్ధారితమవుతాయని. అంటే చారిత్రక పరిణామ క్రమంలో మానవ జాతి భావాలన్నీ మారుతున్న సామాజిక వాతావరణానికి అనుగుణంగానే ఉంటాయని అనుకోవలసి వస్తుంది.

అయితే ఇక్కడ ఈ భౌతికవాద ఆలోచనాపరులు ఆ వికాసయుగపు తాత్విక దృక్పథంలోకి జారిపోయినట్టు కనబడుతుంది. ఆ దృక్పథం ఏమంటే పరిసరాలైనా, సామాజిక సంబంధాలైనా 'భావాల' ప్రగతి చేత, అందువల్ల అంతిమంగా 'మానవ ప్రవృత్తి' చేత నిర్ణయమవుతాయని భావించడం. ఇక్కడ వాదన నడిచిన పద్ధతి ఇలా ఉంటుంది: లాక్, హెల్విషియస్ భావించినట్టుగా మానవ సుగుణం అనేది సహజాతం ద్వారానో, శాశ్వత లక్షణాల ద్వారానో నిర్ణయం కానట్టయితే, సామాజిక ఉపయోగపు పునాది పైననే నిర్ణయమైనట్టయితే ప్రతి చారిత్రక పరిస్థితులకు వాటివైన ప్రత్యేక మానవ ప్రవర్తనా, నైతిక నియమాలు ఉంటాయి. అవి మనిషి సామాజిక అస్తిత్వానికి కొనసాగింపుగానో, తగినట్టుగానో ఉంటాయి. అందువల్ల అన్ని విషయాలకూ మనిషే

ప్రమాణం అని చెప్పినప్పుడు అతని మారుతున్న సాంఘిక అవసరాలే సమాజ ప్రగతిని నిర్ణయిస్తాయని అర్థం.

మరొకపక్క అతని సామాజిక అవసరాలను నిర్ణయించేది మారుతున్న మానవ ప్రవృత్తే. అంటే, ఎప్పటికప్పుడు రూపొందుతున్న, మారుతున్న నైతికతా చట్రం దానికదే స్వతంత్రంగా ఉండి, ఆ కాలపు స్ఫూర్తి దానికి మార్గదర్శక సూత్రంగా ఉంటుంది. క్లుప్తంగా చెప్పాలంటే మనిషికీ, ప్రకృతికీ మధ్య సంబంధాన్ని వివరించే క్రమంలో ఈ పద్దెనిమిదో శతాబ్ది తత్వవేత్తలు కచ్చితంగానూ, కొన్ని సందర్భాల్లో రాజీలేకుండానూ భౌతికవాదులుగా ఉన్నారు. కాని, చరిత్ర గతిలో ఆ భౌతిక పరిసరాలు ఎలా మారుతాయి అనే విషయంలో వాళ్ల వివరణ చాలా బలహీనంగా ఉండింది. చరిత్రను విశ్లేషించేటప్పుడు వాళ్లు మానవ ప్రవృత్తి ప్రస్తావనతో ముగించారు. సామాజిక స్థితిని నిలిపి ఉంచడంలో, కొనసాగించడంలో తగిన నైతిక భావనల దగ్గర ముగించారు. వాళ్ల దృష్టిలో అంతిమంగా చరిత్రను మారుతున్న మానవ ప్రవృత్తి దృష్ట్యానే వివరించగలం.

ఇందుకు భిన్నంగా బిషప్ బర్కిలీ వంటివారు ప్రతిపాదించిన స్వీయాత్మక భావవాద దృక్పథం బాహ్య ప్రపంచం మొత్తాన్నీ మన ఇంద్రియానుభూతుల గ్రహణాల సృష్టిగా గుర్తించింది. ఈ తత్వవేత్తల దృష్టిలో మనకు బాహ్యంగా ఉన్న వస్తువులన్నీ మన ఇంద్రియానుభూతుల, ఆలోచనల సమ్మేళనం మాత్రమే. అలా గుర్తించిన వస్తువులతో మానవ గ్రహణం తాదాత్మ్యం పొందుతుంది. అంటే పరిశీలకుడి చైతన్యానికి అతీతంగా బాహ్య ప్రపంచం అనేది ఉనికిలో లేదు. వస్తుగత భౌతిక ప్రపంచాన్ని ఈ విధంగా వ్యక్తివాదంతో నిరాకరించడమూ, మొత్తం జ్ఞానానికి మూలాన్ని స్వీయాత్మక చైతన్యంలో మాత్రమే గుర్తించడమూ అధిభౌతికవాదానికి దారితీస్తుంది. ఇటువంటి అతివాద స్వీయాత్మకత వల్ల వస్తువుల మధ్య సంబంధాలు కనిపెట్టడంలో విఫలం అవుతాం. లేదా, ఇటువంటి వ్యక్తివాద పునాదుల వల్ల మానవ సమాజాల చరిత్రను శాసించేదేమిటో తెలుసుకోలేక పోతాం.

వస్తుగత భావవాదులు కూడా ఉన్నారు. వారు బాహ్య ప్రపంచపు ఉనికిని గుర్తించారు. దానిలోని మార్పులను కూడా గుర్తించారు. కాని, ఆ మార్పులకు దారితీసే కారణభూతమైన శక్తులను భౌతికేతర, అమూర్త భావనలో చూశారు. వాటికి హేతువు అనో, భావం అనో, కాలధర్మం అనో అటువంటి మరేదో పేరు పెట్టారు. మానవ సమాజాలలో ప్రతి దశను నిర్ణయించేది, స్వభావాన్నిచ్చేది భావం అని వాళ్లు భావించారు. ఆ పాలక భావంలో గెంతులు లేదా గుణాత్మక మార్పులు వచ్చినప్పుడు సమాజం ఒక యుగం నుంచి మరొక యుగానికి పరివర్తన చెందుతుందని వాళ్లు అన్నారు. ఇటువంటి భావాన్ని ప్రతిపాదించిన వాళ్లు చాలామంది ఉన్నారు గాని వారికి ప్రతినిధులుగా ప్లేటో, లీబ్నిజ్, సెయింట్ సైమన్, హెగెల్‌లను చెప్పుకోవచ్చు. మార్పు స్వభావం ఏమిటి అని గుర్తించేటప్పుడూ, సూత్రీకరించేటప్పుడూ హెగెల్ ఉపయోగించిన గతితార్కిక వాదనా పద్ధతి మౌలికంగా కొత్తది. అందువల్ల చారిత్రక పరివర్తన గురించి ఆయన చేసిన వ్యాఖ్యానాలలో అద్భుతమైన ప్రతిపాదనలున్నాయి. ఆ ప్రతిపాదనలలో కొన్నిటిని స్వీయాత్మక-వస్తుగత సంబంధాల విషయంలో మౌలికంగా మార్చి చరిత్ర పట్ల భౌతిక, గతితార్కిక అవగాహనలో వాడుకున్నాడు మార్క్స్. ఈ భావవాదులు చరిత్ర చోదక శక్తిగా భావం మీద పెట్టిన మితిమీరిన శ్రద్ధ ఒక సర్వస్వతంత్ర, అమూర్త భావన మీదనే మొత్తం బాధ్యత పెట్టింది. అందువల్ల సమాజంలో మనిషి సాగించే ఆచరణాత్మక కృషికి, శ్రమకు ఎటువంటి సంబంధం లేకపోయింది. ఇటువంటి సిద్ధాంతాల వల్ల మహామానవుడు, విశ్వమానవుడు, మహానాయకుడు, వీరుడు వంటి భావనలు తలెత్తాయి. ఉత్తమ జాతి, ఉత్తమ రాజ్యం వంటి భావనలు తలెత్తాయి. ఆ మనిషినో, ఆ రాజ్యాన్నో, ఆ జాతినో, ఆ పరమ భావపు వ్యక్తీకరణగా, కాలధర్మపు వ్యక్తీకరణగా చూడడం మొదలైంది. హెగెల్ ఉపయోగించిన విప్లవాత్మకమైన గతితార్కిక పద్ధతి దాని భావవాదం వల్ల ధ్వంసం అయిపోయి ఒక మితవాద నిర్ధారణ మిగిలింది. ఆనాటి ప్రష్యన్ రాజ్యమే అత్యుత్తమ, అత్యున్నత రాజ్యమనే మితవాద జర్మన్ భావజాలం మిగిలింది.

## ఆచరణకూ, సిద్ధాంతానికీ మధ్య సంబంధం

ఇక్కడ కీలకమైన అంశం ఒకటుంది. అది ఏ ఆలోచనకయినా ముందు ఇంద్రియానుభూతులుంటాయి అనే నిస్సందేహమైన వాస్తవం కాదు. అంతకన్న ముఖ్యమైన వాస్తవం ఏమంటే మనుషులు తమకు బాహ్యంగా ఉన్న భౌతిక ప్రపంచం మీద పనిచేసే, శ్రమించే, ఆచరణలో పాల్గొనే క్రమంలో పొందే అనుభవాలలో ఇంద్రియానుభూతులు గ్రహిస్తారు. అవే ఆలోచనకు పురిగొల్పుతాయి. అంటే మనిషి జ్ఞానం అతని శారీరక, ఆచరణాత్మక కృషిలో మాత్రమే అభివృద్ధి చెందుతుంది. ఈ క్రమంలో మనిషి భౌతిక శక్తుల మీద పనిచేస్తాడు. భౌతిక శక్తులతో పాటు పనిచేస్తాడు. తన మనుగడ సాగడం కొరకు అంటే జీవితం కొరకు చేసే పోరాట అవసరమే అనివార్యంగా మనిషిపైన ఒక కర్తవ్యాన్ని విధించింది. తన చుట్టూ ఉన్న భౌతిక వస్తువుల మధ్య సంబంధాలను శాసించే శక్తులేవో తెలుసుకొని, తన అదుపులోకి తీసుకొని, తన సౌకర్యం కొరకు వాడుకునేలా చూసుకోవడమే ఆ కర్తవ్యం. మనిషి తన ఆచరణాత్మక కృషిలో ఎల్లప్పుడూ ప్రకృతిని ఎదుర్కోవలసి వస్తుంది. కొన్నిసార్లు దానిమీద పోరాడవలసి వస్తుంది. కొన్నిసార్లు దానితో మైత్రి నెరపవలసి వస్తుంది. ఈ క్రమంలోనే తన ఇంద్రియానుభూతుల మీద ఆధారపడి మనిషి ఇంద్రియ జ్ఞానాన్ని సంపాదిస్తాడు. అందువల్ల జ్ఞాన సిద్ధాంతం అనేది అనివార్యంగా ఈ పోరాట చరిత్రతో ముడిపడినదే. అంటే, ఈ పోరాట చరిత్రే మానవ నాగరికతా చరిత్ర అవుతుంది. భౌతిక సంబంధాల గురించిన మనిషి జ్ఞానం, అతని వ్యాఖ్యానాలు, అతని అవగాహన, భౌతికశక్తులు అతన్ని ప్రభావితం చేసే తీరు క్రమక్రమంగా విస్తరించాయి. ఈ ఉత్పత్తి శక్తుల మీద తన ఆధిపత్యాన్ని నెలకొల్పుకోవడం ద్వారా ప్రకృతిని శాసించే భౌతిక సూత్రాల గురించిన జ్ఞానాన్ని సముపార్జించడం ద్వారా, తనకు పరిమితులు విధించే ప్రకృతి ఆవశ్యకతలను గుర్తించడం ద్వారా మనిషి తన ఉత్పాదక సామర్థ్యాన్ని ఇతోధికంగా అభివృద్ధి చేసుకోగల స్వాతంత్ర్యాన్ని పొందాడు.

మొట్టమొదట మనిషికి ఈ ఇంద్రియ జ్ఞానం ఒకదానికొకటి సంబంధంలేని, విడివిడి యాదృచ్ఛిక వాస్తవ అనుభవ శకలాలుగా అందుతుంది. అక్కడి నుంచి రెండో అడుగుగా మనిషి వేరు వేరు అనుభవాల మధ్య ఏకసూత్రతను గుర్తిస్తాడు. వాటిమీద ఆధారపడి ఆ వాస్తవాలను తార్కికంగా, హేతుబద్ధంగా ఒక వరుసలో పెట్టుకుంటాడు. అప్పుడు ఈ ఇంద్రియ జ్ఞానం గుణాత్మకంగా పరివర్తన చెంది, తాత్విక జ్ఞానం అవుతుంది. దానికి హేతుబద్ధ ఆలోచనా, తర్కమూ అనే

ప్రక్రియలు తోడవుతాయి. వీటినుంచి సాధారణీకరించి, అమూర్తీకరించి చూసినప్పుడు సిద్ధాంతం తయారవుతుంది. ఇంకా ఇంకా ఎక్కువ అనుభూతులూ, పరిశీలనలూ పోగైనకొద్దీ, వాటిని సంఘటితపరిచే తార్కిక క్రమాలలో సిద్ధాంతాలు కూడా మారిపోతూ ఉంటాయి.

ఆదిమ సమాజాలు జ్ఞాపకం ఉంచుకునే, పదే పదే వల్లించే పద్ధతులమీద ఆధారపడ్డాయి. అందుకే అప్పుడు జ్ఞాపక శక్తి సూత్రాలనూ, ధారణా సూత్రాలనూ కనిపెట్టారు. ఈ జ్ఞాపకాన్ని మరింత అభివృద్ధి చేసి జ్ఞానాన్ని వర్గీకరించే, విడివిడిగా అరలలో పెట్టే పద్ధతి కనిపెట్టారు. తద్వారా వేరు వేరు వాస్తవాలను కొన్ని అమూర్త వర్గాలుగా విభజించడం జరిగింది. కాలక్రమంలో ఆ తర్వాత కొన్ని వస్తువులను చూసి ఒక సూత్రీకరణ చేయడం, ఒక సూత్రీకరణ నుంచి ఆ వస్తువు సరిపోతుందా లేదా చూడడం వంటి పద్ధతుల ద్వారా నిర్మాణాత్మకమైన వాదనా పద్ధతులను అభివృద్ధి చేసే సంక్లిష్ట ప్రక్రియలు మొదలయ్యాయి. జ్ఞాన సముపార్జన పెరుగుతున్న కొద్దీ విశ్లేషణా పరికరాలు కూడా అభివృద్ధి చెందాయి. ఆ క్రమంలోనే ప్రయోగపరికరాలు కూడా అభివృద్ధి చెందాయి. ఈ ప్రయోగ పరికరాలకు మనిషి అదుపులో ఉన్న ఉత్పత్తి శక్తుల స్థాయిని పెంచడంలో ప్రత్యక్ష పాత్ర ఉంది. పరిశీలనా, ప్రయోగ పరికరాలు క్రమక్రమంగా అభివృద్ధి చెందుతూ తమ కచ్చితత్వాన్నీ, మెరుగైన పనితనాన్నీ పెంచుకున్న కొద్దీ సాంకేతిక పరిజ్ఞాన సరిహద్దులు విస్తరించాయి.

అంటే ఆచరణకూ, చరిత్ర క్రమంలో నిర్ధారితమైన సిద్ధాంతానికీ అత్యంత సన్నిహితమైన, అవిభాజ్యమైన సంబంధం ఉంది. అయితే ఆ సంబంధం అక్కడితో మాత్రమే ఆగిపోలేదు. ఒకసారి తయారైన సిద్ధాంతపు సమంజసత్వం అది మళ్లీ ఆచరణలో పనిచేస్తుందా లేదా అనే పరీక్షలోనే ఉంటుంది. అంటే, ఒక సిద్ధాంతం అనుభవం ద్వారా వెలికి వచ్చిన ఫలితాలనే ఇవ్వగలుగుతుందా లేదా అనే పరీక్ష. భౌతిక శాస్త్రాలలో, ప్రయోగాలలో ఈ పరీక్షను బహిరంగంగా ఎల్లప్పుడూ నిర్వహిస్తూ ఉంటారు. కాని ఈ పరీక్ష సామాజిక శాస్త్రాలకు కూడా అవసరమైనదే. ఒక సిద్ధాంతం ఊహించే, ప్రతిపాదించే ఫలితాలు వాస్తవ ఆచరణ క్రమంలో, వాటిమీద ఆధారపడిన వ్యూహాలు అనుసరించే క్రమంలో విజయవంతం అవుతాయా లేదా అనేదే ఆ పరీక్ష. చరిత్ర మొత్తంలో జ్ఞానం అభివృద్ధి అయిన క్రమాన్ని పరిశీలిస్తే ఈ రకంగా ఆచరణకూ, సిద్ధాంతానికీ మధ్య నిరంతర అన్యోన్య చర్య, ప్రతిచర్య ఉండడం కనబడుతుంది. ఆచరణ లేకుండా కేవలం తపస్సుతో, ఆలోచనతో గ్రహించగలిగిన బాహ్యమైన జ్ఞాన మూలం ఏదీలేదు.

## మానవ ఆచరణలో చైతన్యం పాత్ర

అయితే ప్రకృతిలో మనిషి ఆచరణను జంతుజాతుల ఆచరణ నుంచి వేరుచేసి చూపే ఒక ముఖ్యమైన లక్షణం ఉంది. భౌతిక శక్తుల మీద పనిచేసే క్రమంలో భౌతిక ప్రకృతి నియమాల పరిమితుల లోపలే పనిచేస్తూ ఉన్నప్పటికీ మనిషి ప్రకృతిని మార్చడం మాత్రమే కాదు, తనను తాను కూడా మార్చుకుంటాడు. భౌతిక శక్తుల గురించి మనిషి జ్ఞానం అతని చేత వాటిని మార్పించింది. వాటిని అధిగమింపజేసింది. ఆ భౌతిక శక్తులనే తనకు సౌకర్యవంతంగా మార్చుకునేలా చేసింది. అలా తన సామర్థ్యాలను పెంచుకుంటూ మనిషి క్రమక్రమంగా తన పరిసరాలను కూడా మారుస్తాడు. ఇక్కడ ముఖ్యమైనదేమంటే తన చుట్టూ ఉన్న భౌతిక పరిస్థితులను మారుస్తున్న క్రమంలో మనిషి తనంతట తాను కూడా మారడం. మనిషి తన చుట్టూ ఉన్న వాతావరణపు ఫలితమే అయినప్పటికీ అతను ఆ ప్రకృతిలో చైతన్యయుతంగా జోక్యం చేసుకుంటాడు. మిగతా జంతువులన్నీ మౌలికంగా సహజాతం కొద్దీ లేదా అసంకల్పిత ప్రతీకార చర్యగా ప్రకృతి మీద పనిచేస్తాయి. మనిషి చైతన్యయుతంగా ప్రకృతిమీద పనిచేస్తాడు. మనిషంటే పనిముట్లు తయారు చేసే జంతువు అని ఇదివరకే నిర్వచించి ఉన్నారు. ప్రకృతి శక్తులనూ, సామర్థ్యాలనూ మనిషి ఒక ఉద్దేశపూర్వకమైన ప్రణాళిక ద్వారా ఉత్పత్తికి ఉపయోగపడే పనిముట్లుగా మారుస్తాడు. మనిషి కనిపెట్టిన అటువంటి సృజనాత్మకమైన పరికరాలలో అత్యద్భుతమైన ఉదాహరణ భాషాభివృద్ధి. అది ఎంత శక్తివంతమైన పరికరమంటే, దాని ద్వారా ఇంద్రియజ్ఞానాన్ని తార్కిక జ్ఞానంగా సంఘటితం చేయడం మాత్రమే కాదు, పరస్పర సంభాషణా సంబంధాల ద్వారా మనిషి సామాజిక మనుగడకే అది ఉపయోగపడుతుంది. మనిషి ఆచరణలో ఉండే ఈ చైతన్యం అనే లక్షణాన్ని తొలి భౌతికవాదులు గుడ్డిగా విస్మరించారు. మనిషి అనివార్యంగా విధ్యుక్త ధర్మంగా భౌతిక వాతావరణం చేత శాసించబడే వాడే అనుకున్నారు. మనిషి అనే స్వీయాత్మక శక్తి, వస్తువు అనే భౌతిక శక్తులకు లొంగి సంపూర్ణంగా బానిసగా ఉండవలసిందే అనుకున్నారు. కాని మార్క్స్ అన్నట్టుగా 'అత్యంత అసమర్థుడైన వాస్తు శిల్పికీ అత్యద్భుతమైన తేనెటీగకూ తేడా ఏమంటే వాస్తు శిల్పి వాస్తవంగా భవన నిర్మాణం జరగకముందే తన ఊహలోనే భవనాన్ని నిర్మించగలడు. తేనెటీగ మాత్రం ఏ ఊహా లేకుండా సహజాతంగా ఆ నిర్మాణం సాగిస్తుంది.'

ప్రకృతికీ, మనిషికీ ఉన్న సంబంధాన్ని ఈ విధంగా నిర్వచించడంలో అప్పటి వరకూ తత్వశాస్త్రంలో వ్యక్తికీ, వస్తువుకూ – స్వీయాత్మకతకూ, భౌతికతకూ సంబంధం ఏమిటనే ఉన్న సమస్య పరిష్కారం అయింది. అప్పటివరకూ ఉండిన రెండు అతివాద వైఖరులలో ఏ ఒక్కదాన్ని తీసుకోనక్కర్లేదు. శాశ్వతమైన, మారడానికి వీల్లేని సూత్రాలతో నిర్మాణమైన భౌతిక ప్రపంచమే వ్యక్తి మానసిక ప్రపంచాన్ని నిర్ణయిస్తుందనే వైఖరి అక్కర్లేదు. లేదా, మనిషి స్వీయాత్మక అనుభూతుల ప్రతిఫలనంగానే భౌతిక ప్రపంచం ఉన్నదనీ, దానికి స్వతంత్ర అస్తిత్వం లేదనీ భావించే వైఖరీ అక్కర్లేదు. ఇలా రెండు ధృవాల మధ్య వైరుధ్యం లాగా కనబడిన సమస్యను భౌతిక శక్తులకూ, వ్యక్తుల స్వీయ మానసిక అనుభూతుల చైతన్యానికీ మధ్య పరస్పర అన్యోన్య చర్య-ప్రతిచర్యలు ఉంటాయని గుర్తించడం ద్వారా పరిష్కరించడం జరిగింది. ఆలోచన కన్న ముందు ఇంద్రియానుభూతులు ఉంటాయనీ, అప్పటివరకూ చారిత్రకంగా అభివృద్ధి అయిన భౌతిక ఉత్పత్తి శక్తుల పరిమితుల లోపల మాత్రమే ఆచరణ సాధ్యమవుతుందనీ అనుకోవడంలో పాత భౌతిక వాద దృక్పథం కొనసాగినట్టు కనబడుతుంది. కానీ, ఇంకెంత మాత్రమూ అమాయకమైన యాంత్రికమైన ఏకముఖ నియతివాద రూపంలో కాదు. మనిషికీ ప్రకృతికీ మధ్య సంబంధం పూర్తిగా ఏకముఖమూ కాదని, శాశ్వతంగా స్థిరమైనదీ కాదని అంగీకరించిన మరుక్షణమే జ్ఞాన అభివృద్ధి క్రమం మానవాచరణ అనే చారిత్రక ప్రగతితో ముడివడి ఉందని అర్థమవుతుంది. అంటే, చరిత్ర క్రమంలో అంతకంతకూ ఎక్కువగా మనిషి ఉత్పత్తి శక్తులను తన అధీనంలోకి తెచ్చుకున్న చరిత్రకూ, జ్ఞాన అభివృద్ధికీ సంబంధం అర్థమవుతుంది.

బహుశా ఈ కారణం వల్లనేనేమో సామాజిక పరిణామ శాస్త్రవేత్తలందరూ తమకు తవ్వకాలలో దొరికిన పనిముట్లను బట్టీ, ఉత్పత్తి పరికరాలను బట్టీ, ఇతర భౌతిక వస్తువులను బట్టీ, పాత సమాజాల జీవన విధానాన్ని పునర్నిర్మించగలిగారు. వారి ప్రయత్నమంతా అప్పటికి మనుషులు సాధించిన భౌతిక పురోగతి దశను గుర్తించి దాని ఆధారంగా వారి సామాజిక జీవనపు స్వభావాన్ని, బయటి ప్రపంచంతో వారి సంబంధాలను, వారు నిర్మించుకున్న వ్యవస్థలను, ఆచారాలను, మతవిశ్వాసాలను, సామాజిక కట్టుబాట్లను నిర్ధారించడం. ఈ మొత్తానికీ భౌతిక అవశేషాలే పునాది.

## ఆచరణకు సామాజిక పునాది

మనం మాట్లాడుకుంటున్న విషయానికి అత్యంత ముఖ్యమైనదేమంటే మనిషి ఒంటరిగా ఏ పనీ చేయలేడనేది. మనిషి కార్యాచరణ ఏదైనా సమాజంలో మాత్రమే జరుగుతుంది. ఒక వ్యక్తిని వ్యక్తిగా మాత్రమే చూస్తే, అతను ఉన్న సామాజిక సందర్భం నుంచి మినహాయిస్తే అతనికి మనుగడే లేదు. 'ఒక మనిషి రాజు ఎందుకవుతాడంటే, మిగిలిన మనుషులందరూ అతనితో పాలితులుగా సంబంధంలో ఉంటారు గనుక. అదే సమయంలో వాళ్లందరూ అతను రాజు గనుక తాము పాలితులమని అనుకుంటూ ఉంటారు' అని మార్క్స్ అన్నాడు. తమ ఆచరణాత్మకమైన శ్రమ క్రమంలో మనుషులు అనివార్యంగా సామాజిక సంబంధాలలో ప్రవేశిస్తారు. అలా అభివృద్ధి చెందే సామాజిక సంబంధాలు కూడా యాదృచ్ఛికంగా, నిరంకుశంగా అభివృద్ధి చెందవు. ఆనాటికి అభివృద్ధి చెంది ఉన్న ఉత్పత్తి శక్తుల స్థితితో చారిత్రక సమన్వయంతో మాత్రమే ఆ సంబంధాలు రూపొందుతాయి. కొన్ని రకాల ఉత్పత్తి సంబంధాలు, వాటితో కలగలసిన ఆస్తి సంబంధాలు, ఆనాటి ఉత్పిత్తి శక్తులను వినియోగించడానికి ఎక్కువ వీలుగా ఉంటాయి. అంటే చారిత్రకంగా సముపార్జించిన జ్ఞానాన్ని అత్యంత ప్రగతిశీలంగా ఉపయోగించడానికి వీలుగా ఉంటాయి. ఈ సంబంధాలు పాత సంబంధాలను రద్దు చేస్తూ నిర్ధారితమవుతాయి.

ఆదిమ సమాజపు తొలి దశలో భౌతిక సంపద సాధించాలంటే దోపిడీ, దాడి, తక్షణ సులభ సాధ్యమైన రూపాలుగా ఉండేవి. అందువల్లనే దోపిడీ చేసి శత్రువును హతమార్చడం భౌతికంగా ఎక్కువ ఉపయోగకరంగా ఉండి ఉంటుంది. కాని, ఉత్పాదక సామర్థ్యం అభివృద్ధి చెందిన తరువాత ఎవరిమీద దాడి చేసి ఓడిస్తున్నారో, వారిని చంపడం కాకుండా బానిసలుగా ఉపయోగించుకోవడం ఎక్కువ భౌతిక ప్రయోజనాన్ని ఇస్తుంది. అందువల్ల బానిసత్వం అనే ఒక కొత్త వ్యవస్థ ఉనికిలోకి వచ్చింది. ఆ తరువాత ఉత్పత్తి శక్తులు మరింతగా అభివృద్ధి చెందిన తరువాత బానిస శ్రమను దోపిడీ చేయడమనేది, కేవలం ఆ బానిసకు ఉన్న జంతు సామర్థ్యం మీద మాత్రమే ఆధారపడడం, దాన్ని గ్రహించడానికి బలప్రయోగం చేయడం చాలా తక్కువ స్థాయి రూపాలని గ్రహింపు వచ్చి ఉంటుంది. అందుకు బదులుగా శ్రామికుడికి కొంత చొరవ ఇవ్వాలనీ, అతను చేసే పనిలో అతని వ్యక్తిగత భాగస్వామ్యానికి అవకాశం ఇవ్వాలనీ, అలా చేస్తే అతను మరింత హెచ్చు శ్రమ చేయగలడనీ గుర్తింపు వచ్చి ఉంటుంది. అందుకే అర్థబానిస వ్యవస్థ ఉనికిలోకి వచ్చింది. ఇదే విధంగా మరొక సందర్భం నుంచి ఉదాహరణ ఇవ్వాలంటే సామ్రాజ్యవాదం క్రమక్రమంగా అవలంబిస్తూ వచ్చిన వేరు వేరు రూపాల ఉదాహరణ చూడవచ్చు. మొదట, వ్యాపారం ద్వారా, రాజకీయ ఆధిపత్యం ద్వారా దోపిడీ సాగింది. శ్రమనూ, శ్రామికులనూ దిగుమతి చేసుకోవడం ద్వారా, పారిశ్రామిక పెట్టుబడిని ఎగుమతి చేయడం ద్వారా దోపిడీ సాగింది. ఆర్థిక సహాయం ఇస్తున్నామనే పేరిట దోపిడీ సాగింది. బహుళ జాతి సంస్థల గొలుసు లావాదేవీలను నడపడం ద్వారా, వ్యాపార ఒప్పందాలు చేసుకోవడం ద్వారా దోపిడీ సాగింది. ఈ వేరు వేరు పని పద్ధతులలో మార్పులు సూచించేదేమంటే ఆనాటికి అటు సామ్రాజ్యవాద దేశంలోనూ, ఇటు వలస దేశంలోనూ ఆర్థిక వ్యవస్థలలో ఉత్పత్తి శక్తులస్థాయిని బట్టి ఆ రెండు దేశాల మధ్య సంబంధం నిర్ణయమవుతుంది. అంటే, ఉత్పత్తి శక్తులలో వచ్చే మార్పులు ఉత్పత్తి సంబంధాలలోనూ, ఆస్తి సంబంధాలలోనూ, దోపిడీ రూపాలలోనూ మార్పులకు దారితీస్తాయి. అయితే వాస్తవ చరిత్రలో చాలా తరచుగా పాత సంబంధాలు, వాటి అవశేషాలు కొనసాగుతూ ఉంటాయి. అవి, పురోగమిస్తున్న ఉత్పత్తి శక్తుల మీద సంకెళ్లుగా మారుతాయి.

తొలిరోజుల్లో అభివృద్ధికి వీలు కల్పించిన పరిస్థితులే, ఇప్పుడు అవరోధాలుగా మారుతాయి. అటువంటి సందర్భాలలో కాలం చెల్లిన సంబంధాలు తోసివేయడం జరుగుతుందనీ, ఈ తోసివేత కొన్ని సందర్భాలలో హింసాత్మక కల్లోలంగా ఉండవచ్చుననీ, లేదా, క్రమానుగత చారిత్రక మార్పుగా ఉండవచ్చుననీ చరిత్ర తెలియజేస్తుంది. అంటే, చారిత్రక క్రమం అనేది నిరంతరాయంగా, మెల్లమెల్లగా జరిగిన మార్పులతో సాగినదీ, గుర్తించడానికి వీలు లేని పరిమాణాత్మక పరివర్తనలతో జరిగినదీ మాత్రమే కాదు. ఒక ఆర్థిక వ్యవస్థ చరిత్రలో యుగాలుగా గుర్తించబడేవి ఆ కాలంలో ప్రాబల్యం వహించిన నిర్దిష్ట ఉత్పత్తి విధానం ద్వారా మాత్రమే గుర్తించబడతాయి. అంటే, దానికే ప్రత్యేకమైన, నిర్దిష్ట స్వభావం గల ఉత్పత్తి సంబంధాలు కూడా ఉంటాయి. ఈ మాట అనేటప్పుడు ఒక ఆర్థిక వ్యవస్థలో ఒక ప్రత్యేక ఉత్పత్తి విధానం ఏకైకంగా, సార్వత్రికంగా ఉంటుందని నేను సూచించడం లేదు. ఏ సమయంలోనైనా ఒకే ఆర్థిక వ్యవస్థలో వేరు వేరు ఉత్పత్తి విధానాలు ఒకదానిలో ఒకటి కలిసిపోయి సహజీవనం సాగిస్తూ ఉండవచ్చు. అయితే ఒక నిర్దిష్ట విధానం మిగిలిన వాటికన్న తన ప్రాబల్యాన్ని స్థాపించుకోవడం ద్వారా దాని చలనశీలమైన గతి ద్వారా ప్రధానంగా ఉండవచ్చు. అప్పుడు అది తగిన సాధారణ స్థితి అవుతుంది. అప్పుడు మొత్తం ఆర్థిక వ్యవస్థను దాని ద్వారా గుర్తించడమో లేదా ఆ వైపుగా ప్రయాణిస్తున్నదని అనడమో జరుగుతుంది.

## ఉత్పత్తి సంబంధాలు – వర్గ విభజనలు

మరికొంచెం ముందుకు వెళితే చారిత్రకంగా అభివృద్ధి చెందిన ఉత్పత్తి సంబంధాలు ఆర్థిక వ్యవస్థను వర్గాలుగా విభజించడంలో వ్యక్తీకరణ పొందుతాయి. ఆ వర్గాలకు తమ సొంత నిర్దిష్ట ప్రయోజనాలుంటాయి. చాలా సందర్భాలలో ఆ ప్రయోజనాలు ఒకదానికొకటి వ్యతిరేకంగా, శత్రు పూరితంగా కూడా ఉంటాయి. ఉత్పత్తి శక్తుల పురోభివృద్ధి వేరు వేరు వర్గాల ప్రయోజనాల మీద వేరు వేరు ప్రభావాలు వేయడం వల్ల వర్గాల మధ్య ఘర్షణలు అనివార్యంగా పెరుగుతుంటాయి. వర్గ చైతన్యం, ఒక వర్గంలోని మనుషులకు తాము ఏ వర్గంలో ఏ ప్రయోజనాల కొరకు ఉన్నాము అనే గుర్తింపు ఈ వర్గ ఘర్షణల ధోరణులకు పదును పెడతాయి. అందువల్లనే చరిత్ర

అనివార్యంగా వర్గపోరాటాల చరిత్రగా ఉంటుంది. సాంప్రదాయిక రాజకీయార్థ శాస్త్రంలో తొలి రచనలు కూడా ఈ వర్గ వైరుధ్యాలను గుర్తించాయి. వాటిని బహిరంగంగానే విశ్లేషించాయి. ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందుతున్నప్పుడు వేరు వేరు దశలలో విభిన్న వర్గాలు రూపొందే క్రమం గురించీ, వర్గ పోరాటపు స్వరూపమూ, స్వభావమూ మారడం గురించీ ఆ రచయితలు స్పష్టంగానే ప్రకటించారు, చర్చించారు. ఆ రచయితలలో విడివిడి రచయితలను చూసినప్పుడు, వారు ఒకరితో ఒకరు జరుపుకున్న చర్చలలో తాము ఏ వర్గానికి చెందారో ఆ వర్గపు అభిప్రాయాలను బహిరంగంగానే ప్రకటించారు.

ఆడమ్ స్మిత్ మూడు విస్పష్టమైన వర్గాలున్నాయని గుర్తించాడు. భూస్వామ్య వర్గం, కార్మిక వర్గం, పెట్టుబడిదారీ వర్గం అనే ఈ మూడు వర్గాలు భిన్నమైన ప్రయోజనాలు కలిగి ఉన్నాయనీ, ఆ ప్రయోజనాలు ఒకదానికొకటి వ్యతిరేకమైనవనీ కూడా గుర్తించాడు. అలాగే తన కాలంలో జరిగిన వివాదాల నుంచి నిర్ధారణలు తీస్తూ డేవిడ్ రికార్డో భూస్వామ్య వర్గం ప్రాబల్య వర్గమనీ, జాతీయ ఉత్పత్తిని పంచుకోవడం ఎలా అనే విషయంలో సంపద పెరిగిన కొద్దీ వర్గ ప్రయోజనాల మధ్య అనివార్యమైన ఘర్షణ వస్తుందనీ గుర్తించాడు. పెట్టుబడికీ శ్రమకూ మధ్య ఉన్న వైరుధ్యం ప్రధానమైనదనీ, పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం పెరిగిన కొద్దీ ఇది పెరుగుతుందనీ, పెట్టుబడిదారీ ఉత్పత్తి సాధారణీకరించబడుతుందనీ రికార్డో అన్నాడు. కాని, 19వ శతాబ్దపు రెండో అర్ధభాగంలో తొలి దశలో ఆర్థిక శాస్త్ర సిద్ధాంతంలో వచ్చిన పరిణామాలు ఒక కొత్త దారి తీసుకున్నాయి. అప్పుడు రూపొందిన సైద్ధాంతిక చట్రాలలో నుంచి క్రమక్రమంగా వర్గ సంఘర్షణ అనే భావనను తొలగించడం, విస్మరించడం ప్రారంభించారు.

## మానవ ప్రవృత్తి – సమాజం – ముందస్తు భావాల నిరాకరణ

మనిషికీ, ప్రకృతికీ మధ్య నిరంతరాయమైన పరస్పర చర్య ప్రతిచర్య సంబంధం ఉందనీ, ఉత్పత్తి సంబంధాలతో పాటుగా ఈ సంబంధం నిరంతరాయంగా మారుతుందనీ భావించే దృక్పథం మానవ స్వభావం గురించీ, సమాజం గురించీ అవి శాశ్వతమైనవనో, పరమమైనవనో, సహజాతమైనవనో ఉండే భావాలను బలంగా సవాల్ చేస్తుంది. వేరు వేరు సందర్భాలలో చాలామంది ఊహాజనిత సంస్కరణవాదులు, మనిషికి సహజాతమైన ప్రవృత్తి ఒకటి ఉందనీ, దానికి సరిపోయేదిగానో, మానవ ఆకాంక్షలను గ్రహించేదిగానో ఒక న్యాయబద్ధమైన సామాజిక ధర్మం ఉండాలనీ భావించారు. ఆ ధర్మం మనుషుల మధ్య పరస్పర అవగాహన ద్వారా రూపొందించవచ్చునని అనుకున్నారు. 18వ శతాబ్దపు ఫ్రెంచ్ భౌతికవాదులూ, ఊహాజనిత సోషలిస్టులూ ఈ భావనతోనే ఆదర్శ సమాజాల గురించి ఊహించి, తమ సొంత, ఉదాత్త, రాజకీయ, చట్టపర సంస్కరణల నమూనాలను రూపొందించారు. రూసో తయారు చేసిన సామాజిక ఒడంబడిక సిద్ధాంతం అటువంటిదే. సమాజంలోని మనుషులందరి సాధారణ శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని, మనుషులందరూ తమ స్వతంత్ర, స్వేచ్ఛాయుత, సంకల్పం ద్వారా ఒక ఏకాభిప్రాయానికి వచ్చి ఒక సామాజిక ఒడంబడికకు సిద్ధపడతారని ఆయన అనుకున్నాడు ఆనాటి బూర్జువా సమాజపు కలకు సైద్ధాంతిక రూపం ఇచ్చాడు. అదే విధంగా ప్లేటో, సెయింట్ సైమన్, కోమ్టే, పారెటో, రాబర్ట్ ఓవెన్, బెంథామ్ వంటి మేధావులు తయారు చేసిన ఆదర్శవాద నిర్మాణాలన్నీ ఇటువంటి విశ్వాసంతో ప్రేరణ పొందినవే. వారు చేసిన కసరత్తులన్నీ మానవ స్వభావం గురించి వారికి ఉండిన ముందస్తు విశ్వాసాల మీద ఆధారపడి నిర్మించిన నమూనాలే. ఆ నమూనాల ద్వారా వారు సమాజాన్ని మళ్లీ కొత్తగా పునర్నిర్మించ దలిచారు. వారి దృష్టిలో అంతవరకు గడచిన చరిత్రకు అర్థం లేదు. లేదా, తమ నిర్మాణంతో పాత చరిత్ర అంతా రద్దయిపోతుంది. అంత దూరం పోనక్కర్లేకుండా మన ఉదాహరణే చూస్తే, రామరాజ్యాన్ని స్థాపిస్తామనే ఒక ఆదర్శ ఊహావాద భావననే చూద్దాం. ఈ భావన సమాజాన్ని అమూర్తంగా చూస్తుంది. చరిత్ర నుంచి వేరు చేసి చూస్తుంది. వర్తమానం నుంచి వేరు చేసి చూస్తుంది. నిజమైన మానవ స్వభావానికి పెడధోరణులుగానో, ఆదర్శ ప్రవర్తన లేకపోవడం వల్లనో వర్గ ఘర్షణలనేవి రూపొందలేదనే వాస్తవాన్ని విస్మరిస్తుంది. వర్గ పునాది మీద సాగే సామాజిక ఉత్పత్తి క్రమంలో వర్గ ఘర్షణలు అనివార్యంగా తలెత్తుతాయనే వాస్తవాన్ని విస్మరిస్తుంది.

మరొక సాధారణ స్థాయి ఉదాహరణ ఇవ్వాలంటే, సొంత ఆస్తి అనేది 'సహజ'మైనదనే భావన ఉంది. అన్ని నాగరిక సమాజాల మనుగడకూ అత్యవసరమైన శాశ్వత విలువగా సొంత ఆస్తిని గుర్తించాలనే, కాపాడాలనే భావన ఉంది. అలాగే సొంత ప్రయోజనం, స్వార్థం అనే ఉపయోగ ఆకాంక్ష మానవ జీవులలోని సహజాతమైన, బలీయమైన ప్రవృత్తి అనే భావన ఉంది. ఈ భావనలు అన్నీ కూడా ముందస్తుగా ఏర్పరచుకున్న భావనలే. నాగరిక సమాజాలంటే ఏమిటి? మానవ స్వభావం అంటే ఏమిటి? అనే ప్రశ్నలు వేసుకోకుండా ఏర్పరచుకున్న భావనలే.

ఇప్పటిదాకా మాట్లాడిన దాన్ని సంక్షిప్తీకరించాలంటే :

జ్ఞాన సిద్ధాంతం అనేది చరిత్ర పొడవునా మనిషి సాగిస్తూ వచ్చిన ఆచరణాత్మక శ్రమల నుంచి వేరు చేయగలిగినది కాదు. అలాగే సామాజిక సంబంధాల చరిత్రను అర్థం చేసుకొనే సాధనం ఆ శ్రమ మాత్రమే. మనిషి అనుభవానికి ప్రాథమిక వనరు అయిన ఉత్పాదక శ్రమ ఒక పరిధిలోపల మాత్రమే జరుగుతుంది. ఆ పరిధిని భౌతిక ఉత్పత్తి శక్తులు నిర్ణయిస్తాయి. ఆ పరిధి సామాజిక సంబంధాలు విధించే పరిమితుల లోపలే ఉంటుంది. అయితే ప్రకృతికీ మనిషికీ మధ్య సంబంధం ఉత్పత్తి శక్తుల ద్వారా చిత్రణ పొందుతూ కూడా అతని చైతన్యయుతమైన జోక్యం ద్వారా మారుతూ ఉంటుంది. అలాగే ఉత్పత్తి శక్తుల అభివృద్ధి వల్ల, వర్గపోరాట స్థితి వల్ల ఉత్పత్తి సంబంధాలు మారుతూ ఉంటాయి. మనిషి ఆచరణలో ప్రతి మార్పు కొత్త భౌతిక వాస్తవాలను, పరిశీలనలను వెలికితీస్తుంది. ఉత్పత్తి సంబంధాలలో ప్రతి గుణాత్మక మార్పు కొత్త భావనలకు, కొత్త ఆలోచనలకు దారితీస్తుంది. అంటే, సిద్ధాంతాలన్నీ ఒక సాపేక్షికమైన పద్ధతిలోనే అభివృద్ధి చెందుతూ ఉంటాయి. ఏకైక సిద్ధాంతం, సార్వత్రికంగా వర్తించే సిద్ధాంతం, సర్వకాలాలకూ వర్తించే సిద్ధాంతం అనేదేదీ లేదు. మనిషికి ఉండే సామాజిక అనుభవాన్ని, అతని ప్రవర్తనను ఎల్లకాలానికీ వివరించగల సిద్ధాంతం లేదు. అంటే చరిత్ర అనేది మార్క్స్ అన్నట్టు ఒక మహా యుద్ధ రంగం. అందులో సమాజమూ, ప్రకృతీ కూడా స్థల, కాలబద్ధమై ఉంటాయి.

(మిగతా వచ్చే సంచికలో) వీ

*(దైనందిన జీవితంలో ప్రజలు ఎదుర్కొనే సమస్యలను, వాటి పరిష్కారం కోసం ఆయా సమూహాలు చేస్తున్న పోరాటాల్ని ప్రతిబింబించాలని 'వీక్షణం' భావిస్తోంది. వివిధ వర్గాల, కులాల, అస్తిత్వ సమూహాల ఆశలను ఆకాంక్షలను వ్యక్తీకరణలను సామాజిక చరిత్రలో భాగంగా రికార్డ్ చేసే ఉద్దేశంతోనే 'ధర్నాచౌక్' శీర్షిక. - సం.)*

## పారిశుధ్య కార్మికుల ధర్నా

సమాజంలో తగిన గుర్తింపు, జీవనోపాధి కోసం సఫాయి కార్మికులు సఫాయి కర్మచారి ఆందోళన్ ఆధ్వర్యంలో ఫిబ్రవరి 20న ధర్నా చేశారు. కేంద్ర ప్రభుత్వం 1993లో సఫాయి వృత్తిని నిషేధించాలని చట్టం ఉన్నప్పటికీ ప్రభుత్వాల నిర్లక్ష్యం కారణంగా అది అమలు కావడం లేదని విమర్శించారు. ఆ వృత్తిలో ఉన్నవారికి విముక్తి కల్పించాలనీ, ప్రత్యామ్నాయ జీవనోపాధి చూపాలని, ఒక్కొక్కరికి ఐదు లక్షల రూపాయల ఆర్థిక సహాయాన్ని అందజేయాలని కోరారు. ఈ కార్యక్రమంలో సఫాయి కర్మచారి ఆందోళన్ జాతీయ కన్వీనర్ బెజవాడ విల్సన్, నాయకులు అనురాధ, పెన్న ఓబిలేషు, విమల, కలేకూరి ప్రసాద్ పాల్గొన్నారు.

## కాంట్రాక్టు కార్మికుల నిరసన

గ్రామీణ నీటి సరఫరా, పారిశుద్ధ్య విభాగ కాంట్రాక్ట్ కార్మికుల సమస్యలను పరిష్కరించాలంటూ ఆంధ్రప్రదేశ్ గ్రామీణ జల పథకం, పారిశుద్ధ్య కాంట్రాక్ట్ కార్మికుల సంఘం (ఎఐటియుసి) ఫిబ్రవరి 25న ఎర్రమంజిల్ పంచాయతీరాజ్ శాఖ చీఫ్ ఇంజనీర్ కార్యాలయం ముందు ధర్నా చేశారు. ప్రభుత్వం కాంట్రాక్ట్ పద్ధతిలో పనిచేస్తున్న మండల చేతిపంపు మెకానిక్కులు, సిసిడబ్ల్యూఎస్ స్కీం, నెదర్లాండ్స్, శ్రీ సత్యసాయి నీటి సరఫరా ప్రాజెక్టులు, జల నాణ్యత ప్రయోగశాలల్లో కొనసాగుతున్న అన్ని విభాగాల కార్మికుల సేవలను క్రమబద్ధీకరించాలని కోరారు. శాశ్వత ఉద్యోగుల మాదిరే కాంట్రాక్టు సిబ్బందికి నేరుగా చెక్కుల రూపంలో వేతనాలు చెల్లించాలనీ, ఇపిఎఫ్ సౌకర్యం కల్పించాలని కోరారు. కాంట్రాక్ట్ పద్ధతిలో పనిచేస్తున్న కార్మికులను గ్రామీణ నీటి సరఫరా విభాగ ఉద్యోగులుగా పరిగణించాలని డిమాండ్ చేశారు.

## వాంబే ఇళ్ల నిర్మాణం కోసం

వాంబే ఇళ్లను త్వరగా పూర్తి చేయాలని డిమాండ్ చేస్తూ లబ్ధిదారులు సిపిఎం ఆధ్వర్యంలో జిహెచ్ఎంసి ప్రధాన కార్యాలయం ముందు ఫిబ్రవరి 25న ధర్నా చేశారు. అంబర్‌పేట్ పరిధిలోని బతుకమ్మకుంట, రామకృష్ణహాట్స్‌లో 2006లో ప్రారంభించి నిలిపేసిన 276 వాంబే ఇళ్లను త్వరగా పూర్తి చేయాలని డిమాండ్ చేశారు. పన్నెండు సంవత్సరాల సుదీర్ఘ పోరాటం అనంతరం 2005లో పట్టాలు సాధించుకున్న బతుకుమ్మకుంట వాసులకు గుడిసెలు తొలగించి పక్కా ఇళ్లను 2006 వర్షాకాలంలోపు పూర్తిచేస్తామని చెప్పిన హౌసింగ్‌బోర్డ్ అధికారులు ఇంతవరకు వాంబే ఇళ్లను పూర్తి చేయలేదని విమర్శించారు. దీంతో వారంతా వీధుల్లో పడ్డారనీ, వారికి మౌలిక వసతుల్లేక ఫుట్‌పాత్‌లపై గుడిసెలు వేసుకుని దుర్భర జీవితం గడుపుతున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. హౌసింగ్ బోర్డ్ నుండి ఇళ్ల నిర్మాణం బాధ్యతలను మునిసిపల్‌కు అప్పగించిన తర్వాత పనులు నత్తనడకన సాగుతున్నాయని, నెల రోజుల్లో ఇళ్ల నిర్మాణం పూర్తి చేయకుంటే తామే స్వయంగా స్వాధీనం చేసుకుంటామని హెచ్చరించారు.

## మద్యం అమ్మకాల నియంత్రణ కోసం ఆందోళన

మద్యం అమ్మకాలను నియంత్రించాలనీ, బెల్టు షాపులను రద్దు చేయాలనీ కోరుతూ మార్చ్ 7న ఐద్వా నగర కమిటీ ఆధ్వర్యంలో నాంపల్లిలోని ఎక్సైజ్ కార్యాలయం ముందు ధర్నా చేశారు. ఆదాయం కోసం ప్రజల ప్రాణాలను ఫణంగా పెట్టొద్దని మహిళలు కోరారు. ప్రశాంతంగా ధర్నా చేస్తున్న మహిళలను వందలాది మంది పోలీసులు అరెస్టు చేసేందుకు పూనుకోగా ఆగ్రహించిన మహిళలు రోడ్డుపై బైఠాయించారు. అనంతరం పోలీసులు మహిళలను అరెస్టు చేశారు. రాబోయే ఎన్నికల్లో మద్యం అమ్మకాలను పెంచాలని ప్రభుత్వం చూస్తోందనీ, బెల్టుషాపులను, మద్యం అమ్మకాలను వెంటనే అరికట్టాలని ఈ సందర్భంగా ఐద్వా సభ్యులు కోరారు. ఇప్పటికే పేద కుటుంబాలలో పురుషుల సంపాదన సగానికిపైగా తాగుడుకే సరిపోతుందన్నారు. దీంతో మహిళలపై, చిన్నపిల్లలపై అకృత్యాలు పెరుగుతున్నాయని అన్నారు. అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా మహిళలు మద్యం అమ్మకాలకు వ్యతిరేకంగా పోరాడాలని పిలుపునిచ్చారు.

## జూట్ మిల్లు కార్మికుల ధర్నా

జూట్ మిల్లుల్లో పనిచేస్తున్న కార్మికులకు పెరిగిన డిఎను యాజమాన్యాలు చెల్లిచడం లేదని నిరిసిస్తూ జూట్ కార్మిక సంఘాల ఐక్య కార్యాచరణ కమిటీ మార్చ్ 16న రాష్ట్ర కార్మిక శాఖ కమిషనర్ కార్యాలయం ముందు ధర్నా చేసింది. ఈ ధర్నాలో విజయనగరం, విశాఖపట్నం, శ్రీకాకుళం, పశ్చిమ గోదావరి, గుంటూరు జిల్లాలకు చెందిన జూట్ కార్మికులు పాల్గొన్నారు. పెరిగిన డిఎ చెల్లించని యాజమాన్యంపై కమిషనర్ వెంటనే చర్య తీసుకోవాలని కోరారు. కార్మికులు జనవరి నెల నుంచి వేతనాలు కూడా తీసుకోకుండా నిరసన తెలుపుతున్నా యాజమాన్యం పట్టించుకోవడం లేదని విమర్శించారు.

## హాస్టల్ వసతి కోసం ఉస్మానియాలో ఆందోళన

ఉస్మానియా విశ్వవిద్యాలయం అధికారులు హాస్టల్ వసతి కల్పించడంలో నిర్లక్ష్యం వహిస్తున్నారని ఆరోపిస్తూ మార్చ్ 16న విద్యార్థులు ఎస్.ఎఫ్.ఐ. ఆధ్వర్యంలో ఆర్ట్స్ కళాశాల ముందు మండుటెండలో బైఠాయించి ఆందోళన నిర్వహించారు. విశ్వవిద్యాలయ వసతి గృహాలు శిథిలావస్థలో ఉన్నా అధికారులు పట్టించుకోవడం లేదనీ, వసతి లేక ఎస్.సి., ఎస్.టి., బి.సి. విద్యార్థులకు చదువులు సాగించలేక పోతున్నారని విమర్శించారు. పి.ఎచ్.డి. కోర్సుల్లో అడ్మిషన్లు పొందిన విద్యార్థులకు వసతి కల్పించడంలో విశ్వవిద్యాలయ యంత్రాంగం విఫలమైందని అన్నారు. వీ

## పార్లమెంట్‌లో నోరుమెదపని ఎంపీలు

తమ ఐదేళ్ల పదవీకాలంలో పార్లమెంట్ సమావేశాలలో ఒక్కసారి కూడా పెదవి విప్పని వివిధ పార్టీలకు చెందిన పదిహేను మంది ఎంపిలపై స్పీకర్ సోమ్‌నాథ్ చటర్జీ తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశారు. వీరిలో బిజెపి నేత అద్వానీ, కాంగ్రెస్ అధ్యక్షురాలు సోనియా గాంధీ కూడా ఉన్నారు. మౌనంగా ఉండే ఎంపిలను ప్రజలు కోరుకోవడం లేదనీ, ప్రజలు మిమ్మల్ని ఎన్నుకున్నది సభలో నిశ్శబ్దంగా కూర్చోడానికి కాదని స్పీకర్ వ్యాఖ్యానించారు.

## సుఖ్‌రాంకు మూడేళ్ల జైలు శిక్ష

కేంద్ర సమాచార శాఖ మాజీ మంత్రి సుఖ్‌రాం కు ఆదాయానికి మించిన ఆస్తుల కేసులో సిబిఐ ప్రత్యేక కోర్టు ఆయనకు మూడేళ్ల జైలు శిక్ష, రెండు లక్షల రూపాయల జరిమానా విధించింది. 1991-96 మధ్య సుఖరాం సంపాదించిన రు. 4.25 కోట్ల అక్రమ ఆస్తులకు సంబంధించి ఆయనపై 1996 ఆగస్టు 27న సిబిఐ అధికారులు కేసు నమోదు చేశారు. ఈ మొత్తాన్ని జప్తు చేయాలని కోర్టు ఆదేశించింది. ఆయన వెంటనే యాభై వేల వ్యక్తిగత పూచీకత్తు, ష్యూరిటీలపై బెయిల్ తీసుకున్నారు.

## గుజరాత్ అల్లర్లపై సిట్ నివేదిక

గోద్రా ఘటన తరువాత జరిగిన అల్లర్లలో కనిపించకుండా పోయిన 228 మంది మరణించినట్లుగా గుజరాత్ ప్రభుత్వం అధికారికంగా ప్రకటించింది. అప్పటి అల్లర్లలో మృతుల సంఖ్య 952 ఉండగా ఇప్పుడు అది 1180కి చేరింది. ప్రత్యేక విచారణ బృందం (సిట్) తన నివేదికను మార్చ్ 2న సుప్రీం కోర్టుకు సమర్పించింది. సిబిఐ మాజీ డైరెక్టర్ ఆర్.కె. రాఘవన్ నేతృత్వంలోని సిట్ బృందం విశ్వసనీయ నివేదికను జస్టిస్ అరిజిత్ పసాయత్ నేతృత్వంలోని ధర్మాసనానికి సమర్పించింది. ఈ నివేదిక పై నాలుగు వారాలలోగా తన వాదనను వినిపించాలని నరేంద్ర మోడీ ప్రభుత్వాన్ని సుప్రీం కోర్టు ఆదేశించింది.

## లోక్‌సభ ఎన్నికల షెడ్యూల్

పదిహేనవ లోక్‌సభకు ఎన్నికల షెడ్యూల్‌ను మార్చ్ 3న ప్రధాన ఎన్నికల కమిషనర్ (సిఇఒ) ఎన్. గోపాలస్వామి, ఎన్నికల కమిషనర్లు నవీన్ చావ్లా,ఎస్ వై ఖురేషీలు వెల్లడించారు. మొత్తం 543 స్థానాలకు ఎన్నికలు జరగనున్నాయి. ఇందులో జనరల్ - 412; ఎస్.సి. - 84; ఎస్.టి. - 47. 2004 ఎన్నికల నాటి ఓటర్ల సంఖ్య 67.10 కోట్లు కాగా తాజా సవరణ ప్రకారం ఇప్పుడు మొత్తం 71.4 కోట్ల మంది ఓటర్లు ఉన్నారు. పోలింగ్ ఐదు దశల్లో జరుగుతుంది. మొదటి దశలో ఏప్రిల్ 16న 124 స్థానాలకు, రెండవ దశలో ఏప్రిల్ 23న 141 స్థానాలకు, మూడవ దశలో ఏప్రిల్ 30న 107 స్థానాలకు, నాల్గవ దశలో మే 7న 85 స్థానాలకు, ఐదవ దశలో మే 13న 86 స్థానాలకు ఎన్నికలు జరుగుతాయి. ఓట్ల లెక్కింపు మే 16న జరుగుతుంది. జూన్ 2న 15వ లోక్‌సభ ఏర్పడుతుంది.

## ఎన్‌కౌంటర్ల తీర్పుపై సుప్రీం కోర్టు స్టే

ప్రతి ఎన్‌కౌంటర్ సంఘటనలో పోలీసులపై హత్యానేరం మోపాలని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర హైకోర్టు ఫిబ్రవరి 6న ఇచ్చిన తీర్పును సవాల్ చేస్తూ పోలీస్ అధికారుల సంఘం, ఇతర పోలీసులు సుప్రీం కోర్టులో పిటిషన్ దాఖలు చేశారు. ఈ పోలీస్ అధికారుల తరఫున సీనియర్ న్యాయవాది హరీష్ సాల్వే తన వాదనలు వినిపిస్తూ హైకోర్టు తీర్పును తప్పుపట్టారు. కేసుల తీవ్రతను పరిశీలించకుండా అన్ని ఎన్‌కౌంటర్‌లపై కేసులు నమోదు చేయాలని తీర్పును ఇవ్వడం అంటే పోలీసు అధికారులను కట్టడి చేయడమేనని వాదించారు. మార్చ్ 4న సుప్రీంకోర్టు ఈ తీర్పు పై స్టే ఇచ్చింది. పౌరహక్కుల నేతలు, విరసం నేతలు సుప్రీం కోర్టులో దీనిపై కౌంటర్ దాఖలు చేస్తున్నట్లు తెలిపారు.

## జైళ్లలో బాల నేరస్తులను ఉంచరాదు

నేరారోపణ ఉన్న బాలలను జైళ్లు, లాకప్‌లలో ఉంచరాదని, అదుపులోకి తీసుకున్న వెంటనే పోలీసులు వారిని న్యాయస్థానంలో హాజరు పరచాలని ఢిల్లీ హైకోర్టు స్పష్టం చేసింది. బాల నిందితులకు సంబంధించిన జువెనైల్ 'జస్టిస్ కేర్ అండ్ ప్రొటెక్షన్ యాక్ట్' ఈ మేరకు స్పష్టంగా చెబుతుందని తెలిపింది. ఈ విషయాన్ని జువెనైల్ జస్టిస్ బోర్డ్ (జెజెబి) పోలీసులు దృష్టిలో ఉంచుకోవాలని పేర్కొంది. మైనర్ల వాంగ్మూలం చెప్పేలా పోలీసులు ఒత్తిడి చేయరాదని స్పష్టం చేసింది.

## తమిళులకు మద్దతుగా అన్నాడిఎంకె ధర్నా

శ్రీలంకలో యుద్ధ విరమణకు చర్యలు తీసుకోవాలని తమిళనాడులోని అన్నాడిఎంకె రాష్ట్ర వ్యాప్తంగా ధర్నాలు, నిరసనకార్యక్రమాలు నిర్వహించింది. రాష్ట్ర ప్రభుత్వ అతిథి గృహంవద్ద అన్నాడిఎంకె ప్రధాన కార్యదర్శి జయలలిత అధ్యక్షతన నిరాహారదీక్ష జరిగింది. ఆమె ఈ సందర్భంగా తమిళులపై జరుగుతున్న హత్యాకాండను అడ్డుకోవడంలో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు విఫలమయ్యాయని, యుద్ధవిరమణకు చర్యలు తీసుకోలేదని విమర్శించారు. శ్రీలంకలో జరుగుతున్న పరిణామాల పట్ల తమిళప్రజలు ఆందోళన చెందుతున్నారని ఆమె వివరించారు.

## ఎన్నికల ఖర్చు చూపని వారిపై ఈసి వేటు

గత లోక్‌సభ, శాసనసభ ఎన్నికల్లో ఎన్నికల వ్యయాన్ని చూపని 3,432 మంది అభ్యర్థులపై ఎన్నికలకమిషన్ మూడేళ్ల పాటు ఎన్నికల్లో పాల్గొనకుండా నిషేధం విధించింది. వీరిలో చాలామంది ఉత్తరప్రదేశ్, బీహార్ రాష్ట్రాలకు చెందిన వారున్నారు. ఈ రాష్ట్రాల్లోని 1,691 మంది గత అసెంబ్లీ ఎన్నికలకు పోటీచేశారు. వీరిలో 99 శాతం ఇండిపెండెంట్లే. గత లోక్‌సభ ఎన్నికలకు పోటీచేసిన వారిలో యూపీకి చెందినవారు ఏడుగురు, బీహార్‌కు చెందిన 15 మందిని కూడా ఎన్నికల కమిషన్ అనర్హులుగా ప్రకటించింది. వీ

## కొలంబోపై ఎల్.టి.టి.ఇ. దాడి

శ్రీలంక రాజధాని కొలంబోపై ఫిబ్రవరి 20న ఎల్.టి.టి.ఇ. కి చెందిన రెండు విమానాలు భారీ పేలుడు సామాగ్రితో దాడి చేసాయి. సైనిక ప్రధాన కార్యాలయం, ప్రభుత్వ రెవెన్యూ శాఖ భవనం మీద ఈ దాడులు జరిగాయి. ఈ దాడుల్లో పలువురు గాయపడ్డారు. ఈ దాడి రాత్రి సమయంలో జరిగింది. ఎల్.టి.టి.ఇ.కి, సైన్యానికి మధ్య జరుగుతున్న ఈ పోరులో అమాయక పౌరులు చనిపోతున్నారని హ్యూమన్‌రైట్స్ వాచ్ సంస్థ పేర్కొంది. సైన్యం పౌరులపై, ఆసుపత్రులపై విచక్షణా రహితంగా కాల్పులు జరుపుతోందనీ, ఈ దాడులను వెంటనే ఆపివేయాల్సిందిగా ప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది.

## బంగ్లాదేశ్‌లో తిరుగుబాటు

బంగ్లాదేశ్ సరిహద్దు భద్రతా దళం బంగ్లాదేశ్ రైఫిల్స్ (బిడిఆర్) ఫిబ్రవరి 25న తిరుగుబాటు చేశారు. జీతాల పెంపు, పదోన్నతులు, పారా మిలిటరీ బలగాలకు స్వయం ప్రతిపత్తి వంటి డిమాండ్లు చేస్తూ సైనికులు రాజధాని ఢాకాలోని కేంద్ర కార్యాలయంలోని ఉన్నతాధికారులను నిర్బంధించారు. ఈ సందర్భంగా తిరుగుబాటుదారులకి సైన్యానికి మధ్య జరిగిన కాల్పుల్లో 77 మందికి పైగా మరణించారు. ఈ హత్యలతో సంబంధం ఉన్న వెయ్యిమంది సిపాయిలపై ప్రభుత్వం హత్యా నేరం నమోదు చేసింది. తిరుగుబాటుదారుల రింగ్‌లీడర్‌గా ఉన్న బిడిఆర్ డిప్యూటి అసిస్టెంట్ డైరెక్టర్ తౌహిదుల్ అలామ్‌ను మార్చ్ 2న దేశం విడిచి పారిపోవడానికి ప్రయత్నిస్తుండగా పోలీసులు అరెస్టు చేశారు.

## మ్యూజియంగా నేపాల్ రాజప్రాసాదం

నేపాల్ రాజప్రాసాదమైన నారాయణహితి ప్యాలెస్‌ను నేపాల్ ప్రభుత్వం మ్యూజియంగా మార్చేసింది. ఫిబ్రవరి 26న దీన్ని నేపాల్ ప్రధాని ప్రచండ ప్రారంభించారు. దీన్ని ఫిబ్రవరి 27 నుండి ప్రజల సందర్శనకు అనుమతించారు. ఇదొక ఉద్వేగభరితమైన సందర్భమని, రాజరికాన్ని రద్దు చేసే క్రమంలో వేలాది మంది ప్రజలు ఎన్నో త్యాగాలు చేశారని, రాజరికంపై ప్రజా విజయానికి ఇది నిదర్శనమని ఈ సందర్భంగా ప్రచండ వ్యాఖ్యానించారు.

## టిబెటన్ల స్వాతంత్ర్య పోరుకు 50 ఏళ్లు

చైనా నుంచి టిబెట్‌కు విముక్తి కోరుతూ టిబెటన్లు ప్రారంభించిన స్వాతంత్ర్య పోరుకు మార్చ్ 10 నాటికి సరిగ్గా యాభై ఏళ్లు నిండాయి. 1959 మార్చ్ 10న టిబెటన్ల ఆధ్యాత్మిక నేత దలైలామాను కమ్యూనిస్టు చైనా ప్రభుత్వం కిడ్నాప్ చేయడానికి కుట్ర పన్నిందన్న వార్త వ్యాపించడంతో దలైలామా నివాస భవనానికి రక్షణగా నిలిచిన వేలాదిమంది టిబెటన్లు, స్త్రీలు పిల్లలతో సహా అనేకమంది శతఘ్నుల కాల్పుల్లో బలైపోయారు. ఈ సంఘటనతో తిరుగుబాటు ఇతర ప్రాంతాలకు వ్యాపించింది. టిబెటన్ల స్వాతంత్ర్య పోరాటాన్ని చైనా సైనిక చర్యతో అణిచివేసింది.

## పాకిస్థాన్‌లో రాజకీయ సంక్షోభం

పాకిస్థాన్ అధ్యక్షుడు ఆసిఫ్ అలీ జర్దారీకి, మాజీ ప్రధాని నవాజ్ షరీఫ్‌కూ మధ్య నడుస్తున్న పోరుతో దేశంలో సంక్షోభం మళ్లీ మొదలైంది. సుప్రీంకోర్టు న్యాయమూర్తి ఇఫ్తికార్ చౌదరీని తిరిగి ప్రధాన న్యాయమూర్తిగా నియమించాలని డిమాండ్ చేస్తూ విపక్షాలు, న్యాయవాదులు కరాచీ నుండి ఇస్లామాబాద్‌కు లాంగ్‌మార్చ్ నిరసన ప్రదర్శన చేశారు. లాంగ్‌మార్చ్‌ను అడ్డుకునే ప్రయత్నంలో ప్రభుత్వం ప్రతిపక్ష నాయకులపై గృహనిర్బంధం విధించింది. మార్చ్ 15న నవాజ్ షరీఫ్ ఈ నిర్బంధాన్ని ధిక్కరిస్తూ లాంగ్‌మార్చ్‌లో పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఆందోళనకారులు విధ్వంసం సృష్టించారు. మార్చ్ 16న అధ్యక్షుడు జర్దారీ దిగివచ్చి ఈ సంక్షోభాన్ని ముగించారు.

## జైదీకి మూడేళ్ల శిక్ష

అమెరికా మాజీ అధ్యక్షుడు జార్జ్ బుష్ పైకి బూట్లు విసిరిన కేసులో ఇరాక్ టివి జర్నలిస్ట్ ముంతజర్ అల్ జైదీ కి ఇరాకీ న్యాయస్థానం మూడేళ్ల జైలు శిక్ష విధించింది. గత ఏడాది డిసెంబర్ 14న ఇరాక్ రాజధాని బాగ్దాద్‌లో ఒక మీడియా సమావేశంలో పాల్గొన్న ఆనాటి అమెరికా అధ్యక్షుడు బుష్‌పై జైదీ బూట్లు విసిరి సంచలనం సృష్టించాడు. మూడు నెలల విచారణ అనంతరం బాగ్దాద్ న్యాయస్థానం మార్చ్ 12న ఈ తీర్పు చెప్పింది. న్యాయస్థానంలో జైదీ 'ఇరాక్ వర్ధిల్లాల్లి!' అంటూ నినదించాడు. ఈ తీర్పు తమకు ఆమోదం కాదనీ, అప్పీలు చేస్తామని డిఫెన్స్ న్యాయవాదులు చెప్పారు.

## బొలీవియాలో భూసంస్కరణలు

బొలివీయాలో భూసంస్కరణలు అమలులోకి వచ్చాయి. బొలీవియా అధ్యక్షుడు ఇవో మోరాలెస్ తూర్పు ప్రాంతంలోని 94 వేల ఎకరాల భూమిని సంపన్నుల నుంచి స్వాధీనం చేసుకుని మార్చ్ 14న నిరుపేదలకు పంపిణీ చేశారు. సంపన్నుల వద్ద అదనంగా ఉన్న భూములను స్థానిక నిరుపేదలకు పంచిపెట్టే ఉద్దేశంతో ఈ సంస్కరణలు చేపడుతున్నారు. ఈ సందర్భంగా మోరేల్స్ 'వ్యక్తిగత ఆస్తి హక్కును గౌరవిస్తాం. అయితే సమానత్వంపై గౌరవం లేని వారు తమ వైఖరిని మార్చుకోవాల్సి ఉంటుంది. కాసుపై కాకుండా, దేశంపై దృష్టి పెట్టాల్సి ఉంటుంది' అని వ్యాఖ్యానించారు.

## ఎల్ సాల్వడార్‌లో తొలి వామపక్ష అధ్యక్షుడు

మధ్య అమెరికా దేశం ఎల్ సాల్వడార్‌లో తొలిసారిగా వామపక్ష అధ్యక్షుడి ఆధ్వర్యంలో ప్రభుత్వం ఏర్పడింది. అధ్యక్ష ఎన్నికల్లో ఒకప్పటి గెరిల్లా తిరుగుబాటుదార్ల పార్టీ ఫరాబందో మార్తి నేషనల్ లిబరేషన్ ఫ్రంట్ (ఎఫ్ఎంఎల్ఎన్) విజయం సాధించింది. ఆ పార్టీ అభ్యర్థి మార్సియో ఫ్యూన్స్ ఆ దేశపు తొలి వామపక్ష అధ్యక్షునిగా ఎన్నికయ్యారు. మార్సియో ఎన్నికల ప్రచారం సందర్భంగా 'జాతీయ ఐక్యతను సాధించడం కోసం కృషిచేస్తానని, అమెరికాతో సత్సంబంధాలు నెలకొల్పుకుంటా'మని చెప్పారు. లాటిన్ అమెరికాలో క్యూబా తర్వాత ఎల్ సాల్వడార్‌లోనే వామపక్ష అధ్యక్షుడు అధికారం చేపట్టారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : **రాంకి, వై. రామచంద్రం**

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుదుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 ఫిబ్రవరి 2009 నుండి 20 మార్చ్ 2009 వరకు)**

| జిల్లా | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) |
| ఆదిలాబాద్ | 7 | 0 | 43 | 0 | 0 | 0 | 5 | 8 | 1 | 0 | 16 | 38 | 7 | 0 | 0 | 0 | 3 | 1 |
| హైదరాబాద్ | 0 | 0 | 25 | 0 | 0 | 0 | 24 | 23 | 0 | 0 | 36 | 30 | 1 | 0 | 0 | 0 | 13 | 0 |
| కరీంనగర్ | 7 | 5 | 51 | 0 | 0 | 0 | 8 | 7 | 0 | 1 | 22 | 33 | 25 | 0 | 0 | 0 | 7 | 3 |
| ఖమ్మం | 2 | 0 | 35 | 0 | 0 | 0 | 8 | 7 | 0 | 10 | 25 | 13 | 24 | 0 | 0 | 0 | 0 | 0 |
| మహబూబ్‌నగర్ | 6 | 1 | 46 | 2 | 0 | 0 | 3 | 9 | 0 | 0 | 34 | 29 | 4 | 0 | 0 | 0 | 0 | 0 |
| మెదక్ | 6 | 1 | 40 | 0 | 0 | 0 | 10 | 2 | 0 | 1 | 40 | 43 | 15 | 0 | 0 | 0 | 0 | 0 |
| నలగొండ | 2 | 0 | 25 | 0 | 0 | 0 | 5 | 2 | 0 | 0 | 35 | 53 | 0 | 0 | 0 | 0 | 0 | 0 |
| నిజామాబాద్ | 0 | 0 | 40 | 0 | 0 | 0 | 10 | 4 | 0 | 13 | 19 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 |
| వరంగల్ | 3 | 1 | 0 | 0 | 0 | 0 | 0 | 7 | 2 | 1 | 9 | 0 | 23 | 0 | 0 | 0 | 0 | 0 |
| అనంతపురం | 8 | 1 | 24 | 0 | 0 | 0 | 8 | 3 | 0 | 2 | 18 | 7 | 8 | 0 | 0 | 0 | 0 | 0 |
| చిత్తూరు | 0 | 0 | 28 | 0 | 0 | 0 | 0 | 7 | 0 | 7 | 38 | 0 | 4 | 0 | 0 | 0 | 0 | 0 |
| కడప | 2 | 3 | 12 | 0 | 0 | 0 | 3 | 7 | 0 | 5 | 25 | 13 | 14 | 0 | 0 | 0 | 0 | 0 |
| కర్నూలు | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | |
| తూర్పు గోదావరి | 2 | 0 | 23 | 0 | 0 | 0 | 7 | 3 | 0 | 8 | 67 | 36 | 13 | 0 | 0 | 0 | 3 | 0 |
| గుంటూరు | 3 | 0 | 14 | 0 | 0 | 0 | 0 | 6 | 0 | 7 | 54 | 23 | 4 | 0 | 0 | 0 | 0 | 0 |
| కృష్ణా | 1 | 0 | 18 | 0 | 2 | 0 | 21 | 3 | 2 | 3 | 29 | 11 | 3 | 0 | 0 | 0 | 0 | 0 |
| నెల్లూరు | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | |
| ప్రకాశం | 0 | 0 | 1 | 0 | 0 | 0 | 6 | 4 | 0 | 2 | 39 | 11 | 1 | 0 | 0 | 0 | 0 | 0 |
| శ్రీకాకుళం | 0 | 0 | 10 | 0 | 0 | 0 | 7 | 0 | 0 | 0 | 19 | 19 | 12 | 0 | 0 | 0 | 0 | 0 |
| విశాఖపట్నం | 0 | 0 | 10 | 0 | 0 | 0 | 1 | 12 | 0 | 9 | 21 | 19 | 2 | 0 | 0 | 0 | 0 | 1 |
| విజయనగరం | 1 | 0 | 5 | 0 | 0 | 0 | 0 | 3 | 0 | 3 | 16 | 6 | 3 | 0 | 0 | 0 | 0 | 0 |
| **మొత్తం** | **50** | **12** | **440** | **2** | **2** | **0** | **126** | **117** | **5** | **61** | **562** | **384** | **163** | **0** | **0** | **0** | **26** | **5** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. కృష్ణ; మహబూబ్‌నగర్ – ఏసురత్నం; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; నలగొండ – డి. మహేష్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపురం – ఆదిశేషయ్య; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – బి. దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; గుంటూరు – బి. అంజమ్మ ; కృష్ణా – బి. రమేష్‌బాబు; నెల్లూరు – శ్యాంసుందర్ రావు; ప్రకాశం – మల్లికార్జున్; శ్రీకాకుళం – జి. సుధీర్; విశాఖపట్నం – కె.వి. రమణ; విజయనగరం – డి. సుధాకర్;

## వీక్షణంలో వ్యాపార ప్రకటనల గురించి....

వీక్షణం ప్రతి సంచికలోనూ అచ్చవుతున్న ప్రభుత్వ ప్రకటన గురించి, ఇటీవల అచ్చయిన కొన్ని వ్యాపార ప్రకటనల గురించి కొందరు గౌరవనీయ మిత్రులు తమ అభ్యంతరాలను, సందేహాలను వ్యక్తం చేశారు. అటువంటి అభ్యంతరాలే, సందేహాలే మరికొందరు మిత్రులలో, అభిమానులలో కూడ ఉండవచ్చు.

ఏ పత్రిక అయినా అచ్చువేసే వ్యాపార ప్రకటనలతో ఆ పత్రికకు ఏకీభావం ఉండాలనే నియమమేమీలేదు. ఆ వ్యాపార ప్రకటనలను స్వీకరించడమాలేదా అన్నది పత్రిక ఇష్టాయిష్టాలకు సంబంధించిన అంశం కాదు. పత్రికారంగ ఆర్థిక స్థితికి సంబంధించిన విషయం. ప్రస్తుత పరిస్థితుల్లో కేవలం అమ్మకాల ఆదాయం మీద మాత్రమే ఆధారపడి ఏ పత్రికా నిలదొక్కుకోవడం సాధ్యం కాదు. అమ్మకాల ద్వారా వచ్చే ఆదాయం పత్రిక ఉత్పత్తి వ్యయంలో కొంతభాగాన్ని మాత్రమే పూరించగలుగుతుంది. అందువల్లనే పత్రికారంగం సాధారణంగా వ్యాపార ప్రకటనల ద్వారా ఆ లోటును పూరించుకోవడం మాత్రమే గాక లాభాలు కూడ చేసుకుంటుంది. వీక్షణం వంటి ప్రత్యామ్నాయ పత్రికలకు లాభాల సంగతి అలా ఉంచి, కనీస మనుగడకు అవసరమైన ఆర్థిక వనరులయినా కావాలి. అందుకోసం కొన్ని వ్యాపార ప్రకటనలనయినా అంగీకరించకతప్పదు.

ప్రభుత్వం ఇచ్చే ప్రకటనలన్నిటినీ పెద్ద పత్రికలు, పాలకపార్టీ ఆశ్రిత పత్రికలు, పైరవీకారులు కబ్జా చేస్తున్నారని, ఆ ప్రకటనల విధానంలో పారదర్శకత ఉండాలని, చిన్న పత్రికలకు ప్రాధాన్యత ఉండాలని ఎంతో కాలంగా ఆందోళన జరిగిన ఫలితంగా కొన్ని సంవత్సరాల కింద ప్రభుత్వ ప్రకటనలలో చిన్న పత్రికలకు తప్పనిసరిగా కొంతభాగం కేటాయించాలనే నిబంధనలు అమలులోకి వచ్చాయి. అందువల్ల వీక్షణంకు వస్తున్న ప్రభుత్వ ప్రకటన చిన్న పత్రికల హక్కుగా వస్తున్నదే తప్ప వీక్షణంలో అచ్చయ్యే రచనల మీద ప్రభావం వేయగలిగినది కాదు. నిజానికి ఆ ప్రకటన వల్ల వీక్షణం తన వైఖరిలో ఎప్పుడయినా ఏ మెతకవైఖరినయినా ప్రదర్శించి ఉంటే ఎవరయినా దాన్ని ఎత్తిచూపి సరిదిద్దవచ్చు.

పత్రిక నిర్వహణ కొరకు వ్యాపార ప్రకటనలను స్వీకరించకతప్పని దుస్థితిలో అవి రచనల మీద ప్రభావం వేయకుండా జాగ్రత్త పడడం తప్ప ప్రస్తుతానికి మరేమీ చేయగల అవకాశం లేదు. వ్యాపార ప్రకటనలను ఎంతమాత్రం స్వీకరించబోమని ప్రకటించాలంటే పత్రికకు విస్తారమైన ప్రజాసంఘీభావం ఉండాలి. అది ఆర్థిక స్వావలంబనగా మారగలిగిన స్థితి ఉండాలి. లేకపోతే కొంతకాలం విరాళాలమీదనో, అప్పుల మీదనో నడిపి ఆ తర్వాత పత్రికను ఆపివేయడం మినహా మరోమార్గం లేదు. ఈ అంశాలను పాఠకుల, అభిమానుల దృష్టికి తీసుకురావడం మా బాధ్యతగా భావిస్తున్నాం.




**వివరాలకు సంప్రదించవలసిన చిరునామా**

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.

ఫాక్స్, ఫోన్ : 040-66843495, ఇమెయిల్ : veekshanam2003@gmail.com, reachcdrc@yahoo.com

సర్క్యులేషన్ మేనేజర్ : 9949391028

RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 29/3/2009 ● Postal Regn. No. LII/RNP/HD/1100/2008-10

# త్వరలో వెలువడనున్న వీక్షణం ప్రచురణలు

వ్యవసాయం, పరిశ్రమలు, సేవారంగం, ఆర్థిక వ్యవహారాలు, ఉపాధి, పాలన,
ప్రాంతీయ అసమానతలు, ప్రజా ఉద్యమాలు, తదితర అంశాలపై

## వి. హనుమంతరావు
## వ్యాసాల సంకలనం



సామాజిక అధ్యయనం ఎలా చేయాలి? గ్రామీణ ప్రాంతాల పరిశీలనలో ముఖ్యమైన అంశాలేమిటి?
సాహిత్యం ద్వారా సమాజ పరిణామాలను గుర్తించడం ఎట్లా? వంటి అనేక మౌలిక అంశాలపై
లోతయిన ఆలోచనలను రేకెత్తించే

## ముదునూరి భారతి
## వ్యాసాల సంకలనం



భారత రాజకీయార్థిక పరిణామాలు, ప్రణాళికలు, ప్రజల చరిత్ర, ప్రజా ఉద్యమాలు మొదలయిన
అనేక కోణాలలో తాత్విక ప్రశ్నలు సంధించి, కొత్త ఆలోచనలు రగిలించే

## ఆర్.ఎస్. రావు
## వ్యాసాల సంకలనం



110 ఏళ్ల అమెరికా దురాక్రమణల చరిత్ర
స్టీఫెన్ కింజెర్ రచన 'ఓవర్ త్రో' కు కొణతం దిలీప్ తెలుగు అనువాదం

## కుట్రరాజకీయం

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, 1-9-1126/B, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao